క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

ముందే పాలుకలిపివున్నది




## అధిక రుచికరం అధిక సంపూర్ణం

**ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు పాపాయి పెరుగుదలకు మంచిది.**

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.
కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కలిగినది. గట్టి పళ్లు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కలిగినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.
అధిక సంపూర్ణ ఘన ఆహారం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం—**గ్లాక్సో**

---

**ఉచితం!** పాపాయి మొదటి ఏడాది పుస్తకం మీ ప్రతి కోసం, తపాలు మరియు ఇతర ఖర్చుల కోసం రూ. 1/– తపాళా బిళ్లలు జతపర్చి ఈ చిరునామాకు వ్రాయండి. **పో.ఆ. బాక్స్ నం. 19119, (FCM-25) బొంబాయి 400 025.**

---

CLARION/B/GX/4/234 TEL

## ముఖచిత్రం

నవ్వుల రాణి, సూపర్ హీరోయిన్ సుహాసిని గారి ముఖచిత్రం చూడగానే ఎమ్ బి యస్ సీటొచ్చినంత పనయ్యింది ప్రచురించిన మీకు అబినందనలు

డి లక్ష్మీదేవి చోడవరం

* * * *

17–23 మే సంచిక ముఖచిత్రంగా మా అబిమాన నటుడు డేరింగ్, డాషింగ్, డైనమిక్, నటశేఖర విప్లవనటుడు కృష్ణగారిని ముద్రించినందులకు మా కృతజ్ఞతలు

గుమ్మడి శితారామయ్య గుంటూరు

* * * *

సూపర్ హీరోయిన్ జయసుద గారి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది

పల్లె మోహన్ గౌడు, హైదరాబాద్

## సీరియల్స్

సుహాసిని ముఖచిత్రము వేసి మమ్ములను ఆనంధపరచినందుకు మీకు మా ధన్యవాదాలు సీరియల్ మల్లిక చాలా బాగున్నది

కేసరి వెంకట సత్యనారాయణ, శివకోడు

* * * *

ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురింపబడుచున్న సీరియల్స్ అన్నియు ఒకదానితో ఒకటి పోటీ పడుచున్నవి ఏది ముందు చదవాలో అర్థమవటం లేదు ఇంతటి మంచి సీరియల్స్ అందిస్తున్న పత్రికకు నా కృతజ్ఞతలు, రచయిత్రులకు నా అభినందనలు

జలందర, బొంబాయి

* * * *

కొత్త సీరియల్ 'మల్లిక' ప్రారంభం మమ్ములను ముగ్ధులను గావించింది రచయిత్రి కిమిరగారు మల్లికను అమెరికాలో పరిచయం గావించినందున, మల్లిక అమెరికా వెళ్ళుటకు కారణం ప్రస్తావించినందున జరిగిన కథకంటే జరగబోయే కథ ఏమిటో తెలుసుకునేందుకు ఉవ్విళ్ళూరుతున్నాము మన్‌హాటన్‌లోని పెద్దబిల్డింగు నుండి బైటపడ్డ బార్గవ్ ఆలోచనల వలన యింతవరకూ అత్యంత ధనిక దేశమైన అమెరికాలో కూడా చెత్త కుండీలో ఏరుకునేవాళ్ళున్నారనీ,

## కర్మభూమి

డబ్బు కోసం కన్న కొడుకే తన తల్లిని పెట్టిన హింసలు కర్మభూమి రచయిత చాలా బాగా వ్రాశారు

పి రాము, పి నిర్మల, గుంటూరు




## న్యూఢిల్లీ లేఖ

డా జయ్ దుబాషిగారి న్యూఢిల్లీ లేఖలో జియా దీపావళి కానుక వ్యాసం – ఆలోచనాత్మకంగా, యదార్థ నిరూపితంగా వుంది

వెలివెల సాంబశివరావు బాబ్జి, నరసాపురం

* * * *

17–23 మే నెల కృష్ణ **ముఖచిత్రంతో వెల్వడ్డ** పత్రికను చదివాను **జయ్ దుబాషి గారి న్యూఢిల్లీ** లేఖలో ప్రత్యామ్నాయాన్ని ప్రజల ముంధుంచలేని ప్రతిపక్షాలను చురకలంటించి వాస్తవాన్ని వివరించారు లెటర్ హెడ్ పార్టీలుగా ఉండి క్రింది ప్రజావణితో సంబంధంలేక కేవలం ప్రకటనల పరంగానో, కూటములనో, అధికార నాయకత్వ పదవికై కుమ్ములాటల మూలంగా ప్రతి పక్షాలంటే ప్రజల అభిమానాన్ని చూరగొనలేక పోతున్నాయి, ప్రభుత్వాన్ని సద్విమర్శలతో అదుపులో పెట్టలేని దుర్గతిలో ఉన్నవి ప్రతిపక్షాల కిటువంటి విషయాలపట్ల సరైన అవగాహన లేకుండా పోతున్నదని పిస్తోంది దుబాషి గారి శీర్షికన బాగా వివరించారు

**పత్తి శివప్రసాద్, నిర్మల్**

## అశృతర్పణం

నీ కన్మూత
**అఖండ భారత చలన చిత్ర ప్రేక్షక కంఠమ్ములన్**
**శోక శ్లోకము గావించెన్**
**నీ కన్మూత**
**సర్వలోకంబున సోత్తక వ్యాకులతా విధూతమయి**
**సంక్షోభమించె ధీరాగ్రణీ**
**నీ కల గళాన్ని ఎలా మరచి పోగలము "హే కృష్ణా, ముకుందా మురారీ ?**
**"పయనించేఓ చిలుకా ఎగిరిపో పాడైపోయెను గూదఇటు విలపించిన నీదు కలం 'అందమే ఆనందం"లా సాగే నీ హృదయకలం!**
**నీలాంటి అమృతమూర్తులు త్వాదృశులరుదు భువిన కలకాలం మా హృదిలో నిలిచే కవితామాలా . సముద్రాలా! అందుకొను! అశృతర్పణం!**

**.డి యస్ ఆర్ ప్రసాద్, తిమ్మసముద్రం**

( 65 వపేజీ చూడండి )

**ఆంధ్రసచిత్రవారపత్రిక**
వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)
శుక్రవారం 12-18 జూలై, 1985
శ్రీ క్రోదన నామ సం ఆషాఢ బ దశమి
సంపుటము 77 : సంచిక 45
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1985 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 6,600/-

ఎప్పటిమాదిరే ఈ సంవత్సరం కూడా దీపావళికి కథల పోటీ నిర్వహిస్తున్నాము గత సంవత్సరంలాగే ఈసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలోనూ, ఆ తర్వాతి సంచికలోనూ ప్రచురిస్తాము అటు తరువాత ఆ కథలపై పాఠకుల బాలట్ నిర్వహిస్తాము

**ముగింపు తేది : 24 ఆగస్టు 1985**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒకొక్క దానికీ రు 650 – చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 700/-, రు 600/-, రు 500/-లు వంతున అదనపు బహుమతులు అందజేస్తాము మిగతా మూడు కథలకీ ఒక్కొక్క దానికీ రు 300/--లు చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

### నిబంధనలు

1 కథా వస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ పన్నెండు అరఠావులకి మించి ఉండరాదు (అరఠావు అంటే ఎక్సర్‌సైజు పుస్తకం, పేజీకి రెట్టింపు) కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కథ వ్రాతప్రతిపైన '1985 దీపావళి కథల పోటీకి అని స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన కథలని, ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న వాటిని పంపకూడదు ఈ మేరకి తమ కథల వ్రాత ప్రతులతో పాటు రచయిత(త్రు)లు హామీ రాసి సంతకం చేసి పంపాలి హామీ పత్రంలేని రచనలు పరిశీలింపబడవు

4 రచయిత(త్రు)లు కలం పేరు వాడినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలని ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలు ఫోటోలతో సహా తరువాత ప్రచురిస్తాము

6 పోటీలో గెలుపొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫోటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించాల్సి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 24 ఆగస్టు 1985 నాటికి కాని, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరాలి ఆ తేదీ తరువాత అందిన కథలని సాధారణ ప్రచురణకి వీలు వెంబడి పరిశీలించటం జరుగుతుంది

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపడం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు, తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లని జత పరచి పంపనవసరంలేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించడం జరుగుతుంది ఆ విషయాన్ని ఉత్తరాల ద్వారా ఆయా రచయిత(త్రు)లకి తెలియజేస్తాము

11 పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పైభాగంలో 1985 దీపావళి కథల పోటీకి అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

# ఆధునికీకరణ ద్వారానే అభివృద్ధి సాధ్యమవుతుంది




జనతా పార్టీలో ఉన్న నా మిత్రులతో ఆధునికీకరణ సాంకేతిక విజ్ఞానం గురించే నేనెప్పుడూ వాదిస్తూ ఉంటాను 'ఆర్గనైజర్'లో నేను వ్రాసిన ఒక వ్యాసంలో భారతదేశం త్వరితగతిన మార్పు చెందుతున్నదని, కానీ అభివృద్ధి చెందటానికి సత్వరమైన ఆధునికీకరణ జరగటానికి ఈ దేశంలో అనేక సమస్యలు మార్పుకి అనుకూలంగా లేవని నేను పేర్కొన్నాను సాంకేతిక విజ్ఞానం ద్వారా తప్ప మరో విధంగా ఆధునికీకరణ సాధ్యం కాదన్న విషయం ఇప్పుడు అందరికీ తెలిసిందే అది ఎలాంటి సాంకేతిక విజ్ఞానం అన్నది ముఖ్యం కాదు ఈ దేశంలో ఇప్పటికీ ఉన్నత సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించడానికి అభ్యంతరం తెలిపేవారు కూడా ఉన్నారు అది ధనవంతులని మరింత సంపన్నులుగా బీదవారిని మరింత పేదవారిగా మారుస్తుందని వాళ్ల భయం లోహియా విధానానికి చెందిన వారు చౌదరి చరణ్‌సింగ్ వంటి వారు మాత్రమేనని నేను అనుకుంటూ ఉండేవాడిని కానీ మిగతా పార్టీలలో కూడా ఆయన అనుయాయులు ఉన్నారు

భారతదేశం పేదదేశమే అయినా అది ఇంతకు పూర్వం ఉన్నంత పేద స్థితిలో మాత్రం ఇప్పుడు లేదు గత నాలుగు దశాబ్దాలనించీ మనం కొత్త సాంకేతిక పద్ధతులని ఉపయోగిస్తూనే ఉన్నా అవి అందరికీ మంచి చెయ్యలేదన్నది మాత్రం వాస్తవం ఆ కొత్త సాంకేతిక పద్ధతులు ఎవరికి అందుబాటులో ఉంటే, వాళ్ళు పట్నాలలో ఉన్నా, పల్లెలలో ఉన్నా కూడా వాళ్లే బాగుపడ్డారు అనువర్తిత ఆర్థిక పరిశోధనా జాతీయ సమితి వారు చేసిన ఒక అధ్యయనంలో గత దశాబ్దంలో గ్రామీణ ప్రాంతాలలోని పేదవారు ధనికులుగా, ధనవంతులు పేదవారిగా మారారని తేలింది ఎంతో మంది సోషలిస్టులు అంటున్నట్లుగా హరిత విప్లవం గ్రామీణుల జీవితాలని మెరుగు పరిచిందన్న వాదనని ఇది సార్థకం చేస్తుంది అదే విధంగా సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించడం వల్ల దేశం అంతటా వచ్చే సుడిలాంటి మార్పులకి అసంఖ్యాకులు ఆకర్షితులవుతున్నారు మురికివాడలో నివసించే వ్యక్తినెవరినైనా గతంలో అతను గానీ, అతని కుటుంబం గానీ ఇప్పుడున్న దాని కంటే పేదరికంలో ఉన్నారా అని అడగండి అతను మిమ్మల్ని చూసి నవ్వుతాడు ఈ మార్పు ఎవరో కొందరి విషయంలో వర్తించకపోవచ్చు లేదా వ్యతిరేక ఫలితాన్ని ఇచ్చి ఉండవచ్చు కానీ అలాంటి వారు చాలా తక్కువ మంది ఉంటారు

విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక విజ్ఞానం అన్నవి తటస్థమైనటువంటివి విజ్ఞాన శాస్త్ర సూత్రాలు సర్వత్రా ఒకేలా ఉంటాయి కమ్యూనిస్టు రష్యాలో అయినా, పెట్టుబడిదారీ దేశం అమెరికాలో అయినా అవి మారవు సాంకేతిక పరిజ్ఞానం, శాస్త్ర విజ్ఞానం అన్నవి వాటిని ఉపయోగించుకునే వ్యవస్థని లేదా సామాజిక, రాజకీయ పరిస్థితులని బట్టి ఉంటాయి ఇటాలియన్‌ల లాగా రష్యన్‌లు కూడా తమ కార్లకి అవే ఫియట్ ఇంజన్లనే తయారు చేస్తారు కానీ రష్యాలో కొనుగోలు శక్తిని బట్టి (ఇటలీలో లాగా) కార్లని కేటాయించటం ఉండదు ప్రభుత్వ ఇష్టంపై ఆధారపడి ఉంటుంది ఆ విధంగా పూర్తిగా భిన్నమైన సమాజం రూపుదిద్దుకుంటుంది అయితే ఆ తప్పు ఆ కార్లది కానీ, వాటని తయారు చేయడానికి ఉపయోగించిన సాంకేతిక విజ్ఞానానిది కానీ కాదు ఉన్నత సాంకేతిక విజ్ఞానం అనేది ఎప్పుడూ ప్రజాస్వామ్య విరుద్ధమైన సమాజాలకే విచక్షణకి గురి చేస్తుందని మార్క్స్ భావించాడు కానీ అది సరికాదు గాంధీ కూడా దాదాపుగా అదే చెప్పాడు ఆధునికం అన్న ప్రతిదానినీ ఆయన వ్యతిరేకించాడు ఆధునిక గాంధేయవాదులైన షూమాకర్ వంటి వారిని కూడా నేను ఒప్పుకోను ఏళ్ల తరబడి ఇంగ్లాండులో బొగ్గు పరిశ్రమ లాంటి పెద్ద వ్యాపార సంస్థలలో పని చేసినా కూడా సమాజానికి యంత్రాలు చెడు చేస్తాయని ఆయిన హఠాత్తుగా కనిపెట్టాడు యంత్రాలు ఎవరికీ చెడు చెయ్యవు అవి తటస్థంగానే ఉంటాయి మనం ఎలా నడిపితే అలా నడుస్తాయి యంత్రాలే లేకపోతే సుసంపన్నమైన సమాజాలలో జీవన స్థాయి ఇంతగా పెరిగేదే కాదు గాంధీ చెప్పినట్లుగానే ఆ స్థాయి లేకపోయినా మనకేమి పర్వాలేదని మీరు అనవచ్చు అది ఆయన వ్యక్తిగత అభిప్రాయం అందరి మీదా రుద్దే హక్కు లేదు మనదేశంలో పశువుల కన్నా హీనంగా బతుకుతున్న లక్షలాది మందిని వారి కష్టాల నించి బయటపడ వేయడానికి సాంకేతిక విజ్ఞానమే సరైన మార్గం అందుకు భిన్నంగా ఎవరైనా చెపితే ఆ వ్యక్తి మహాత్ముడైన ఒక గొప్ప యోగి అయినా అయి ఉండాలి లేదా నియమరహితుడైనా అయివుండాలి భారతదేశం లాంటి పెద్ద దేశాన్ని వంటరిని చేసి దానిని పదిహేడో శతాబ్దంలో బ్రతకమనేంత పెద్దది కాదీ ప్రపంచం

వాస్తవంగా నా సోషలిస్టు మిత్రులు చెప్తున్నది దారి తీస్తుందని ఇక్కడ కొంతమంది అంటూ ఉంటారు యూరోప్ తదితర చోట్ల కొంతమంది సోషలిస్టులు అలాగే చెబుతున్నారు కాని జరుగుతున్నది మరొకటి అని ఋజువవుతున్నది బ్రిటన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఉన్నత సాంకేతిక విజ్ఞానం ఉన్న సమాజాలు, కానీ ఇంతవరకూ అవి మనకంటే ఎంతో ప్రజాస్వామ్య బద్ధంగా ఉన్నాయి ఇంకా చెప్పాలంటే సాంకేతికంగా అభివృద్ధి చెందటం వల్లనే అవి ప్రజాస్వామ్యయుతంగా ఉన్నాయని అంటాను ప్రజాస్వామ్యం, సాంకేతిక విజ్ఞానం అన్నవి ఒక దానితో మరొకటి తీసమై మరింత దృఢంగా రూపు దిద్దుకుంటాయి అలాగే ఫ్యూడలిజం సాంకేతిక విజ్ఞానంపై ద్వేషం అన్నవి కలసికట్టుగా ఉంటాయి సాంకేతిక విజ్ఞానం కొంతవరకు దానిని ఉపయోగించే వ్యక్తికి స్వేచ్ఛని ఇస్తుంది ఒక పరిమితి దాటిన తర్వాత ఒక వ్యవస్థ అన్నది లేకుండా ఉన్నత సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించడం సాధ్యం కాదు అలాంటి వ్యవస్థలో పని చేసే వ్యక్తి కొంతవరకే తన స్వేచ్ఛని కోల్పోతాడు కానీ తక్కువ స్థాయి సాంకేతిక రంగంలో పని చేసే వ్యక్తి కంటే అతనికి ఎంతో ఎక్కువ స్వేచ్ఛ ఉంటుంది

అందుకే నేను మార్క్స్‌ని ఒప్పుకోను అలాగే గాంధీని కూడా సాంకేతిక విజ్ఞానం మనిషిని ఏమిటంటే భారతీయ సమాజం సవాళ్ళని, మార్పుని ఎదుర్కోలేని స్థితిలో ఉన్నది కాబట్టి దాని నుంచి రక్షణ కల్పించాలని మొరార్జీదేశాయి, చరణ్‌సింగ్ లాంటి వారు నాయకులుగా ఉన్నప్పుడైతే వాళ్ళు చెప్పింది సరిపోతుంది అప్పుడు ఏదైనా సంభవమే వీరంతా ప్రాథమికంగా విజ్ఞాన శాస్త్రానికి వ్యతిరేకులు అందువల్లనే జనతా ప్రభుత్వం రోజులలో ప్రతిపక్షం ముందు నిలవ లేకపోయారు దాని నుంచి వారింకా కోలుకో లేదు. సాంకేతిక విజ్ఞానం వల్ల సంభవించే మార్పులకి భారతీయ సమాజం తట్టుకోలేనంత బలహీనమైన స్థితిలో ఉందని నేను అనుకోటం లేదు జపాన్ దానిని సాధించింది కొరియా సాధిస్తూంది మనం మాత్రం ఎందుకు సాధించ లేమో నాకు తెలియడంలేదు నిజానికి మనం కూడా సాధించే ఉండేవాళ్ళం మన నాయకులకి దూరదృష్టి, భవిష్యత్తులో మార్పులకీ అను గుణమైన అవగాహన ఉండి ఉంటే అది సాధ్యపడి ఉండేది కానీ గాంధీ గారి ప్రభావం వల్ల సాంకేతిక విజ్ఞానంపై మనకి ఒక రకమైన నిర్లిప్తతా భావం మనకి ఏర్పడినట్లు కనిపిస్తుంది చరఖా తప్ప మిగతా ఏ యంత్రాన్ని ఉపయోగించాలన్నా ఏదో తప్పు చేస్తున్న భావం మనకి కలుగుతుంది [illegible] యుగంలో ప్రవేశిస్తే తప [illegible] స్థాయి జీవితాల నిం [illegible]

# డా. నాయుడమ్మ దుర్మరణం

ప్రఖ్యాత శాస్త్రవేత్త డా. వై. నాయుడమ్మ జూన్ 23 న ఐర్లాండ్ దగ్గర అట్లాంటిక్ మహాసముద్రంలో జరిగిన ఘోరమైన విమాన ప్రమాదంలో దుర్మరణం పాలైనారు కెనడాలోని అంతర్జాతీయ పరిశోధన అభివృద్ధి సంస్థ గవర్నర్ల బోర్డ్ సమావేశంలో పాల్గొని తిరిగి వస్తూ ఉండగా ఈ ఘోర ప్రమాదం జరిగింది

డా. నాయుడమ్మ గుంటూరు జిల్లాలోని ఈపూరులంకలో 1922 లో జన్మించారు చర్మ విజ్ఞానశాస్త్రంలో డాక్టరేట్ తీసుకుని మదరాసులోని కేంద్ర చర్మ పరిశోధన సంస్థలో చేరి నాలుగేళ్లలోపే దానికి డైరెక్టర్‌గా నియమింప బడ్డారు డా. నాయుడమ్మకి ఎన్నో జాతీయ, అంతర్జాతీయ శాస్త్ర పరిశోధన సంస్థలతో సంబంధం ఉన్నది పరిశోధన పట్ల ఈయనకి గల ఆసక్తి కారణంగానె 1977లో ఢిల్లీలోని సి ఎస్ ఐ ఆర్ డైరెక్టర్ జనరల్



పదవికి రాజీనామా ఇచ్చి కేంద్ర చర్మ పరిశోధన సంస్థకి తిరిగి వచ్చారు తిరిగి 1982లో జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్ష పదవికి కూడా రాజీనామా చేసి కేంద్ర చర్మ పరిశోధన సంస్థలో ప్రధాన శాస్త్రవేత్తగా బాధ్యతలని స్వీకరించారు

డా. నాయుడమ్మ ఎన్నో పరిశోధనా వ్యాసాలని, గ్రంథాలని రచించారు మదరాసు అన్నా విశ్వవిద్యాలయాలకి గౌరవ ఆచార్యులుగా పని చేశారు ప్రత్యామ్నాయాలని అభివృద్ధి పరిచే కేంద్రాన్ని ఆయన స్థాపించారు కేంద్ర మంత్రివర్గానికి శాస్త్ర సాంకేతిక సంబంధమైన సలహాలని ఇచ్చే సంఘంలో సభ్యులుగా ఉన్నారు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్ర ప్రభుత్వాలకి సలహాదారుగా కూడా వ్యవహరించారు డా. నాయుడమ్మ 1971లో డా. నాయుడమ్మని భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదు నిచ్చి సత్కరించింది

డా. నాయుడమ్మకి భార్య డాక్టర్ పావనమ్మ ఇద్దరు కుమారులు ఒక కుమార్తె ఉన్నారు శాస్త్ర పరిశోధన రంగానికి డా. నాయుడమ్మ దుర్మరణం తీరని లోటు 

మా వాడు కరాటే నేర్చుకోడం మొదలెట్టినప్పుడే నాగార్జున సిమెంట్ తో తప్ప ఇల్లు కట్టకూడదనుకున్నాను

SATYAMURTY–MAM N C

## సీరియల్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె. రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

సుబ్బులు ఎదురుగా వచ్చి నుల్చుని రెండు చేతులు జోడించి దణ్ణం పెడుతూ డాక్టర్ బాబూ! మల్లమ్మకేం పరవాలేదుగదా! పురుగు ముట్టుకుని పడిపోయిందగ్గర్నుండి షావుకారు దిగులుపడి వంచిన తల ఎత్తకుండా ఇంట్లోనే వుండిపోయాడు!

ఎంత డబ్బయినా పరవాలేదు! మల్లమ్మను బతికించండి అని కళ్ళ నీళ్ళు తుడుచుకుంది.

మల్లిక పేరామార్ తాగింది! ఎలా వుంటుందో చెప్పడం కష్టం అన్నాడు డాక్టర్ రవి

అయ్యో! అంత పని ఎందుకు చేసావే మల్లమ్మ తల్లీ! అంటూ పెద్దగా ఏడవబోయింది సుబ్బులు

ఇక్కడ ఏడవ కూడదు! పద! అంటూ ఆమెను బయటకు పంపింది సరోజ

సుబ్బులు మల్లిక మంచం పక్కన కూర్చుని ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ వెక్కి వెక్కి ఏడవ సాగింది

సరోజ వెళ్ళి చూస్తే మల్లిక కళ్ళు తెరచి సుబ్బులు వంక బయంగా చూడ సాగింది ఆ స్థితిలో మల్లికకు సుబ్బులు కనపడటం ఏవిదంగానూ మంచిది గాదనుకుని—

సుబ్బులూ! ఆస్పత్రిలో అలా ఏడవ గూడదు డాక్టరు గారు వింటె కోప్పడతారు! పద! అంటూ గది బయటకు పంపింది సుబ్బులు గది బయటకు వెళ్ళగానే గదిలో పల గడియ వేసి వచ్చి—

మల్లీ! నువ్వేమి దిగులు పడకు! అంది

మల్లిక దిగులుగా సుబ్బులు వెళ్ళిన వైపు చూచింది

నిన్ను మళ్ళీ ఆ రాక్షసుల కొంపకు పంపము! సరేనా! దైర్యంగా వుండు ఇక్కడే నాదగ్గరే వుంచుకుని నర్స్ పని నేర్పిస్తాను అంది సరోజిని

మల్లిక క్షణం సేపు ఆశ్చర్యంగా చూచింది తర్వాత తృప్తిగా కనులు మూసుకుని పడుకుంది

జరిగిన కథ—3· రచయిత, సర్జన్ అయిన రవితో రచయిత్రి, లెక్చరర్ అయిన ఇందువదనకు హైదరాబాదులో పరిచయం అయ్యింది విజయవాడలో తన ఇంటికి వచ్చిన ఇందుకి చంద్రహాస్ నుంచి వచ్చిన ఉత్తరం సాక్షాత్కరించింది తనకి కడుపు నెప్పి ఎక్కువగా ఉందని, అందు మూలంగా గుంటూరులోని రవిగారి శుశ్రుతా నర్సింగ్‌హోమ్‌లో చేరానని రాసాడు ఇందుకి చంద్ర మొదట తనని ఎలా అల్లరిపెట్టిందీ తుదకు ఏ విధంగా ఆప్తమిత్రుడైనది గుర్తుకు వస్తుంది చంద్రను చూడటానికి గుంటూరు వస్తుంది ఇందువదన రవి ఇంట్లో దిగుతుంది అక్కడి నుండి ఆ రాత్రె చంద్రను చూడను నర్సింగ్‌హోమ్‌కు వెళుతుంది చంద్ర ఆమెను చూసి ధైర్యం తెచ్చుకుంటాడు తన పేషెంట్లు చంద్ర, రాకేష్ ఇద్దరూ ఇందు పేరు కలవరించడం వినడంతో రవి మనసు కల్లోలపడసాగింది



మల్లికను చూడటానికి వచ్చిన డాక్టర్ రవితో సార్! ఈమెకు నయమయ్యాక నాదగ్గరే అట్టిపెట్టుకుంటాను పదో తరగతి వరకు చదివింది నేర్పించితే నర్సు పని నేర్చుకుని ఇక్కడే వుంటుంది అంది

రవి 'సరే' నన్నట్టు తల వూపగానే చూసావా మల్లీ! డాక్టరు గారు ఒప్పుకున్నారు అని మల్లికతో అన్నది

మల్లిక విన్నాను అన్నట్టు తల వూపింది! మల్లికను పరీక్షించి చూసాడు రవి కంటి పాపలు మామూలు సైజులోకి వచ్చాయి గుండె. వూపిరి తిత్తులు మామూలుగా పని చేస్తున్నాయి లోపల నురగ ద్రవం వున్న లక్షణాలేమి లేవు! బి పి. నాడి సక్రమంగా పని చేస్తున్నాయి!

మల్లిక కళ్ళు తెరచి డాక్టరు రవి వంక చూచింది ఆమె చూపుల్లో కృతజ్ఞతా భావం, జీవితంపై ఆశ మిళితమై వున్నాయి! అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి నమస్కరించ బోయింది! చేతికి సెలైన్ డ్రిప్ వుండడంతో వద్దని వారించింది సరోజ



# శుశ్రుత నర్సింగ్‌హోమ్

కిటికీ రెక్కల సందు నుండి వీరిని గమనిస్తున్న సుబ్బులు కోపంతో పండ్లు నూరింది!

మల్లిక పరిస్థితి బాగా మెరుగయింది ఎట్రోపిన్ ఇంజక్షన్లు గంట గంటకు చేస్తూ ఏమాత్రం అవసరమయినా నాకు ఫోన్‌చేయి సరోజా! అని డాక్టర్ రవి ఇంటికి బయల్దేరాడు వీధిగేటుదాకా వెళ్లాక అతనికి ఇందుసంగతి గుర్తుకొచ్చింది మరలా వెనక్కు తిరిగి ముప్పైఆరో నెంబరు గదివద్దకు వెళ్లాడు

ఇందు చంద్రహాస మంచం పక్కన కూర్చునివున్నది

ఇందూ! ఇంటికి వెళ్లివద్దాం! స్నానంచేసి భోంచేసి వద్దువుగాని

స్నానం అయింది మీ అమ్మగారు' పంపిన కారియర్ ఇందాకే వచ్చింది కాసేపాగి భోంచేస్తాను

చంద్రహాస పరిస్థితి బాగానే వుంది మా ఇంటికివచ్చి కాసేపు విశ్రాంతితీసుకుంటే బాగుంటుందేమో?

పరవాలేదు! ఎందుకనో చంద్రను వదిలి రావాలని అనిపించటంలేదు! దయచేసి నా సూట్‌కేస్ ఇక్కడకు పంపిస్తారా!

అలాగే! అంటూ వెళ్లిపోయాడు రవి

★ ★ ★ ★

ఆ రాత్రి రవి కంటిమీదకు కునుకురాలేదు నిద్రపోక వరుసగా మూడో రోజు అది! కనులు మూస్తే ఇందు రూపం గుర్తువచ్చేది నిద్రదూరం అయేది!

లేచికూర్చుంటే మల్లిక గూర్చి విన్న విషయాలు గుర్తుకువచ్చేయి

రాక్షస ప్రవృత్తిగల వీరయ్య ఆమెను అన్ని విధాలా హింసించి బాధించి ఆత్మహత్య ప్రయత్నం చేసుకునేట్లు చేసాడు! ఈ కాలంలో అంత దుర్మార్గులు వున్నారని విని ఆశ్చర్యపోయాడు రవి

మల్లె మొగ్గలాంటి మల్లిక అమాయకవదనం అతనికి మరీమరీ జ్ఞాపకం రాసాగింది

లేచి ముందు హాల్లోకి వచ్చాడు రవి గీత రూమ్‌లో లైటు వెలుగుతున్నది ' టైమ్ చూచుకున్నాడు పదకొండున్నర అయింది! వోరగా తెరచివున్న తలుపుసందు నుండి గీత టేబిల్ మీద తల ఆనించి నిద్రపోవడం కనబడుతున్నది!

గీతా పిలిచాడు రవి శుభ్రంగా మంచం మీద పడుకుని నిద్రపోక ఇలాకూర్చుని నిద్రపోతుందేమి అని గదిలోకి వెళ్లాడు

టేబిల్ మీద తన నవల 'ప్రేమోపాసన'! నవల మధ్య తన ఫోటో పెట్టుకుని వుంది గీత!

'అంకుల్' అని 'మామయ్యా' అని పిలుస్తుండే టీన్ ఏజ్‌గర్ల్ మనసులో తను నిండివున్నాడా?

రవి మనసు బయంతో గజగజ వణికిపోయింది గీత మనసులో 'అంకుల్' ఆలోచనలు రాకుండా వుంటేచాలు! ఇంకా తను కోరుకోతగిందేమీలేదు!

తల్లిపోయి సంవత్సరం పిల్లగా వున్నప్పుడే తమ ఇంటికి వచ్చిన గీతను ఎత్తుకుతిప్పాడు తను అడుగులు తడబడుతూ మాటి మాటికీ కింద పడిపోతుంటే నడవటం నేర్పాడు మాటలు నేర్పించాడు ఒకోసారి అమ్మకు బాగాలేనప్పుడు అన్నం తినిపించాడు కాన్వెంటుకు వెళ్లను అని ఏడుస్తుంటే చాకలెట్లు ఆశచూపి కాన్వెంటుకు తీసుకు వెళ్లాడు! తన చేతులలో పెరిగిన పిల్ల గీత!

అమ్మమ్మకు మనసులో తను గీతను వివాహం చేసుకుంటే చూద్దామని వున్నది పెద్దతనపు చాదస్తం ! సమయం వచ్చినప్పుడు అమ్మమ్మకు సర్ది చెప్పవచ్చు! ఇప్పట్నుంచీ ఆమె మనసు కష్టపెట్టడం ఎందుకు? అని గీత విషయమై తన ఆలోచనలు బహిర్గతం చేయలేదు ఇన్నాళ్లూ! ఇప్పుడు గీత మనసులో కూడా తనే వున్నానని తెలిసికొన్నాక తను తాత్సారం చేసి తప్పు చేసానేమో అనిపించింది! మొదట్లోనే అమ్మమ్మా! మేనరికాలు పనికిరావు! నా చేతుల్లో పెరిగిన పిల్లను నేనెలా పెళ్లి చెసుకునేది? అని కుండ బద్దలు కొట్టినట్లయితే గీత మనసులో తన్నుగూర్చి ఇలాటి ఆలోచనలకు తావుండేదిగాదు.

ఆలోచనలతో రవి మనసు వేడెక్కిపోయింది అలసిన శరీరం డస్సి తూలుతూ వున్నది! ఈ రాత్రయినా నిద్ర పోకపోతే రేపు నర్సింగ్‌హోం పని చేయడం కష్టమేమో? కాని ఎంత ప్రార్థించినా నిద్రాదేవి రావడంలేదే?

టైమ్ రెండయింది! డైజెపామ్ బిళ్లమింగి కాసేపు పడుకుంటే?

నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రింగు రింగుమని ఫోను! నర్సు గొంతు కాన్పవక పోతే అమ్మాయిని తీసుకువచ్చారు ఒకసారివచ్చి చూసి వెళ్లండి అని!

దుస్తులు మార్చుకుని ఆస్పత్రికి వెళ్లాడు రవి పద్దెనిమిదేళ్ల అమ్మాయి బల్లమీద వున్నది ముఖం పాలిపోయి వున్నది బాధ భరించలేక కేకలు పెడుతున్నది అవి కాన్పునొప్పులలాలేవు! ఆ అరుపులు మృత్యు గహ్వరంలోకి వెడుతూ ప్రాణిచేసే ఆక్రందనల్లా వున్నాయి

రోగి పొట్టమీద చేయివేసి చూసాడు శిశువు తల చేతికి తగిలింది 'ఇదేమిటి! తల ఇంత స్పష్టంగా తెలుస్తున్నది! ఖర్మకాలి రప్చర్ యుటిరస్ కాదుగదా?' అనుకుని పల్స్ చూసాడు చాలా నీరసంగా కొట్టుకుంటున్నది

'ఏమయిందమ్మా?' అని రోగి తల్లిని అడిగాడు

తొమ్మిది నెల్లునిండి తొమ్మిది రోజులయింది! నడుంనొప్పంటే నాటుమంత్రసానిని పిలిచాను మూడ్రోజుల నుండి 'ఇదిగో అవుద్ది అదిగో అవుద్ది' అంటూ నెట్టుకొచ్చింది ఇరుగూ పొరుగూ గోలచేస్తే సందేలప్పుడు రెండు సూదులిచ్చింది 'ఇక నిముషంలో కాన్పవుద్ది అంది కాన్పు గాకపోగా బిడ్డ గొడ్డు మూలిగినట్లు మూలగసాగింది 'ఇదేందమ్మా' అంటే 'వానెప్పుడొస్తదో కాన్పెప్పుడవుద్దో ఎవరు చెబుతారు' అంది రాను రాను బిడ్డ బాధ ఎక్కువయింది 'నే బతకనే అమ్మా' అంటుంటే బయం బుట్టి మీ దగ్గరకు తీసుకొచ్చాం! అంది

'నాటు మంత్రసాని పిటోసిన్ ఇంజక్షన్ ఇచ్చి వుంటుంది దాంతో కాన్పవకపోగా గర్భకోశం పుచ్చకాయ చిట్టినట్లు విచ్చుకుని శిశువు పొట్టలో పలకువచ్చి వుంటుంది' అనుకొని ఆ సంగతే రోగి బంధువులకు చెప్పాడు రవి–

శిశువు పోయింది వెంటనే ఆపరేషన్ చేయందే తల్లిదక్కదు పగిలిపోయిన గర్భకోశాన్ని తీసివేయాలి గనుక ఇక ఆమెకు సంతానం కలిగే అవకాశం వుండదు అని

ఏడుపులు పెడబొబ్బల అనంతరం ఆపరేషన్ చేయమన్నారు ఇక అప్పుడు బ్లడ్ ట్రాన్స్ఫ్యూజన్‌కు ఏర్పాట్లు చేసి థియేటర్ రెడీచేసి ఆపరేషన్ చేసి చనిపోయిన శిశువునూ పగిలిపోయిన గర్భకోశాన్ని తీసి పారవేసాడు చావు తప్పి కన్ను లొట్టబోయింది అన్నట్లు ఇంత కష్టపడి విజయవంతంగా ఆపరేషన్‌చేసి రోగి ప్రాణాలు నిలబెట్టిందానికి ఫలితం? పద్దెనిమిదేళ్ల అమాయకురాలికి నీకు జీవితంలో తల్లి అయే అవకాశం లేదు' అని చెప్పవలసి రావడం ఎంత ఘోరమైన విషయం!

అందుకే ఆ అమ్మాయి సుశీల బాగా వున్నదని చెప్పినా ఆమె తల్లీ తండ్రీ దిగులుగా తల దించుకున్నారు నర్సుకు ఇవ్వ వలసిన ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి ఇంటికి వెళ్ళబోతూ వాచి వంక చూచుకున్నాడు ఆరు గంటలయింది! నిద్రరాలేదని దిగులవసరం లేదు!

ఇందు గుర్తొచ్చింది ఇందును చూచి వద్దామని ముప్పైఆరో నంబరు గది వద్దకు వెళ్ళాడు

చంద్రను కూర్చోపెట్టి అతనికి ముఖం కడిగిస్తున్నది, ఇందు తనను చూడనే లేదు! లోపలకు వెళ్ళి ఆమెను పలకరించి చంద్రకు మళ్ళా మరోసారి ఆందోళన కలిగించి అల్సర్ నుండి బ్లీడింగ్ తెప్పించటం ఎందుకని వరండా నుండి వెనుదిరిగి వెళ్ళాడు

కింద ఎమర్జన్సీ రూమ్‌లో వున్న మల్లికను చూచాడు ఆమె పరిస్థితిలో బాగా మార్పు వచ్చింది! ముఖంలో ప్రేతకళ పోయి ఏదో ధైర్యం కనపడింది

# శుశ్రుత నర్సింగ్ హోమ్

బహుశ స్పృహ వచ్చాక సరోజ ఆమెకు ధైర్యం చెప్పి ఇక వీరయ్య దగ్గరకు నువ్వు వెళ్ళవలసిన అవసరం లేదు అని చెప్పి వుంటుంది!

అందుకే రవిని చూడగానే రెండు చేతులెత్తి నమస్కరించింది!

ధైర్యంగా వుండమ్మా! నీకేం పరవాలేదు అని గది బయటకు నడిచాడు రవి

గది బయట జిబ్బినెత్తితో, నిద్ర లేక ఎరుపెక్కిన కళ్ళతో లంకిణిలా సుబ్బులు కనపడింది!

'పాపం! రాత్రంతా కాపలా కాసి నిద్రపోయి వుండదు'! అనుకుంటూ ఇంటికి వెళ్ళాడు రవి

వాకిటి ముందు ముగ్గు వేస్తూ వున్నది గీత! ఆడపిల్లలు ఎంతలో పెరుగుతారు! నిన్న మొన్నటి దాకా ఎత్తుకు పెంచిన మేనగోడలుకు అప్పుడే పెళ్ళీడు వచ్చింది! ఆమెకు అన్ని విధాలా జోడీ అయిన సంబంధం చూచి వివాహం చేయాలి అనుకుంటుంటే రాత్రి గీత తన ఫోటో పుస్తకంలో పెట్టుకున్న విషయం గుర్తుకొచ్చింది

చిన్న పిల్ల! అబం శుబం తెలియదు! అమ్మమ్మ రోజూ అనే మాటల వల్ల అనవసరపు ఆలోచనలు పెంచుకుని వుంటుంది అనుకుంటూ ఇంట్లోకి నడిచాడు

అంకుల్! నువ్వు ఆస్పత్రికెప్పుడు వెళ్ళావు? ఇంకా గదిలో నిద్రపోతున్నావనుకున్నా! అంటూ లోపలకు వెళ్ళి కాఫీ గ్లాసుతో తిరిగి వచ్చింది గీత

తెల్లవారు జామున ఎమర్జన్సీ కేసు వస్తే వెళ్ళానమ్మా! బాగా చదువుకుంటున్నావా? అని రాత్రి సంగతి గుర్తొచ్చి అప్రయత్నంగా నాలుక కరచుకున్నాడు రవి!

ఓ! బాగా చదువుతున్నా! ఈసారి క్లాస్ ఫస్ట్ నేనే వస్తాను! చూస్తుండు అంటూ వెళ్ళిపోయింది గీత పెద్దవాళ్ళు యీ మేనరికాలెందుకు పెట్టారో? రక్త సంబంధీకులలో వివాహం జరిగితే అంగ వైకల్యం గల పిల్లలు పుడతారని చెప్పినా అమ్మమ్మ లాంటి వాళ్ళు వినరు! పండుగలప్పుడు అక్క నగలు పెట్టుకు తిరుగుతుండే గీతను, ఇన్నాళ్ళు తన చేతులలో పెంచిన గీతను ఎలా వివాహమాడగలడు?

★ ★ ★ ★

స్నానం, టిఫిన్ కానిచ్చి సోఫా మీద పడుకుంటే అప్రయత్నంగా నిద్ర పట్టింది గోడగడియారం తొమ్మిది గంటలు కొడుతున్నది ఎలా గయితేనేం రెండు గంటలు నిద్రపోయాడు

ఏదో వింత పరిమళం ఘాటుగా వస్తున్నది. ఆ పరిమళం లిల్లీలు మల్లెలు, గులాబీలు విరగ బూసిన తోటలో నుండి వస్తున్నట్లు వున్నది! కండ్ల రెప్పలు టప టప ఆడించి మరీ చూచాడు

రవీ! ఇంకా నిద్రపోతున్నావా? ఎవరిదీ పరిచయమైన కంఠం?

జ్ఞాపకాల పొరలను చీల్చుకుంటూ 'నన్నప్పుడే మరచి పోయావా? నేను మంజు భాషిణిని!' అంటూ గల గల నవ్వుతూ వున్నట్లు అనిపించింది

ఓ! మంజూ! ఎప్పుడు వచ్చావు? అన్నాడు రవి 'అమ్మయ్య! ఇప్పటికి నిద్ర లేచి జాగ్రదవస్థలోకి వచ్చావు నేను యీ గదిలోకి వచ్చి పది నిముషాలయింది నిద్రపోతూనే ఏదో కలవరిస్తున్నావు! వుండి వుండి నీముఖంపై చిరునవ్వు రేఖలు ముసురుకుంటుంటే 'పోనీలే పాపం! కలలు కంటున్నాడు కాబోలు!' అనుకుని అలాగే నిన్ను చూస్తూ వుండిపోయాను!

అలాగా మంజూ! నేనడిగింది అదికాదు అమెరికా నుండి ఎప్పుడు వచ్చావు అని"

"రాత్రి హైద్రాబాద్‌లో దిగాను టాక్సీలో పది నిముషాల ముందే గుంటూరులో మా యింటి దగ్గర దిగి అమ్మతో సరిగా మాట్లాడకుండానే నీకోసం ఇలా పరిగెత్తుకు వచ్చాను!"

థాంక్స్ మంజూ! నీ క్లాస్ మేట్ రవిని గుర్తుంచుకుని వచ్చావు! థాంక్స్!

రవీ! అమెరికాలో వున్నన్నాళ్ళు 'రవి అక్కడ గుంటూరులో వుండిపోయాడు గాని అమెరికా వచ్చినట్లయితే ఎంత బాగా షైన్ అయివుండే వాడో? అనుకుంటూ వున్నాను పోయినేడు రెసిడెన్సీ అయిపోయి కన్సల్టెంట్‌గా ప్రాక్టీసు పెట్టాను కన్న తల్లినీ మాతృ దేశాన్నీ, నీలాంటి స్నేహితులను చూద్దామని వచ్చాను

మంజూ! డాక్టర్లందరమూ విదేశాలకు వెళితే ఇక్కడ మన దేశ ప్రజలు ఏమయిపోతారు? అదీకాక అమ్మమ్మ, గీత వున్నారు అమెరికా రావటానికి అమ్మమ్మకు సుతరామూ ఇష్టం లేదు అందువల్ల యం యస్ అవగానే ఇక్కడ నర్సింగ్ హోమ్ తెరిచాను

నీ విషయాన్ని ఎప్పటికప్పుడు ఇక్కడ నుండి వచ్చిన వాళ్ళద్వారా తెలుసుకుంటూనే వున్నాను! మన క్లాస్‌మేట్సు మా హాస్పటల్‌లోనే అరడజను మంది వున్నాము అందరం కలుసుకున్నప్పుడల్లా నీ విషయం చర్చకు వచ్చేది

మంజూ! అక్కడ ఇన్నాళ్ళూ ఏ స్పెషాలిటీలో పని చేసావు?

ట్రమటాలజీలో పని చేసా! అక్కడ రోడ్డు ఏక్సిడెంటు ఎక్కువ అక్కడ ఇండియాలో కన్నా కార్లు చాలా ఎక్కువ గంటకు అరవైమైళ్ళ స్పీడుకన్నా నెమ్మదిగా వెళ్ళగూడదు మంచు కురుస్తున్నప్పుడు సరేసరి! వస్తే వరసగా ఏక్సిడెంట్ కేసులు వచ్చి పడతాయి! అంత స్పీడు మీద వెళ్లే కారును సడన్ బ్రేక్‌వేసి ఆపినప్పుడు హెడ్ ఇన్‌జ్యూరీకి డ్రైవర్ లోనవవచ్చు!

రా మంజూ! కా_ టిఫిన్ తిందువుగాని అంటూ డైనింగ్ రూమ్ దగ్గరకు దారి తీసాడు రవి

అమ్మమ్మా! చూడు ఎవరొచ్చారో!

ఓ నువ్వా మంజూ! ఎప్పుడొచ్చావు? అమెరికా వెళ్ళినా ఇంకా చీర కట్టడం మర్చిపోలేదే!

ఏమిటండోయ్! చీరకట్టుకోక ఏం చేయమంటారు?

మా చుట్టాలామె అమెరికాలో వున్న కొడుకు దగ్గరకు వెళ్ళి వుంది. ఈ మధ్య చుట్టంచూపుగా ఇటు వచ్చి ఈ చీరెలు కట్టలేకుండా వున్నా! అమెరికాలో వుంటే హాయిగా గౌన్లు తొడుక్కునేదాన్ని అంది

అలాంటి వాళ్ళు కొద్ది మంది వుంటారు! ఇండియాలో మాత్రం గౌన్లు తొడుక్కునే వాళ్ళుండరా!

కబుర్లలోపడి బొత్తిగా టిఫిన్ తినలేదేమమ్మా! అందులోనూ పెసరట్టంటే నీకిష్టం గదా! ఇంకా రెండు తిను

ఆకలిగా లేదండీ! ఇంకా రెండు నెలలుంటా గదా మీ చేతి వంట తినటానికి కావలసినంత టైముంది

హాస్పిటల్‌నుంచి ఫోనొచ్చింది! వస్తా మంజూ అన్నాడు రవి

నేనూ వస్తా! అంటూ అతని వెంటే తనూ బయల్దేరింది సావిత్రమ్మగారి వంక తిరిగి 'వస్తానండీ' అంటూ శెలవు తీసుకుంది

రవి మంజూ ఆస్పత్రికి వెళ్ళేసరికి లారీ కిందపడి కాలు నుజ్జయిపోయిన యువకుని బల్లమీద పడుకోబెట్టి వున్నారు

చూసావా మంజూ! ఇండియా కూడా అమెరికాతో రోడ్ ఏక్సిడెంట్ల విషయంలో పోటీ పడుతున్నది!

సరే! ఇలాంటి విషయాలలోనా పోటీ పడవలసింది అన్నది మంజూ దెబ్బతిన్న యువకుని కాలు క్లీన్‌చేసి ప్లాస్టరువేసి ఎక్స్‌రేకి పంపారు

కాలు విరిగిన రోగిని అవతలకు పంపగానే కుర్చీలో కూర్చుంటూ రవి మంజూబాషిణీ వంక చూసాడు

మంజూబాషిణీ నయాగరా జలపాతం! నవ్వుతూ నవ్విస్తూ సంతోషాన్ని తనుచుట్టూ వెదజల్లుతూ వుండే ఆమె తనకు యం బి బి యస్ లో క్లాస్‌మేట్! ఆడ మగ, ధనిక నిర్ధనిక, తనపర, పెద్ద చిన్న తేడా లేకుండా అందర్నీ కలుపుగోలుగా పలుకరిస్తూ క్షణం వూరికే వుండకుండా ఎప్పుడూ ఏదో వొక పనిలో మునిగిపోయి వుండేది! పరీక్షల్లో వోరల్సుకు వెళ్ళే ముందు అందరూ భయంతో బిగుసుకుపోయి వుంటే ఆమె తన జోక్స్‌తో అందరినీ నవ్వించి భయం పోగొట్టేది




'మంజూ నీ కళ్ళవెంట నీళ్ళెప్పుడైనా వచ్చాయా!' అని ఎవరైనా అడిగితే నా కళ్ళవెంట నీళ్ళు తెప్పించిన వాళ్ళకు నోబెల్ ప్రైజు ఇవ్వచ్చు అనేవాడు నాన్న! నన్నేడిపించగల వాళ్ళెవరైనా సునాయాసంగా నోబెల్ ప్రైజు తెచ్చుకోవచ్చు నాన్న దగ్గరకు వెళ్ళి! అనేది ఆమె తండ్రి మరణించి అప్పటికి పదేళ్ళయిందని తెలుసుకుని పకపకా నవ్వేవాళ్ళు ఎదురుగా వున్నవాళ్ళు!

యం బి బి యస్ అవగానే అమెరికా వెళ్ళిపోయింది మంజూ అప్పుడప్పుడూ ఆమె వుత్తరాలు వ్రాస్తే సమాధానం వ్రాసేవాడు రవి

మంజూను చూస్తుంటే కాలేజీ జీవితం గుర్తొచ్చి రవి ముఖంలో దరహాస రేఖ వెలసింది

ఏమిటి నీలో నువ్వే నవ్వుకుంటున్నావు? అంది సీరియస్‌గా

ఏం లేదు మంజూ! నువ్వున్న చోట నవ్వులు తప్ప మరేముంటాయి! కాని ఎందుకనో అమెరికా నుండి వచ్చాక నువ్వు నీ సహజ లక్షణాలను కోల్పోయినట్లున్నావు! లేకపోతే ఇంతసేపు ఇంత సీరియస్‌గా నువ్వున్నట్లు నాకు గుర్తు లేదు

అయ్యో రవీ! నేను నీ క్లాస్‌మేట్ మంజూబాషిణినే! నావంక ఏదో భూతాన్ని చూచినట్లు చూడకు అని మంజూ అనగానే పకపకా నవ్వాడు రవి

రవికి ఎదురుగా వచ్చి నిల్చుని రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ డాక్టరు బాబూ! మా మల్లమ్మకేం ఫరవాలేదు గదా! నిన్న ఆమెకిట్లా అయిందగ్గర్నుండీ మా షావుకారు గారు వచ్చి మంచినీళ్ళు ముట్టలా?

'బాబూ! దిగులుపడి ప్రయోజనం ఏమిటి! గుంటూరులో పెద్ద డాక్టరుగారి ఆస్పత్రిలో జేర్చారు ధైర్యంగా వుండు అన్నా!'

సుబ్బులూ! నువ్వు పోయి మల్లమ్మకెలా వుందో చూడవే అని పంపారు నన్ను అంది సుబ్బులు

హు ఈజ్ దిస్ డెవిల్ ఇన్‌కార్నేట్? అంది మంజూ

రవి యువర్ గెస్ ఈజ్ కరెక్ట్ అని, సుబ్బులుతో మల్లిక పరిస్థితి తృప్తికరంగానే వుంది! కాని తెలిసిన వాళ్ళెవరూ ఆమెకు కనపడగూడదు రెండు రోజుల దాకా నువ్వామెకు కనపడవద్దు' అన్నాడు

అయ్యో! రెండు రోజులదాకా మల్లమ్మను చూడకుండా ఎట్లా వుండేది దొరబాబూ! షావుకారు గారడిగితే ఏం చెప్పేది? అంటూ కళ్ళు తుడుచుకోసాగింది సుబ్బులు

సరోజ వచ్చి సుబ్బులూ నిన్ను ఇక్కడకు రావద్దని చెప్పానా! వూరికే డాక్టరుగారిని విసిగించకు! పద! అంటూ ఆమెను కన్సల్టింగ్ రూమ్ నుండి అవతలకు తరిమింది

'సార్! ఈమె గోల భరించలేకుండా వున్నాం అంటూ డాక్టర్ రవికి ఫిర్యాదు చేసింది సరోజ

విషయం ఏమిటో సరోజను అడిగి తెలుసుకున్నాక 'మీకిక సుబ్బులు బెడద లేకుండా చేస్తా! చూస్తుండండి' అంటూ బయటకు వెళ్ళింది మంజూ

(ఇంకా ఉంది)

# నాకు నచ్చిన నా కార్టూన్






1963నుంచి ఇప్పటివరకు వేల సంఖ్యలో కార్టూనులు వేసాను వీలయినంత వరకు హేళనకన్నా, హాస్యానికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాను నేను ఇంతకాలం వేస్తూవచ్చిన కార్టూన్ల గురించి ఇతర్ల అభిప్రాయాలు గమనిస్తే నాకు ఒక విషయం తెలుస్తోంది ఒక కార్టూను కొంతమందికి మాత్రం నచ్చుతుంది మరో కార్టూను మరొక వర్గం వారికి నచ్చుతోంది అందర్నీ నవ్వించగల లేక మెప్పు పొందగల కార్టూనులు చాలా తక్కువగానే వుంటాయి మరొక విషయం కూడా వుంది 'ఒక మాదిరి కార్టూన్లు అని నేను అనుకున్నవి పాఠకులు 'బాగా' వున్నాయని మెచ్చుకోవటం. నేను బాగా వేసాననుకున్న కార్టూను అంతంత మాత్రంగా పాఠకులు భావించటం కూడా జరిగింది దానికొక కారణం వుంది నా కార్టూన్‌లలో జాలి కరుణ కొంచెం చూపించాలనిపిస్తుంది ఇవి కలవటంతో హాస్యం పాలు కొంత తగ్గటం మూలాన ఏమో పాఠకుడ్ని ఎక్కువ సంతోష పెట్ట లేక పోతున్నాయనుకుంటాను

ఈ శీర్షిక 'నాకు నచ్చిన నా కార్టూన్' కాబట్టి నాకు నచ్చిన కార్టూను మాత్రం ఇవ్వదలచుకున్నాను మిగతా కార్టూన్లు ఎన్నో పాఠకుల్ని అలరించాయని ఉత్తరాల శీర్షిక ద్వారా తెలుసు ఇప్పటి ఈ కార్టూన్ గురించి ఉత్తరాల శీర్షికలో చోటు చేసుకున్న గుర్తు లేదుగానీ, ఒకరిద్దరు ప్రముఖులు మాత్రం ఈ కార్టూన్‌లో 'ఆలోచన' చాలా బాగుందన్నారు నేను వేసిన కార్టూన్లలో నాకు చప్పున గుర్తుకు వచ్చే కార్టూన్ కూడా ఇదే! దీనిలో కార్టూన్‌కు వుండవలసిన లక్షణాలన్నీ వున్నాయని నా అభిప్రాయం

—బాబు

# అసలైన తెలుపు ఏమిటో!... ప్రపంచానికి చూపండి

# డెట్






## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!

Shilpi DM 9A/84 Tel.



# "మమ్మీ! నేనేం పాపం చేశాను....?"

## "కృష్ణజ"

తో టలో మోకాళ్ళల్లో తల వుంచుకుని ఒంటరిగా కూర్చుని, వెక్కిళ్ళు పెడుతోన్న రవి ని చూసిన సుజాత హృదయం కరగిపోయింది

ఎవరూ తనవారు కారు అన్నట్లుగా ఏకాకిగా కూర్చుని ఏడుస్తున్న కొడుకుని చూసి ఆమె కళ్ళల్లో తడి చేరింది

రవీ

నెమ్మదిగా పిలిచింది సుజాత

రవి పలకలేదు కనీసం తల ఎత్తి అయినా చూడలేదు దగ్గరగా వెళ్ళి తల మీద చెయ్యి వేసి ఆప్యాయంగా నిమురుతూ అడిగింది –

ఎందుకు నాన్నా ఏడుస్తున్నావు ?

మోకాళ్ళల్లో తల వుంచుకునే ఏమీ లేదన్నట్లుగా తల అడ్డంగా తిప్పాడు రవి

చెప్పు నాన్నా! ఏం జరిగింది ?'

రవి నుండి ఏడుస్తున్నందుకు గుర్తుగా వెక్కిళ్ళు తప్ప జవాబు రాలేదు

ఎవరైనా ఏమైనా అన్నారా ?

రవి వెక్కిళ్ళ ఉధృతం ఎక్కువయిందా మాటతో

సుజాత కళ్ళ నుండి కన్నీళ్ళు దారలు కట్టాయి

మౌనంగా రోదిస్తూ కొడుకు తలను గుండెలకు హత్తుకుంది

రవి తల్లికి హత్తుకుపోతూ వెక్కిళ్ళ మధ్య అన్నాడు –

మమ్మీ! నేను నేను స్కూలుకు పోను మమ్మీ

సుజాతకిది అలవాటే.

ఎవరో కొంటి కుర్రాళ్ళు రవిని ఏదో ఒకటి అనటం, రవి ఇంటికి వచ్చి ఏడుస్తూ కూర్చుని స్కూలుకు వెళ్ళనని పేచీ పెట్టడం చాలా తరచుగా జరిగే విషయమే

మమ్మీ నేను స్కూలుకు వెళ్ళను మరోసారి చెప్పాడు రవి

తప్పు నాన్నా! స్కూలుకు వెళ్ళనని అనకూడదు

నేను వెళ్ళను మమ్మీ రవి ఏడుస్తూనే అన్నాడు

బంగారు తండ్రిలా నువ్వు స్కూలుకు వెళ్ళాలి శ్రద్ధగా చదువుకోవాలి గొప్పవాడివి కావాలి అప్పుడు నిన్ను చూసి నవ్వినవాళ్ళంతా తలలు దించుకోవాలి ఏం ? రవిని బుజ్జగిస్తూ చెప్పింది సుజాత

ఊ హుం నేను వెళ్ళను మమ్మీ అందరూ నన్ను వెక్కిరిస్తున్నారు '

ఏమని ? అని అడగలేదు సుజాత ఆమెకు తెలుసు రవిని వాళ్ళందరూ ఎలాంటి మాటలతో వెక్కిరిస్తారో

రవీ! రేపు నేను మీ స్కూలుకు రానా ?

ఎందు కు ఎందుకు మమ్మీ ?

వెక్కిళ్ళు తగ్గుముఖం పట్టగా అడిగాడు రవి
మీ టీచర్‌తో చెప్తాను టీచర్ వాళ్ళందరినీ కేకలు వేస్తారు
మమ్మీ టీచరే అన్నారు
టీచరా ?'
ఔను అన్నట్టుగా తల వూపాడు రవి కళ్ళు తుడుచుకుంటూ –
అప్రయత్నంగా ఏమని ? అని అడగబోయి ప్రయత్నపూర్వకంగా నిగ్రహించుకుంది సుజాత
ఏమన్నారో చెప్పమని నొక్కి నొక్కి అడగటం వాడ్నింకా హింస పెట్టడమే. అనే విషయం ఆమెకు తెలుసు
ఆ మాటలు చెప్తుండగా అభిమానంగా వాడి తల ఒంగిపోవడం, ఆ చిన్ని హృదయం మాటల కందని వేదన ననుభవించడం ఆమెకు తెలుసు
కంచే చేను మేస్తే కాచేదెవరు ?
ప్రతి బిడ్డను తన కన్న బిడ్డగా ప్రేమించవలసిన గురువే తోటి పిల్లల మధ్య ఒక పసి హృదయాన్ని హింసిస్తే ఇక చెప్పుకునే దెవరికి?
మమ్మీ' నేనిక స్కూలుకు వెళ్ళను మరోసారి గుర్తు చేశాడు రవి. ఆశగా తల్లి ముఖంలోకి చూస్తూ
రవిని స్కూలు మాన్పించి సమస్యకు తాత్కాలిక పరిష్కారం సాధించినా, సమస్యకు అది శాశ్వత పరిష్కారం కాదు
సమస్య చదువు గురించి కాదు
ప్రైవేటుగానైనా పరీక్షలు పాసు చేయించవచ్చు కానీ
రవి ఇప్పటి నుండీ తనను తాను బంధించుకుని ఒంటరిగా బ్రతికేందుకు అలవాటు పడితే ముందు ముందు రవి భవిష్యత్ ఏమిటి? ఇవీ సుజాతను వేధిస్తున్న ప్రశ్నలు
చెప్పు మమ్మీ' మానేయనా ?
సుజాత ఏ జవాబూ చెప్పకముందే ఇంట్లో నుండి
సుజా అనే భర్త పిలుపు వినిపించి ఉలిక్కిపడ్డట్లయింది మమ్మీ' నువ్వు నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దు అన్నట్టుగా రవి ఆమెను గట్టిగా పట్టుకున్నాడు
ఉండు నాన్నా' డాడీ ఎలుస్తున్నారు అంటూ సుజాత సున్నితంగా రవి బంధం నుండి విడిపించుకుంది
రవి అయిష్టంగానే తల్లిని వదిలిపెట్టాడు వాడికీ ప్రపంచంలో ఏకైక సన్నిహితురాలు తల్లి మాత్రమే
తల్లి తండ్రి గురువు దైవం స్నేహితుడూ అన్నీ ఆమే అందుకే రవి ఒక్క క్షణం కూడా తల్లిని విడిచి వెళ్ళేందుకు ఇష్టపడడు
లోపలికి వచ్చిన ఆమెను చూస్తూనే ప్రభాకర్ అడిగాడు,
అదేమిటి ? నువ్వింకా రెడీ కాలా ?
ఎక్కడికో చప్పున గుర్తు రాలేదు సుజాతకు
షాపింగ్‌కు వెళ్ళి అలా సినిమా చూసి వద్దామని ఉదయమే చెప్పానుగా ? కోపంగా ఉంది ప్రభాకర్ స్వరం

షాపింగ్ సినిమా మనస్సులోనే నిట్టూర్చింది సుజాత
నిజానికి ఆమెకు బయటికెళ్ళేందుకు ఏమాత్రమూ ఉత్సాహంలేదు రానంటే భర్తకు కోపం వస్తుంది

బయటికి ఎక్కడకు వెళ్ళినా ఇద్దరే వెళ్ళాలి
బిక్కు బిక్కుమంటూ రవి ఒక్కడే ఇంట్లో వున్నాడు అనే స్పృహ ఆమెను అనుక్షణం వేధిస్తూనే వుంటుంది
స్కూల్లో టీచర్ ఎగతాళి చేశారని రవి సాయంత్రం నుండీ ఏడుస్తున్నాడు అలాంటి వాడిని ఒక్కడినీ ఇంట్లో వదలి వెళ్ళేందుకు సుజాత తల్లి మనస్సు పరితాపం చెందుతోంది ఆఖరి ప్రయత్నంగా భర్తతో అంది –
రవిని '
భర్త ముఖంలో స్పష్టంగా కనిపించే అసహ్యం, అసహనం ఆమెను మాట పూర్తి చెయ్యనివ్వలేదు

గబగబా రెండు నిముషాల్లో తయారయి రవి దగ్గరకు వెళ్ళి,
రవీ' డాడీ, నేనూ షాపింగ్‌కు వెడుతున్నాం నీకేం కావాలి ? అంది
ఏమీ వద్దు మమ్మీ చాలా నిర్లిప్తంగా అన్నాడు రవి
త్వరగా వచ్చేస్తాం నాన్నా
అలాగే మమ్మీ అదే నిర్లిప్తత
వయస్సుకు మించిన ఆ నిర్లిప్తత ఆమెను ఎప్పుడూ భయపెడుతూనే వుంటుంది
ఆ చిన్నారి హృదయంలో ఏయే భావాలు మెదులుతున్నాయోనని తల్లడిల్లి పోతూంటుంది

త్వరగా వచ్చేస్తాం నాన్నా అంది మళ్ళీ
అలాగే మమ్మీ
రవి, నేనూ వస్తాను మమ్మీ అంటూ మారాం చేస్తే బావుండును అదో ఇదో చెప్పి బుజ్జగించవచ్చు చాకలెట్స్, బిస్కట్స్ తెస్తానని చెప్పి మరపించవచ్చు
కానీ వాడు వయస్సుకు మించిన పెద్దరికం చూపుతోంటే తనేం చెయ్యగలదు ?
రవి, మమ్మీతో పాటు తనూ వస్తానని మారాం చెయ్యడు వాడికి తెలుసు–
తను వెళ్ళలేదని మమ్మీ ఆశక్తురాలని
త్వరగానే వచ్చేస్తాం నాన్నా మూడోసారి చెప్పింది సుజాత
రవి తల్లి కళ్ళల్లోకి చూశాడు లోతుగా
ఆ చూపు అడుగుతోంది –
ఎందుకు మమ్మీ' నీ ఒక్కదానికీ నేనంటే ఇంత ప్రేమా ? ఆ భావం అర్థమయ్యిందో లేదో కానీ సుజాత మాత్రం మరి అక్కడ నిలబడలేనట్టుగా గబగబా బయటికి వెళ్ళిపోయింది సుజాత ప్రభాకర్ కాంపౌండ్ గేటుకు దగ్గరవుతోండగా ప్రక్కింట్లో అద్దెకు వుండే ఆఫీసర్ గారి అబ్బాయి అనిల్, అంకుల్ అంటూ పరిగెత్తుకుంటూ వచ్చి కాళ్ళకు చుట్టుకున్నాడు
ప్రభాకర్ అనిల్‌ను అమాంతం ఎత్తి రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకుని,
నీల్' ఆర్ యూ రెడీ ? అన్నాడు నవ్వుతూ
ఎస్ అంకుల్ ముద్దుగా చెప్పాడు అనిల్

ప్రభాకర్ అనిల్‌ను ఎత్తుకుని ముందుకు నడిచాడు సుజాత తల తిప్పి వెనక్కు చూసింది
కిటికీ ఊచలు పట్టుకుని రవి తదేకంగా చూస్తున్నాడు

* * * * *

ప్రభాకర్, సుజాత, అనిల్ సినిమా నుండి వచ్చేప్పటికి రవి నిద్రపోతున్నాడు
ఏడ్చీ ఏడ్చీ కన్నీటి చారికలు కట్టిన వాడి ముఖం దయనీయంగా వుంది
సుజాత కొడుకు తల నిమురుతూ అలాగే వాడి ప్రక్కలో కూర్చుండిపోయింది ఎంతో సేపు
షాపింగ్‌లో భర్త అనిల్‌ను ముద్దు చేస్తూ వాడు



అడిగినవీ అడగనివీ కూడా కొని పెడుతూ, ఏతు_కొని క్రిందికి దించాడే కాదు

బగవాన్ ఈ పాపం ఎవ్వరిది ?

* * * * *

పెళ్ళి చూపుల్లోనే ప్రేమించేసింది సుజాత ప్రభాకర్‌ను సులోచనారాణి గారి హీరోలా వున్న అతని అందమైన చిరునవ్వును చూసి చిత్తయిపోయింది

మగసిరి నిండిన ఆ విశాలమైన వక్షమూ బలమైన చేతులూ చూసి మోహంలో తేలిపోయింది

అంత అందమైన పెళ్ళికొడుక్కి తను నచ్చుతానో ? లేదో ? అని ఆ తరువాత బెంగపడింది

స్నేహితులూ ఇరుగూపొరుగు వారూ తనను సినిమా స్టారులా వుంటుందని ప్రశంశించినా అతని అందానికి తను దీటురాగలదా? అసలు అతని కళ్ళకు తనెలా కనిపించిందో కదా అని తల్లడిల్లిపోయింది

చాలా సామాన్యంగా ముగిశాయి పెళ్ళిచూపులు కానీ, చాలా గాఢంగానే ముద్రవేశాయి సుజాత గుండెల్లో

పెళ్ళివారివద్ద నుండి అమ్మాయి నచ్చింది అని ఉత్తరం వచ్చేవరకూ కాసేపు స్వర్గంలో, కాసేపు నరకంలో, ఆశలో నిరాశలో భ్రాంతిలో నిజంలో ఇలా చాలా – చాలా రకాలుగా బ్రతికింది సుజాత

తను అతనికి నచ్చడం నిజంగా తన పూర్వ జన్మ సుకృతమేనని మురిసిపోయింది

ఐశ్వర్యవంతుడూ, అందగాడూ అయిన అతనితో తన వివాహం అదృష్టంగా పొంగిపోయిందామె కన్నె హృదయం

సీతారాముల్లా, పార్వతీపరమేశ్వరుల్లా, రాధాకృష్ణుల్లా – రతీమన్మధుల్లా సినిమాలో చూపించే అన్యోన్య దంపతుల్లా

తమ దాంపత్య జీవితాన్ని గురించిన కలల అలల్లో తేలిపోయింది ముహూర్తం సమీపించే వరకూ

కాబోయే భర్త సమ్మోహనకరమైన రూపాన్ని కేంద్రంగా ఊహల్లో ఉయ్యాల లూగింది

సుజాతా ప్రబాకర్ అనే అక్షరాలు అందంగా గుండెల్లోనే కాక ప్రతి చోటా చెక్కేసింది నలుగురూ నవ్వుకుంటున్నా పట్టించుకోకుండా

సుజాత తండ్రి వియ్యంకుడి అంత ధనవంతుడు కాకపోయినా కల వాడే కావడం చేత కట్న కానుకలు బారీగానే ఇచ్చి పెళ్ళి జరిపించాడు

పెళ్ళయి ఎక్కువ రోజులు గడవకుండానే సుజాత గ్రహించింది – అందమైన ప్రభాకర్‌కు అందమైన బార్య కావాలి కానీ, అపురూపమైన ఆమె అనురాగం మాత్రం అక్కరలేదు . దానికి అతని దృష్టిలో విలువలేదు

సుజాతను మోహ పరవశను గావించిన ప్రభాకర్ వక్షస్థలం విశాలమైనదే అయితే దానిమైతల వాల్చి విశ్రమించేందుకు భార్యకు ఒక్కతికే కాక అతను చాలామందికే పర్మిషన్ ఇచ్చాడు ఇంటా . బయటా ఎవ్వరైనా సరే దాని మీద విశ్రమించవచ్చు

# మమ్మీ,
# నేనేం పాపం చేశాను...?

అతని వక్షం (హృదయం) అంత విశాలమైనది

సీత, గీత రోజీ, రాణీ రెహనా, రమణి మేరీ, నీతూ, ప్రీతీ ఇలా జాతి కుల మత బేదం లేకుండా ఎందరెందరికో అతని ఎడద విడిది స్థలం

అందమైన భార్యతో పురుషుడు తృప్తిపడగలడేమో కానీ, స్త్రీ మాత్రం ఒక దశలో అందానికి ప్రాముఖ్యత నిచ్చినా అనురాగవంతుడైన భర్త సన్నిదిలోనే పూర్తి తృప్తిని పొందగలుగుతుంది

భర్తను తన అనురాగంతో మార్చుకునేందుకు - ప్రయత్నించింది సుజాత

భర్తగా నీకు ఏ లోటూ రాకుండా చూస్తున్నాను నువ్వు నా స్వేచ్ఛకు అడ్డు వస్తే మాత్రం సహించను అని ఖచ్చితంగా తెగేసినట్లుగా చెప్పేసి ఆమెలోని స్త్రీ సహజమైన ఆశలకూ, కలలకూ నిప్పు పెట్టేశాడు ప్రబాకర్

అతనికి అనుగుణంగా మారడం తప్ప అతనితో ఘర్షణ పెట్టుకోవడం అంటే, వివాహబందాన్ని విచ్ఛిన్నం చేసుకోవడమే అనే విషయం గ్రహించింది సుజాత

వివాహబందాన్ని విచ్ఛిన్నం చేసుకుని పుట్టింటివారికి సమస్యగా మిగలదలుచుకోని సుజాత పరిస్థితులతో రాజీపడటం అలవాటు చేసుకుంది

ఆ దశలోనే సుజాత గర్భవతి అయ్యింది

భర్త పట్టించుకోకపోయినా తన చీకటి జీవితంలోకి ఓ చిరు దివ్వె ప్రవేశిస్తున్నట్లుగా మురిసిపోయింది కానీ, మూడు నెలలకే ఆమె ఆశలు మాసిపోయాయి

మురిపెం ముగిసిపోయింది.

గర్భస్రావం జరగడానికి కారణాలు విన్న సుజాత వణికిపోయింది.

"చూడమ్మా! మీ వారు కొంచెం ఫ్రీగా మూవ్ అవుతారనుకుంటాను " అంది డాక్టర్ సుగర్ కోటెడ్ పిల్‌లా పాలిష్ చేసిన పరిభాషలో అదే ఆ మాట్లాడుకునేది ఇద్దరు సామాన్యులైతే, "మీ ఆయన పచ్చి తిరుగుబోతు " అని వుండేవారు

మరీ మోటుగా, అనాగరికంగా వుంటారు అనుకునే వాళ్ళయితే, "నీ మొగుడు పట్టి ఊర కుక్క అనివుండేవారు కానీ ఆ మాట్లాడేది పట్నంలో ఓ ప్రముఖ డాక్టరు మాట్లాడుతోంది మరో ప్రముఖుడైన ఇంజనీరు భార్యతో

ఇకముందైనా నీకు గర్భం నిలవడం కష్టం ఈ పరిస్థితి నీ ఆరోగ్యానికి మంచిదికాదు గర్భం నిలవాలంటే నువ్వూ, మీవారూ కూడా తప్పనిసరిగా ట్రీట్‌మెంట్ తీసుకోవాలి

ఈ రకమైన వ్యాధులను వెనేరియల్ డిసీజెస్ అన్న మాట అంటే సెక్సుయల్‌గా వచ్చే వ్యాధులు.

ట్రీట్‌మెంట్ తీసుకోకుండా గర్భం నిలవడం కష్టం ఒకవేళ నిలిచినా పుట్టే బిడ్డ చాలా బయంకరంగా అనేక అవకరాలతో జన్మిస్తుంది మిడిగ్రుడ్లూ, గొగ్గి పళ్ళూ, వెంట్రుకలు మొలవని బోడి తలా కోడిబోరా, వంకర్లు తిరిగిన శరీర అవయవాల్లూ, కళ్ళ వ్యాదులూ, గుండె జబ్బులూ కామెర్లూ, ఎనిమిక్ ఇలా ఇందులో కొన్నైనా లేక అన్నైనా రావచ్చు

ఇన్ని వ్యాదులతో జన్మించిన బిడ్డ సహజంగా బ్రతకదు పుట్టిన కొన్ని గంటల్లోనే మరణిస్తుంది ఒకవేళ బ్రతికినా ఆ బిడ్డ బ్రతుకు దినదిన గండంగా వుంటుంది

అని వివరంగా చెప్పి డాక్టర్ చివరిగా అంది – బేబీ! బయపడవలసిన అవసరంలేదు బార్యాబర్తలు ఒక సంవత్సరం పాటు మందులు వాడితే ఆపైన పండంటి బిడ్డను పొందవచ్చు

తాళి కట్టించుకున్న బార్యగానీ, జన్మనిచ్చిన తల్లిదండ్రులు గానీ కాళ్ళు కడిగి కన్యాదానం చేసిన అత్తమామలు గానీ విద్యావంతుడైన ఆ ఇంజనీరు గారి తిరుగుళ్ళు మాన్పించలేకపోయారు ట్రీట్‌మెంట్ ఇప్పించలేకపోయారు

మరోసారి గర్భవతి అయ్యింది సుజాత ఈసారి గర్భస్రావం జరిగితే బావుండునని మనస్పూర్తిగా కోరుకుంది ఆమె కోరుకున్నట్లు జరగలేదు నెలలు నిండాయి

గర్భస్రావం జరగనందుకు సంతోషించాలో పుట్టే బిడ్డను తలుచుకుని దుఃఖపడాలో అర్థం కావడంలేదు సుజాతకు

కనీసం బిడ్డ పుడుతూనే చచ్చిపోతే బావుండునని ఏ తల్లీ కోరరాని కోరిక కోరుకుంది

ఆమె కోరినట్లు ఏదీ జరగలేదు అదీ జరగలేదు బిడ్డ పుట్టాడు సజీవుడై వున్నాడు కానీ, ఆ కాన్పుతో మొదటిసారిగా బిడ్డవైపు చూసిన సుజాత భయంతో చటుక్కున కళ్ళుమూసుకుంది

ఆపైన గుండెలు పగిలేలా రోదించింది

ఒకటి కాదు రెండు కాదు డాక్టరు చెప్పిన అవలక్షణాలన్నీ రూపుదిద్దుకుని శిశువుగా జన్మించింది

నీలమూ, పసుపూ కలిసిన శరీర ఛాయా, బోడి తలా మిడిగుడ్లూ రక్తం ఓడుతున్నట్లున్న ఎఱ్ఱని పెదవులూ నాలుకా కోడి బోర స్థిరం లేకుండా చలించే కనుగ్రుడ్లూ

ఇదీ శిశువు ఆకారం

హాస్పిటల్‌లో బిడ్డను చూసి చిన్న కేకపెట్టాడు ప్రభాకర్ అతని నోట్లోంచి ఒకే శబ్దం వెలువడింది –

"మై గాడ్ డెవిల్ చైల్డ్ '

అంతే ఆ తరువాత అతనా బిడ్డ ముఖం ఎప్పుడూ చూడలేదు పొరపాటున కనిపిస్తే అసహ్యించుకునేవాడు

ఊహ తెలుస్తున్న వయస్సులో బిడ్డ "డాడీ' అంటూ కాళ్ళకు చుట్టుకోబోతే బంతిని తన్నినట్లు తన్నేవాడు నిర్దాక్షిణ్యంగా ఆ కసాయితనాన్ని భరించలేని సుజాత పిల్లాడ్ని అతని ఛాయలకే








వెళ్ళనిచ్చేది కాదు

ఊహ తెలిశాక తండ్రి కోపాన్నీ, అసహ్యాన్నీ అర్థం చేసుకున్న రవి పూర్తిగా తండ్రి ఎదుట పడటమే మానుకున్నాడు

దానితో సుజాత జీవితం భర్త, కొడుకు అనే రెండు భాగాలుగా చీలిపోయింది

రవి వయస్సు పెరుగుతున్నకొద్దీ తనను తాను బందీగా చేసుకున్నాడు వయస్సుకు మించిన పెద్దరికాన్ని ప్రోది చేసుకున్నాడు నిండా పదేళ్ళు కూడా లేని వాడి మనస్సెప్పుడూ కనిపించని దేవుణ్ణీ, కనిపించే తల్లినీ కూడా ఒకే ఒక ప్రశ్న వేస్తుంటాడు

నేనేం పాపం చేశాను ? అందరిలా నేనెందుకు లేను ? ఆప్యాయంగా రవి తల నిమురుతూ అనుకుంది సుజాత- "

'నాన్నా' నువ్వేమీ పాపం చెయ్యలేదు పాపం మావల్లే జరిగింది మా పాపాలకు ప్రతి రూపానివి నువ్వు అంతే ఏ పాపమూ ఎరుగని భగవంతుని రూపానివి నువ్వు

నాన్నా' రవీ నన్ను 'గొడ్రాలు అనే అవమానం నుండి రక్షించడానికి పుట్టి నువ్వెన్ని అవమానాలు సహిస్తున్నావురా తండ్రీ నిన్ను ఎలా కాపాడుకోను ? కడుపులో దాచుకోనా ?గుండెల్లో భద్రపరచుకోనా ? మన జీవితాలకు విముక్తి ఎప్పటికి ? సమయం రెండు గంటలు దాటుతోండగా సుజాత లేచి వెళ్ళి ఒక నిద్ర మాత్ర మింగి కళ్ళు మూసుకుంది

* * * * *

ఏటి ఒడ్డు ప్రశాంతంగా వుంది

పూచిన మామిళ్ళు గాలికి పరిమళాలు, పంచుతున్నాయి మురళీధర్, అతని భార్య సుమ, మోహన్, అతని భార్య ప్రతిమ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు -

మురళీధర్, సుమల సంతానం ఆరేళ్ళ ప్రీతికి, మోహన్ ప్రతిమల సంతానం ప్రశాంత్‌కూ ఇసుకలో గూళ్ళు కట్టి పెడుతున్నాడు ప్రభాకర్

గులాబీ రంగు శరీరచ్ఛాయతో అందంగా, ఆరోగ్యంగా, చురుకుగా ప్రాణం పోసుకున్న అందమైన రబ్బరు బొమ్మలా ముద్దొస్తుంది ప్రీతి

రంగు కాస్త తక్కువగా వున్నా డిటోగా ఉన్నాడు ప్రశాంత్ ఆ పసివాళ్ళ శరీరంలోని మెరుపూ, నీలాల కళ్ళల్లోని చురుకుదనమూ, ముత్యాల్లా మెరిసే తీరయిన ఆ పలు వరుసా పిల్లల ఆరోగ్యానికి గుర్తుగా అమరాయి

ప్రశాంత్ ప్రభాకర్ వీపు మీద ఉయ్యాలలూగుతున్నాడు

మరేమో అంకుల్ ' అంటూ ఆరిందాలా కబుర్లు చెబుతోన్న ప్రీతీ మాటలకు పగలబడి నవ్వుతున్నాడు ప్రభాకర్

కన్నార్పకుండా చూస్తోంది సుజాత

ఆమె కళ్ళ ముందొక అందమైన దృశ్యం ప్రశాంత్ స్థానంలో రవి

నవ్వుతూ, నవ్విస్తూ, కబుర్లు చెబుతూ రవికి పిచ్చుక గూళ్ళు కట్టిపెడుతూన్న తండ్రి .

ఓహ్ ఎంత అందమైన స్వాభావికమైన దృశ్యం

అంకుల్ గూడు పడిపోయింది అని ప్రీతీ పెద్దగా అరవడంతో, సుజాత కళ్ళముందున్న కమనీయమైన దృశ్యం కరిగిపోయింది

మళ్ళీ గూడు కట్టిపెడుతున్నాడు ప్రభాకర్

అందమైన ప్రీతిని ముద్దు చెయ్యడం తప్పుకాదు

చిన్నారి ప్రశాంత్‌ను ఉయ్యాలలూపడం అంతకంటే తప్పుకాదు కానీకన్న కొడుకు పట్ల అంత కసాయితనం ఎందుకు ?ఆ రూపం వాడు చేసిన పాపం కాదుగా తన పాపానికి ప్రత్యక్ష సాక్షిగా నిలిచినందుకేనా వాడంటే అంత కక్ష

గూని వెధవ

గుడ్డీస్

బోడి గుండు బొప్పాయి

గొగ్గి పళ్ళ గోవిందం

ఇలా స్కూల్లో పిల్లలూ, టీచర్లూ, చివరికి కన్నతండ్రి వాళ్ళలా అసహ్యించుకునేందుకు వాడు చేసిన పాపం ఏమిటి ? ఆ ఉదయం జరిగిన సంఘటన సుజాత కళ్ళ ముందు నిలిచింది – ఫ్రెండ్స్ మురళీధర్, మోహన్ కుటుంబాలతో పిక్నిక్ ప్రోగ్రాం వేసుకున్నాడు ప్రభాకర్

ఎప్పటిలా బయల్దేరవలసింది ఇద్దరే

అతనూ తనూ ఎప్పుడూ లేనిది రవి తనూ వస్తానని పేచీ పెట్టాడు తను బుజ్జగించింది నచ్చ చెప్పింది బ్రతిమాలింది అయినా రవి వినలేదు ఏడుపు ఆపలేదు వీధి గుమ్మం వరకూ వెంటపడ్డాడు

ప్రభాకర్ కళ్ళు కోపంతో ఎఱుపెక్కాయి నడుంకున్న బెల్ట్ తీస్తూనే వాణ్ణి బరబరా లోపలికి లాక్కుపోయాడు కెవ్వు మన్న వాడి కేకా ఆ తరువాత వాడి ఏడుపూ వినిపించి లోపలికి పరుగెత్తే లోపే, ప్రభాకర్ బయటికి వస్తూ, పద అన్నాడు కఠినంగా

నిస్సహాయంగా బయటకు నడిచింది

దెబ్బలు తిని గదిలో హృదయవిదారకంగా ఏడుస్తున్న రవిని ఓదార్చేందుకైనా తనకు అవకాశం లేకపోయింది

ఆ దృశ్యం కళ్ళల్లో కదిలి సుజాత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ప్రతి, ప్రశాంత్ ఆట కట్టి పెట్టిన ప్రభాకర్, మురళీధర్ మోహన్ దంపతులతో పేకాట ఆడుతున్నాడు సుజాతను అడిగితే తనకు ఇంటరెస్ట్ లేదంది

మీ సెలెక్షన్ గొప్పది ప్రతిమ అంది

ఏమిటి అన్నట్లుగా చూశాడు ప్రభాకర్

మీ మిసెస్ చాలా అందమైన వారు

ప్రభాకర్ నవ్వాడు

ఆ నవ్వులో కించిత్ గర్వం తొంగి చూసింది

'అందమైన వాళ్ళకు గర్వం ఎక్కువనుకుంటాను సుమ వ్యాఖ్య

ప్రభాకర్ కనుబొమలు ముడిపడ్డాయి ,

అదేంలేదు అన్నాడు

ఆవిడ కనీసం మీతోనైనా నవ్వుతూ మాట్లాడతారా ?లేక ఎప్పుడూ ఇంతేనా ?' ఎగతాళిగా వున్నాయి సుమ మాటలు

నిజమేరా మీ మిసెస్ చాలా మూడీగా వున్నారు మురళీకృష్ణ అన్నాడు

'ఆమెకు మా కంపెనీ నచ్చలేదేమో నిష్ఠూరంగా అంది సుమ మళ్ళీ

ప్రభాకర్ ముఖం కఠినంగా మారింది

వెంటనే సుజాత దగ్గరకు వెళ్ళాడు

సుజా అనే గరన పంటి పిలుపుకు తృళ్ళిపడింది సుజాత

నలుగురితో కలపడం రానప్పుడు ఏడుస్తూ ఒక మూల పడి వుండాలి స్నేహితుల ముందు ఏని స్పష్టిస్తున్నాననే స్పృహ కూడా లేకుండా పోయిందతనికాక్షణంలో

మిగిలిన నలుగురూ భార్యాభర్తల మధ్య కలుగ చేసుకోరాదని వింటుండిపోయారు

సుజాత సూటిగా భర్త వంక చూసింది

తోటి వాళ్ళతో సరదాగా కలవాలనే జ్ఞానం కూడా లేదా ? కోపంగా అడిగాడు ప్రభాకర్

హుం జ్ఞానం మనం అన్నీ జ్ఞానం వున్న పనులే చేస్తున్నామా" జ్ఞానమనేదే వుంటే ఏడుస్తున్న పసివాడ్ని ఇంటో వదిలి ఇలా మన సరదాలు మనం చూసుకునే వాళ్ళమా ? తోటి వాళ్ళు ఎల్లల్ని వదిలేసి జంట పక్షుల్లా రాలేదే

భార్య ఎదురు జవాబు అతనికో సవాల్‌లా తోచింది ఏ నాడూ తన మాటకు ఎదురాడని భార్య ఇలా నలుగురి ముందూ, అందులోనూ స్నేహితుల ముందు ఎదురు తిరిగి మాట్లాడ్డం అతనికి చాలా అవమానంగా తోచింది

'హు ( వాళ్ళ పిల్లలకీ నీ కొడుక్కీ పోలికా ? అన్నాడు ఎగతాళిగా

నిరసనగా ఒక్క చూపు చూసింది సుజాత ఆ తరువాత చాలా నెమ్మదిగా ప్రశాంతంగా అంది

నిజమే వాళ్ళకూ నా కొడుక్కీ పోలిక లేదు నా బిడ్డకున్న కుక్క లాంటి తండ్రి వాళ్ళకు లేదు అదే వాళ్ళ అంతే ఇంకా ఆమె మాట పూర్తి కాకుండానే అతని చెయ్యి గాలిలోకి లేచింది ఆమె చెంపను తాకేందుకు

చెయ్యి దించండి

ఆ మాటలో, ఆ చూపులో ఏ శక్తి వుందో అప్రయత్నంగా ప్రభాకర్ చెయ్యి క్రిందికి

## మమ్మీ, నేనేం పాపం చేశాను...?

వాలిపోయింది

ఈ సుజాత రూపం అతనికి చాలా క్రొత్త ఇంత క్రితం చూడనిదీ ఎరుగనిదీ సుజాత స్వరం చాలా శాంతంగా, గంభీరంగా, దృఢనిశ్చయంతో దయనీయంగా పలికిందా ప్రశాంత సాయం సంధ్యా వాతావరణంలో

మంటగలిసిన మానవత్వానికి తుది హెచ్చరికలా వుందా స్వరం

ఓడిపోతున్న మానవత్వం తన అస్తిత్వం నిలుపుకునేందుకు చేస్తున్న తుది ప్రయత్నంలా వుందా స్వరం

'ఇన్నేళ్ళూ మీ మూర్ఖత్వాన్ని భరించాను ఇక ముందైనా మీరు మారకపోతారా అనే ఆశతో సహించాను ఎందుకో తెలుసా ? నేను నేను మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమించాను .అందుకే మీ మార్పు కొరకు ఆశగా ఎదురు చూశాను, లాభం లేదు .మీరు మారరు మీ మూర్ఖత్వంతో అన్యాయంగా నా బిడ్డ నలిగిపోతుంటే ఇక భరించే శక్తి నాకు లేదు లోకంలో ఎందరో అనాకారితనంతో అవకరాలతో జన్మిస్తారు ఏ అనుబంధమూ లేని పరాయివాళ్ళు వాళ్ళను ఎగతాళి చేసి ఏడిపించినా కన్నవాళ్ళు ఆత్మీయతతో వాళ్ళను గుండెల్లో దాచుకుని ప్రపంచంలో బ్రతికేందుకు కావలసిన ఆత్మవిశ్వాసం కలిగించాలి కానీ, కన్న తండ్రే కసాయిగా ఊహో కనీస మానవత్వం కూడా లేకుండా వద్దు వద్దు .ఇలాంటి కసాయి తండ్రి పగవాళ్ళకు కూడా వద్దు

నిజమే నా బిడ్డ కురూపి అనాకారే అందవిహీనుడే కానీ కానీ దానికి కారణం ఎవరు ?

భగవంతుడు కల్పించిన అనాకారితనం కాదు వాడిది వాడి వికృత రూపానికి కారణం మీరు వాడి అనాకారి ఆకారానికి కారణం మీరు' మీ విశృంఖలత

పడగ నీడ వంటి మీ నీడలో నా బాబుకు రక్షణ లేదు కురూపి అయినా, అనాకారి అయినా ఎటువంటి వాడయినా వాడు నా బిడ్డ వాడిని నా గుండెల్లో దాచుకుని పెంచుకుంటాను మీకు దూరంగా, మీ నీడ కూడా నా బాబు మీద పడనంత దూరంగా వెళ్ళిపోయి నా బాబును పెంచుకుంటాను

సుజాతా' తొందర పడుతున్నావమ్మా మురళీధర్ ఆమెను వారించ ప్రయత్నించాడు

లేదు, అన్నయ్య గారూ' ఇప్పటికే ఆలస్యం చేశాను బాబు పుట్టి పొంగి పొరలే నాలోని మాతృ వాత్సల్యాన్ని నాలోనే అణుచుకుని, ఈ సంసార బంధానికి బానిసనయి మాతృత్వానికే మచ్చ తెచ్చాను నా బాబుకు అన్యాయంచేశాను

ప్రభాకర్ గారూ' ఇక మీ జీవితం మీ ఇష్టం నేను గానీ, నా బాబు గానీ మీకు ఎలాంటి అడ్డూ కాబోము వస్తాను శలవు

సుజాత చేతులు జోడించి వెనుదిరిగింది

సు జా అనే పిలుపు గొంతులోనే ఆగిపోగా నిశ్చేష్టుడై నిలబడిపోయాడు ప్రభాకర్

* * * *

సుడిగాలిలా ఇంట్లోకి ప్రవేశించిన సుజాత బాబూ అంటూ ఇల్లంతా వెదుక్కుంది

బెడ్ రూంలో నేల మీద అస్తవ్యస్తంగా పడి వున్నాడు రవి

రవీ అంటూ దగ్గరకు వెళ్ళిన సుజాత అచేతనంగా మంచుకంటే చల్లగా వున్న రవి శరీరం తాకి రవీ" అంటూ పెద్ద కేక పెట్టింది

ఆ కేక దిగ్దిగాంతాల నడుమ ఎక్కడో వున్న రవికి తప్పకుండా వినిపించే వుంటుంది

కానీ, "మమ్మీ అంటూ రవి పలకలేదు

బాబూ! ఏం చేశావు నాన్నా ?" అని రోదించే సుజాత ప్రశ్నకు రవి జవాబు చెప్పలేదు కానీ వాడి ప్రక్కనే దొర్లుతూ కనిపించిన నిద్రమాత్రలు సీసా చెప్పింది రవి ఏం చేశాడో

తెరుచుకు వున్న రవి మిడిగ్రుడ్లలో ఒకే ఒక ప్రశ్న

మమ్మీ! నేనేం పాపం చేశాను ? 

## సేండ్ విచ్

కని, పెంచి పెద్ద చేసిన కొడుకు
కోడలి మోజులో పడి
తనకు దూరం అవుతున్నాడనుకునే తల్లి,
తల్లిమీద ప్రేమతో
తనకు దగ్గర కాడేమో అనుకునే భార్య
వీళ్ళ మధ్య 'సేండ్ విచ్' అవుతున్నాడు
పురుషుడు పెళ్ళయిన తరువాత

- కో వేంకట పాపారావు



# బెణుకుల బాధతో తన గొప్ప రోజు పాడవడం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి — ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో, గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లునొప్పులతో బాధ పడటం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్®** — నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.

SKOF — ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

ELL-1509

23×17 cms Patrika

సీరియల్:

# జిగి-బిగి

ఎమ్.హరా



(గత సంచిక తరువాయి)

"యువరాణి తల్లి మహారాణి కాదు సంయుక్త పని మనిషి కూతురని, హీ కులానికి చెందినదని నాకు చాలా ఆలశ్యంగా తెలిసింది కులీనులు హీన కు లని పెళ్ళాడ కూడదని నువ్వు అతి రహస్యంగా నాకు నూరిపోశావు పని మ కూతురిని కోడలిగా నువ్వు అంగీకరించవని సంయుక్త ప్రేమని నిర్దయగా వాపసు యిచ్చేశాను' అన్నాడు చిరంజీవి సీరియస్‌గా

మధ్యలో కలుగ జేసుకున్నందుకు నన్ను క్షమించండి మహారాణి గారంటే పేడ పిసుక్కునే పేరమ్మ కాదు ఈగలు తోలుతూ చేగోడీలు అమ్ముకునే సీతమ్మ కాదు వంటింటికి, బెడ్‌రూంకి పరిమితమైన పతివ్రత కాదు మహారాణి అంటే మహారాణే వారికి ఎన్నెన్నో వ్యవహారాలు, వ్యాపకాలు, చాటు మాటు కాలక్షేపాలుంటాయి వారు ఎంత బిజీగా వుంటారంటే పది నెలలు వోపిక పట్టి పిల్లల్ని కనే తీరిక వుండదు అందుకే వారు యిటువంటి చిల్లర పనులు పనిమనిషికి అప్పగించారు పనిమనిషికి పుట్టిన యువరాణి గారి తండ్రిగారు మహారాజా వారే యిటువంటి పిల్ల కథలు నేటికీ భారీ బారీ, కుటుంబాల్లో జరుగుతూనే వున్నాయి యూమై కరక్ట్ అంది గబగబా సౌభాగ్యం

మొగవాడి వంశాభివృద్ధికి పిల్లలు కనే ప్రతిస్త్రీ భార్యతో సమానం పనిమనిషి మహారాణితో సమానం యువరాణికి మహారాజా వారి ఆస్తిపై హక్కు వుంది ఎంతైనా వారి అమ్మాయేగా నాకీ సంబంధం అన్ని విధాలా నచ్చింది అంటూ తన మనసుని బహిరంగపరిచింది సాధ్వి

'నా పని యింత సులభంగా, సజావుగా జరిగి పోతుందని కలలో కూడా అనుకోలేదు ఈ పెళ్ళి జరగదని సహాయం కోసం ప్రజాసేవ కంపెనీకి వచ్చింది సంయుక్త మా బాబయ్య బిజీగా వుండటం వల్ల నేనీ కేసు టేకప్ చేశాను ఈ పెళ్ళి జరిపిస్తానని యువరాణికి ధైర్యం నూరిపోసి పదివేలు అడ్వాన్స్ తీసుకున్నాను సంవత్సరానికి పాతిక వేల జీతంపై వారి పర్సనల్ సెకరెట్రీగా ఉద్యోగం సంపాదించుకున్నాను '

సౌభాగ్యం దోరణికి అడ్డువస్తూ అపుతల్లీ అపు నీ గోల నీ వాగ్ధోరణికి జ్వరం, తలనెప్పి వొళ్ళు నెప్పులేగాక వాంతి కూడా వేగంగా వస్తున్నది యింతకీ యువరాణి సంయుక్తగారు ఎక్కడున్నారు అంది సాధ్వి బలంగా కణతలు రుద్దుకుంటూ

యిప్పుడే ఢిల్లీ వెళ్ళారు వారలా వెళ్ళారు నేనిలా వచ్చాను యువరాణి వారికి చాలా వ్యవహారాలు, వ్యాపకాలున్నాయి అవన్నీ తీరిగ్గా యింకోసారి చెబుతాను అన్నట్లు చెప్పడం మరిచాను ది బెస్ట్ మహిళా ఆఫ్ ది సెంచరీ అవార్డు యిచ్చేది ఎవరో కాదు మన సంయుక్తగారే మీ వుడ్ బి డాటరిల్లా

అవార్డా' కళ్ళని పెద్దవి చేసింది సాధ్వి

ఈ శతాబ్దంలో అటు మహిళాభ్యుదయానికి పాటుబడుతూ యిటు తన సంసారాన్ని సక్రమంగా సరిదిద్దుకుంటున్న ఏకైక మహిళకీ అవార్డు లభిస్తుంది అవార్డు అంటే చింతపండుతో తోమిన యిత్తడి తాపడం వేసిన అప్పడాల కర్ర కాదు పోపుగరిటి కాదు రత్న మణి మకుటాలతో, కెంపు ముత్యాలు తీర్చి దిద్దిన, వజ్ర వైడూర్యాలు పొదిగిన రంగు రంగుల గిల్ట్ బంగారు గాజు పూసల గజకంకణం ప్లస్ పది అడుగుల పొడవైన సర్టిఫికెట్‌తో సన్మానం ఈ అవార్డు కోసం ప్రపంచం నలుమూలల నుంచి యిప్పటికి అరవై వేల క్వింటాల్స్ బరువుగల అప్లికేషన్లు వచ్చాయి ఎందుకేనా మంచిదని మీ ఘనతని వివరిస్తూ పాతిక గ్రాములు తక్కువ కిలో బరువుగల అప్లికేషన్ దాఖలు చేశాను" బాగా కష్టపడి అలిసిపోయినట్లు సోఫాలో అనీజిగా కదిలింది సౌభాగ్యం

'నిజంగా నాకా బహుమతి వస్తుందా?' అంటూ నోరు తెరిచింది సాధ్వి అమె కెదురుగా ఓ పేద్ద నిలువుటద్దం వుంది బార్లా తెరిచిన నోరు ఆమె కంటికి బాగా కనబడుతున్నది

ఆ నోటిలో భూమి గిర్రున తిరుగుతోంది ఆ భూగోళంపై ఎక్కడ చూసినా శ్రీమతి సాధ్వి కీర్తి పతాకాలు రెపరెపలాడుతూ ఎగురు తున్నాయి ఆమెకి బొట్టుపెట్టి అరవై సెంటి మీటర్ల జాకెట్ క్లాత్‌తో సన్మానిస్తున్నారు ప్రజలు ఆమెకి పుష్పాభిషేకం చేస్తున్నారు పూలు చాలక ఆకు పూజ చేస్తున్నారు ఆకులు చాలక కొమ్మలు, మానులతో పూజలు చేస్తున్నారు చెట్ల కోసం అడవుల్ని కొట్టేస్తున్నారు అడవులు లేక వానలు కురవ లేదు వానలు లేక పంటలు పండటం లేదు తిండిలేక ప్రజలు గాలిని భోంచేస్తున్నారు బలంలేక సంసారాలు చేయడం లేదు యిక కుటుంబ నియంత్రణ బాకా వూదవలసిన పనిలేదని శ్రీమతి సాధ్వి సన్మాన సత్కారాల గాథలు గానం చేయసాగింది రేడియో

మమ్మీ యిక నోరు మూయవే నీ నోట్లో బల్లిపడితే ప్రమాదం నీక్కాదు దానికి హత్యానేరం నీపైబడుతుంది నీ కీర్తికి మాయని మచ్చ ఏర్పడుతుంది. ఆ అవార్డు నీకే వస్తుంది యిక నోర్మూయ్యవే అంటూ తల్లి నోటిని గట్టిగా మూశాడు చిరంజీవి

'ఆంటీ మీకుకాక యింకెవరి కొస్తుందా అవార్డు తల్లినని చెప్పుకునే అవసరం లేకుండా చిరంజీవిగారిని రహస్యంగా పెంచి పెద్ద చేశారు బార్సిలో కాలుజారే సారా కంట్రాక్టర్ కొండలరావుగారితో గుట్టుగా కాపురం చేస్తున్నారు" సౌభాగ్యవతి నోటికి తాళం పడింది.

యింటి ముందు ఆగిన కార్లోంచి దిగిన కొండలరావు కుదురుగా నడవలేక పనిమనిషి సాయంతో దొర్లుకుంటూ యింట్లోకి వచ్చాడు. బెడ్‌రూంలో పనిమనిషి సేవలు అందుకుంటున్న భర్తవంక గుర్రు గుర్రుగా చూస్తూ 'నిజంగా నాకా అవార్డు వస్తుందా? అంటూ అనుమాన నీరసంతో అడిగింది సాధ్వి

జరిగిన కథ–5 సీనియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయికి అదే పరీక్ష రాయడానికి వెళుతున్న అబ్బాయి పరిచయం అవుతాడు 'ప్రజాసేవ కంపెనీ' నడిపె బ్రహ్మచారి ఉబయం తన ఎనతల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరతీశాడు సౌభాగ్యానికి పెళ్లి చేసి ఆమె భర్తని దత్తత చెసుకోవాలని ఉబయం కోరిక సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి సౌభాగ్యం, చిరంజీవి ప్రేమించుకున్నారు అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకున్నారు సౌబాగ్యవతి పేరుతో అబ్బాయి రూమ్‌కి వెళ్లిన అమ్మాయి అతనికి ఉబయానందం పథకం వివరించింది అంతా విన్న అబ్బాయి ఇదంతా తన నాన్న ఆడుతున్న నాటకమెనని తన కథంతా చెప్పసాగాడు అబ్బాయి తండ్రి ప్రజాపతి దగ్గరికి వెళ్లి అబ్బాయి తన కోడలు సౌబాగ్యవతిని ప్రేమిస్తున్నాడని చెప్తాడు ఉబయం ఉభయం, పెద్ద యెత్తుతో వ్యూహం పన్నుతున్నాడని పసిగట్టిన ప్రజాపతి తను వచ్చి అబ్బాయి ప్రెమను పరీక్ష చేసి పెళ్లి చెస్తానని చెప్తాడు ఏదో ఒక సాకుతో అబ్బాయి, అమ్మాయి, చిరంజీవి, సౌబాగ్యం హైదరాబాదు చెక్కెయ్యాలని ప్లాను వెసుకుంటారు ప్రజాపతి కొడుకుని చూడడానికి వస్తాడు

దొ నేషన్లు, గిఫ్టులు, గ్రాంటులు దండిగా దండుకుంటూ స్త్రీ జనోద్ధరణకై పాటుపడే మీకుకాక యింకెవరి కొస్తుందా అవార్డు" సౌభాగ్యవతి చాలెంజి పూర్తి కాకుండానే ఆ యింట్లోకి ప్రవేశించాడు వొక వ్యక్తి అతను వస్తూనే అన్నాడు

"మేడమ్ మీరు చెప్పినట్లే కొత్త కుట్టుమిషన్లని మహిళామండలి ఛాయలకి తీసుకెళ్ళకుండా టైలరింగ్ షాపులకి పంపించాను పాత ఇనుప సామాన్ల షాపులో చెత్త కుట్టుమిషన్లని కొనేసి మహిళా మండలిలో అలంకరించాను రత్నం షాపులో మీరు ఆర్డరిచ్చిన రవ్వల నెక్లెస్ రెడీగా వుందిట యిక మీదే ఆలశ్యం మొన్న రాత్రి మునిసిపల్ గెస్టు హౌస్‌కి వెళ్ళిన మన అనాథ ఆశ్రమం తాలుకా అనసూయ నిన్న రాత్రి ఆత్మహత్య చేసుకుంది –"

అతని ధోరణికి అడ్డువస్తూ గుమాస్తాగారూ యిక చాలు మీ పురాణం మీరిక వెళ్ళండి నేను వేరే పనిలో వున్నాను' అంటూ గాండ్రించి వంద రూపాయల నోటుని గాలిలో ఆడించింది సాధ్వి గుమాస్తా పీనుగ ఆ గాలిపటాన్ని అందుకుని ఏడ్పుమానేసిన పిల్లాడిలా పరిగెత్తుకుంటూ రోడ్డెక్కాడు

'బాగ్యం నువ్వేమీ వినలేదు నాకా అవార్డు వచ్చేట్లు చేయాలి యువరాణి నా కోడలు కావాలి నీ కష్టం వుంచుకోను ప్రస్తుతానికి ఈ ఆరువందలు వుంచు అంటూ సౌబాగ్యాన్ని మంచి చేసుకోవడానికి డబ్బుతో ఎరవేసింది సాధ్వి తన మామూలు అవినీతి దోరణిలో

సారీ' అంది సౌభాగ్యం

సాధ్వి మొహం నల్లబడింది అయినా గడుసుగానే అంది

శుక్రవారం పూట శుబమాని డబ్బిస్తూంటే వద్దంటావేం.'

నేనిప్పుడు యువరాణి సెకరెట్రీని నాలుగు అంకెలకి తక్కువ ఫిగర్ తీసుకోనని సంయుక్తపై వొట్టేసుకున్నాను యిప్పుడీ ఆఫ్టారాల్ ఆరు వందలకి కక్కుర్తి పడితే ఛీమని చస్తుంది యువరాణి'

'అదా నీ ఏడ్పు పదకొండు వందలిస్తాను నా పనులు పూర్తి చేయి నీ కష్టం వుంచుకోనులే' అంటూ డబ్బిచ్చింది సాధ్వి

యువరాణి రాగానే ఫోన్ చేస్తాను అంటూ యిక ఎటువంటి ఆలశ్యం చేయకుండా తూనీగలా ఎగిరి ఆ యింటి నుంచి బయటపడింది సౌభాగ్యవతి

## 14

ఆ రోజు సాయంకాలం నలుగురు ప్రేమికులు హాటల్లో 'కలిశారు అంతవరకు జరిగిన సంఘటనలు సమీక్షించారు

"మా మావగారిని స్లీపింగ్ పిల్స్‌తో-జో కొట్టాను ' అమ్మాయి హేళన

మా అత్తయ్య గుండెలపై అవార్డుని కూర్చోబెట్టాను బెట్టుగా అంది సౌబాగ్యం

"యువరాణి కథని ఆవిడ నమ్మిందా? అబ్బాయి సందేహం

నమ్మకేం చేస్తుంది ధన దాహం కీర్తి వ్యామోహం

రేపు ప్రజా సేవ కంపెనీకి వస్తాడు మా నాన్న అక్కడ మన నాటకం రక్తికట్టాలి " అబ్బాయి ఉవాచ





# జిగిబిగి

'నన్నూ అబ్బాయిని బళ్ళపాలిం తీసుకెళ్ళడానికి ముచ్చటపడుతున్నారు మావగారు, తదుపరి కార్యక్రమం" భయం భయంగా లేడి చూపులు చూసింది అమ్మడు.

"ప్రస్తుతానికి బాదుషా తినడం" కిసుక్కున నవ్వింది సౌభాగ్యం

"నాకో బ్రహ్మాండమైన ఆలో చన వచ్చింది ఈ దెబ్బతో ఆ ముగ్గురి ఆట కట్టు. కాశపాశ డైలాగులు సుదీర్ఘంగా సీరియస్‌గా వుంటాయి అసలు పద్యాలు వుంటే బాగా రక్తికడుతుంది. మనకి హార్మోనియం లేదుగా" అంటూ దిగులుపడి మైసూర్‌పాక్ తిమ్మని సర్వర్‌ని పురమాయించాడు చిరంజీవి.

"నాకు నాలుగైదు రోజులు శెలవూ కావాలి ఉభయానందం ఖర్చుపై హైదరాబాదు వెళ్ళాలి. కుటుంబరావుని కలుసుకోవాలి జాబ్ సంపాదించుకోవాలి" అంటూ రవ్వ లడ్డు తినసాగింది అమ్మడు

"నువ్వేకాదు. మన నలుగురం కలిసి త్వరలో హైదరాబాదు వెళ్తున్నాం నిన్న రాత్రి సత్రకాయ కలిశాడు. హైదరాబాదులో మనకి యిల్లు బుక్ చేశాడుట. వాడి అక్కయ్యగారి యిల్లేనట అన్ని వివరాలు చెప్పడానికి యిక్కడికి వస్తానన్నాడు, ఎందుకు రాలేదు చెప్మా" అని ఆలోచిస్తూ కజ్జికాయల ప్లేటు ఖాళీ చేశాడు అబ్బాయి

మన నాటకంలో క్లైమాక్స్ సీన్ దగ్గరబడింది మనం రేపు హుషారుగా వుండాలి' చిరంజీవి మాటలకి అడ్డు వస్తూ "నాకంతా అయోమయంగా వుంది. మావయ్యకీ బాబయ్యకి తేడా లేకుండా వాగేస్తున్నాను. ఈ నాటకం నాకు అంతుబట్టడం లేదు" అంటూ గబగబా వాగేసి గులాబ్‌జామ్‌ని వూదేసింది సౌభాగ్యం

"రేపు మీరేం చేయాలో అందరికీ చెప్తా. మిస్టర్ సర్వర్ మరొక స్వీట్" అంటూ బూందీ లడ్డూని చిదిపాడు చిరంజీవి

సర్వర్ బిత్తరపోయి "మరొక్క స్వీటా. ఈ పేరు నేనెక్కడా వినలేదే వారపత్రికల పిండి వంటలు ఈ హోటల్లో చేయరు సార్" అంటూ తన అతి తెలివితేటలు ప్రదర్శించాడు

"మరొక్క స్వీటంటే యింకో స్వీట్ అని అర్థం" అంటూ నవ్వుతూ పెసరెట్‌ని తినసాగింది అమ్మడు

"యింకెక్కడ స్వీట్స్ సార్. అన్నీ మీరే తినేశారు కావాలంటే వేడి వేడి పూరీలు తెప్పిస్తాను"

"అయితే పాతిక పూరీలూ, అరు కప్పుల మిల్క్ తీసుకురా పాల పూరీలు చేసేసుకుంటాం" అంటూ కళ్ళెగరేస్తూ కారప్పూస ప్లేటుని ఖాళీ చేయసాగింది సౌభాగ్యం

"భాగ్యం . తిండి రంధి వదిలి కరంట్ టాపిక్‌కి రా రేపటి నుంచి సత్రకాయే మన నాటకానికి ప్రాణం ఆ వెధవ వస్తే మన నాటకాన్నంతా వొక్కసారి చదివి వినిపించేవాడిని యిక్కడికి వస్తానన్నాడు యింకా ఎందుకు రాలేదు చెప్మా" అని మరొక్కసారి ఆలోచిస్తూ మసాలాదోశని లాగించి పారేశాడు చిరంజీవి

నాకంతా గజిబిజిగా ఉంది అంటూ పాలపూరీలు తినసాగింది సౌభాగ్యం

గజిబిజి కాదు జిగిబిగి' చిరంజీవి సమాధానం

'జిగిబిగి అన్నాయి మూడు కంఠాలు

జిగిబిగి అంటే ఏమిటని ముక్త కంఠంతో అడిగారు

జిగి అంటే చిరంజీవి ఎం ఏ తెలుగు ప్రశ్న

జిగి జిగేల్ కాంతి మెరుపు లైట్, స్పార్క్' మెరుస్తున్న కళ్ళని చక్రాల్లా త్రిప్పుతూ అంది సౌభాగ్యం

"బిగి అంటే మళ్ళీ ప్రశ్న.

'బిగి అంటే నాకు తెలుసులే" అంటూ తన చెంపలోకి అల్లుకుంటున్న ఎర్రదనపు వేడి అతనికి తగలకూడదని పిసరంత దూరంగా జరిగింది సౌభాగ్యం.

"బిగి అంటే' అమాయకంగా అడిగింది అమ్మడు

'నేను చెబుతా ముందు వాళ్ళిద్దరిని కళ్ళు మూసుకోమను" అంటూ తన వేడి చూపులతో కొసరి కొసరి ఆమెలో ఉద్రేకపు అలజడిని పుట్టించాడు అబ్బాయి

"నేను కూడా కళ్ళు మూసుకోవాలా సార్ అని సర్వర్ ప్రశ్నించగానే 'సర్వేశ్వరా నువ్విక్కడే వున్నావా? వేగంగా వెళ్ళి వేడి వేడి మిర్చి బజ్జీలు తీసుకురా" అంటూ ధుమ ధుమలాడాడు అబ్బాయి

బజ్జీలన్నీ మీరే తినేశారు నిన్నటి చద్ది ఉప్మా యిప్పుడే వెచ్చబెడుతున్నారు తెస్తాను నాదో చిన్న విన్నపం సార్ మినపప్పు యిప్పుడే నానబోశారు మీరింకాసేపు మాట్లాడుకోండి సార్ ఎంత .. ఏడెనిమిది గంటల్లో వేడి వేడి మసాలా వడలు తెస్తాను' అంటూ వడి వడిగా లో పలికెళ్ళాడు సర్వర్

ఆ గదిని ముసి ముసి నవ్వుల ముసురు ఆవరించింది ఆ ముసురులో వాళ్ళు ముచ్చట్లాడుకుంటూ తమ నాటకాన్ని రూపొందించుకుంటున్నారు

ఈ దెబ్బతో కీర్తి కోసం, అధికారం, తద్దినాల కోసం వొళ్ళూ పైనా తెలీకుండా పేట్రేగిపోతున్న ముగ్గురు పెద్దలకి బుద్ధి వస్తుంది వాళ్ళని వూపిరాడని జిగిబిగి అల్లుకుంటుంది, ఐ మీన్ టు సే వాళ్ళ జీవితాల్ని జ్ఞానం అనే ఫైలుగు కౌగలించుకోవాలి దట్స్ ఆల్, ది ఎండ్ అంటూ తన నాటక రచనకి హారతి పట్టాడు చిరంజీవి

'జిగిబిగి అంటే కాంతి కౌగిలా? సౌభాగ్యం ప్రశ్న

'బుద్ధి రావడమా?" అమ్మడి అనుమానం

చిరంజీవి సమాధానం చెప్పేలోగా అంతలో అవ్వాయి చువ్వాయిలా వచ్చిన హోటల్ యజమాని వాళ్ళని చూస్తూ లబో దిబో మన్నాడు

అయ్యలూ, అమ్మలు మీకు నమస్కారాలు మీకు పుట్టబోయే పిల్లలకి అడ్వాన్స్ దీవెనలు దయచేసి ఈ హోటల్ వదిలి వెళ్ళండి కావాలంటే మీ విరోధులకి చేతబడి ఫ్రీగా చేయిస్తాను

మీరిలా గంటల తరబడి కబుర్లు చెప్పుకుంటూ వేడి వేడి పదార్థాలన్నీ వూది పారేస్తుంటే మిగతా వారికి నేనేం సమాధానం చెప్పుకోవాలి కట్‌డ్రాయర్, చేతుల బనీను, లుంగీతో నేను బహు దూరం నుంచి పెన్నా, కృష్ణా, గోదావరి దాటి ఈ వూరు వచ్చాను క్లీనర్‌గా చేరి సర్వర్‌గా మారి ప్రొప్రైటర్‌గా ఎదిగాను వేళకింత కాఫీ, ఫలహారం, బోజనం అమర్చి ఈ వూరి ప్రజల మన్నన పొంది, ఏదో యిలా నలభైరూముల లాడ్జింగ్ బోర్డింగ్ హోటల్ నడుపుకొంటూ వస్తున్నాను

వొకరి చేత మాట పడకుండా రెండు ఫామిలీస్ మైన్‌టైన్ చేస్తున్నాను నన్నిలా లుంగీ కట్టనీయండి మీరీ హోటల్లో అన్ని పదార్థాలు మింగేస్తే ఎలా? ఈ హోటల్‌కి మహారాజ, సాధారణ పోషకులైన కస్టమర్స్‌కి నేనేం సమాధానం చెప్పాలి? ఒక్క క్షణం కబుర్లాపి హోటల్ అంతా చూడండి మీకే తెలుస్తుంది"

అంటూ ప్రాధేయపడుతున్న హోటల్ ప్రొప్రైటర్ గుండెనే గాక కళ్ళని కూడా బండరాళ్ళుగా మార్చుకున్నాడు

ఆ హోటల్లో సింగిల్ ఇడ్లీని వన్‌బై పోర్ చేసుకుని తింటున్నవాళ్ళనీ, పచ్చడి జుర్రుతున్న వాళ్ళనీ, సాంబారు తాగుతున్న వాళ్ళనీ, చేతివేళ్ళని నాకుతున్న వాళ్ళనీ, ఖాళీ ప్లేట్స్‌ని వాసన చూస్తున్నవాళ్ళనీ చూసి చూసి బరువెక్కిన గుండెలతో కుర్చీల్లోంచి కదలలేకపోయారు నలుగురు ప్రేమికులు

అప్పుడే సుడిగాలిలా వచ్చిన సత్రకాయ వాళ్ళని చుట్టేసి 'మీరిక్కడున్నారా? మనం తూర్పు వీధి హోటల్‌కి బుణపడి ఉన్నాం కదా? బుణానుబంధం తీరిపోయిందా? యిప్పుడీ హోటల్‌కి తగలడ్డారేం? ఎనీహౌ వచ్చేశాను మీ కోసం హైదరాబాదులో మా అక్కయ్య గారింటికి తాళం పెట్టి వచ్చేశాను అక్కడ మీకు విడిది రెడీగా వుంది ఎప్పుడేనా వెళ్ళవచ్చును. అది సరేలెండి మీ ప్రోగ్రాం అయిపోయిందా? అయినా ఫరవాలేదు వొన్స్ మోర్ –' అంటూ ఎగిరి టేబుల్ అంచుపై కూర్చుని "వేడిగా ఏమున్నాయ్" అంటూ సాక్షాత్ హోటల్ యజమానినే ప్రశ్నించాడు

'నేను కట్టెపుల్లలు' కోపంగా విరుచుకుపడ్డాడు హోటల్ ప్రొప్రైటర్

ఏమిటా తల పొగరు పిచ్చి పిచ్చి కూతలు కూస్తే నీ పేగులతో పాయసం చేయిస్తాను'

చేయించండి చూద్దాం' అతను హడావిడిగా సత్రకాయని సమీపించాడు

తమ యజమాని ప్రాణం రక్షించడానికి అతి వేగంగా చుట్టుముట్టారు సర్వర్స్ అండ్ క్లీనర్స్

మీ యూనియన్ చూసి భయపడడానికి నేనేం ప్రొప్రైటర్ పీనుగని కాదు చూపిస్తా నా తడాఖా నా ప్రతాపం చూడడానికి కాష్ కౌంటర్ వదిలి మీ ప్రొప్రైటర్ పీనుగని కూడా రమ్మనండి అంటూ వొంటి కాలిపై లేచాడు సత్రకాయ

నేనే ఆ పీనుగని చూపించు నీ తడాఖా నీ ప్రతాపం అంటూ సత్రకాయ చొక్కా పట్టుకున్నంత పని చేశాడు హొటల్ యజమాని సర్వర్స్ అండ్ క్లీనర్స్ చేతులు పైకెత్తారు

పరిస్థితి చేయి దాటకుండా అతి సులబంగా సత్రకాయని మోసేస్తూ హొటల్లోంచి బయటపడ్డారు నలుగురు ప్రేమికులు

15

వందేమాతరం, జనవరి ఇరవై వొకటో తేది శనివారం అంటూ శ్రీ వేంకటేశ్వర స్వామిని నిద్ర లేపసాగింది రేడియో అప్పటికే స్నానం, సంధ్యా పూర్తి చేసిన సూర్యనారాయణగారు తాపీగా భగవద్గీత పారాయణం చేస్తున్నారు

ఎలిమెంటరీ స్కూల్ టైమ్‌కి స్నానం చేసింది అమ్మడు హైస్కూల్ టైంకి సోగ కళ్ళకి నిండుగా కాటుక పెట్టి ట్రిమ్‌గా తయారై అబ్బాయి కోసం ఎదురు చూడసాగింది

ఇంతవరకు రాలేదు ఆఫీసు టైంకి వస్తారేమో' అంటూ కోల కళ్ళు క్వశ్చన్ మార్కులు కాగా, వాల్జడని కుడి చేత్తో త్రిప్పుతూ అమ్మడు పోర్షన్‌లోకి వచ్చింది సౌభాగ్యవతి

అయితే సాయంకాలం లోగా తప్పకుండా వస్తారు అసలు ఆఫీసులకి పనిచేసే వేళలు ఎక్కడ ఏడ్చాయి? లంచం దొరికితే అర్ధ రాత్రైనా సీటుని వదలరు పార్టీలు రాకపోతే అటెండెన్స్ రిజిస్టర్‌లో సంతకమున్నా పట్టపగలే ఎడ్రస్ దొరకరు'

అమ్మడూ ఆపు నీ హార్మోనియం మన యింటి ముందు ఆటో ఆగింది అబ్బాయీ, ప్రజాపతి గారు వస్తున్నారు తాతయ్యని మాత్రం కనిపెట్టి వుండు అంటూ విసురుగా జడని వెనక్కేసుకుంది సౌబాగ్యం

ముందుగా వేసుకున్న పథకం ప్రకారం తండ్రిని సూర్యనారాయణ గారి పోర్షన్‌లోకి తీసుకెళ్ళాడు అబ్బాయి

తన తాతయ్యని ప్రజాపతికి పరిచయం చేసింది అమ్మడు సూర్యనారాయణ గారి పాదాలకు నమస్కరించాడు అబ్బాయి ఆయన అబ్బాయిని దీవిస్తూ పొగడకూడదు గాని మీ అబ్బాయి సుగుణాల పోగు. మా అమ్మాయి చాలా అదృష్టవంతురాలు' అంటూ మురిసిపోయారు అమ్మడు ఆడుతున్న నాటకం గురించి ఆయనకి తెలియదు

మీ మనుమరాలు మా ఇంటి కాలు బెట్టడమే మాకో పెద్ద వరం మీ భాగ్యం యిక మా భాగ్యమే" అంటూ తన మామూలు ధోరణిలో మాత్రలు మింగాడు ప్రజాపతి

అమ్మడు పోర్షన్‌లో జరుగుతున్న హడావిడికి, ప్రజాసేవ కంపెనీ ఆఫీసులో తలదువ్వుకుంటున్న ఉబయానందం తలపై బల్లి పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు

లక్నో లాల్చీ వేసుకోకుండా, వల బనీనుతోనే కళ్ళు మసగ్గావున్నా కళ్ళజోడు లేకుండానే, జులపాల జుట్టులో వ్రేలాడుతున్న దువ్వెన పిలకలా వున్నా, పట్టించుకోకుండా మూడు అంగల్లో సూర్యనారాయణ గారి పోర్షన్‌లోకి దూరాడు ఉభయం

బాబయ్య రాక పసిగట్టిన సౌభాగ్యం గభాల్న ప్రజాపతి కాళ్ళపై పడింది తానేదో పెద్దవాడని ఆ పిల్ల తన పాదాలపై పడిందని ఆయన స్వచ్ఛమైన తెలుగులో దీవించాడు

ఆ సంఘటన చూడగానే ఉభయానికి కళ్ళజోడు గుర్తుకు వచ్చింది

# సుభాషితాలు

యా స్వసద్మని పద్మేఽ
సంధ్యావధి విరాజితే!
ఇందిరా మందిరే న్యేషాం
కథం తిష్ఠతి సా చిరమ్!!




లక్ష్మి తన పుట్టినిల్లగు పద్మంలోనె సాయంత్రం వరకే యుంటుంది అట్టి లక్ష్మి ఇతరుల యిండ్లలో చిరకాల మెట్లుండగలదు"

(లక్ష్మి స్థిరంగా ఎక్కువ కాల మొక చోట యుండదని భావం)

సంపత్సు మహతాం చిత్తం
భవేదుత్పల కోమలమ్!
ఆపత్సు చ మహాశైల –
శిలా సంఘాత కర్కశమ్!!




గొప్పవారి యొక్క మనస్సు సంపదలు కలిగినప్పుడు కలువ పువ్వు కంటే కోమలంగా యుంటుంది ఆపదలు సంభవించినప్పుడు పెద్ద కొండ యందలి రాతి గుండె వలె మిక్కలి కఠినంగా యుంటుంది

(గొప్పవారు సంపద వచ్చినప్పుడు గర్వపడి కఠిన హృదయులు గారు అట్లే కష్టమొచ్చినప్పుడు బెంగపడి పోయి బేల హృదయులు గారు.కష్టసుఖ ప్రభావాలకు లొంగిపోరని భావం)

ఆయుర్వేద శిరోమణి రాజ రాజేశ్వర శర్మ

# జిగిబిగి

ఆనందంతో పుక్కిలిబిక్కిలై తమరా నమస్కారం అదేకవ్వడానిక ప్రత్యేకంగా కట్టించిన ఈ గది బహు ఇరుకు అందుకే సాష్టాంగ నమస్కారం చేయలేకపోతున్నాను అన్యదా భావించకండ చేతులు జోడించాడు వినయంగా

"నమస్కారం ఉభయం నువ్వీ జన్మలో చేసిన మంచి పని యిదేనేమో బంగారంలాంటి అమ్మాయిని చేరదీశావు మా అబ్బాయికి ఈడూ జోడూను చిలకాగోరింకల్లా వున్నారు అన్నాడు ప్రజాపతి

తథాస్తు' అని పలికింది సూర్యనారాయణగారి కంఠం

"రండి మా ఇంట్లోకి వెళ్దాం రండి నిన్ననే తమరీ వూరికి వచ్చినట్లు రాత్రి పది గంటలకి తెలిసింది (సౌభాగ్యం చెప్పింది) అబ్బాయి రూంలో జరిగినదంతా తెలిసింది సంతోషం అయినా యిదేం చోద్యమే సౌభాగ్యం బాబయ్యగారిని మనింటి సోఫాతో మర్యాద చేసి తాతయ్యని పిలుచుకు రావాలిగాని యిక్కడికి తీసుకువచ్చావేం? యిదీ మన యిల్లే అనుకో – మందలిస్తున్న ఉభయం కళ్ళల్లో అనుమానం

అద్భుతమైన వాళ్ళు రావడం వల్ల మనిల్లు మైలపడి వుంటుందని. తాతయ్య గడప తొక్కించి, ఆశీస్సులు అందుకుని మనింటికి వద్దామనుకుంటున్నాను' అంటూ అల్లి బుల్లి కథని అతికేట్లు అల్లసాగింది సౌభాగ్యం

నిన్న రూంలో కథలకి బెదిరిపోయాను యిప్పుడు హడలిపోతున్నాను యింతకీ ఈ అమ్మాయి నీకేమవుతుంది ఉభయం అంటూ యధాలాపంగా సౌభాగ్యం వంక చూస్తూ ఆటంబాంబే అంటించాడు ప్రజాపతి

వూపిరి బిగపెట్టేశారు అమ్మడు అండ్ ఫ్రెండ్స్ రోడ్ను మీదికి పరిగెత్తడానికి దగ్గర మార్గాలు చూసుకుంటున్నారు

ఉభయం ఒక్క క్షణం ఆలోచించి 'ఈ అమ్మాయి తమకి కూతురు. నాకు కోడలు" తన తెలివితేటలు ఎండబెట్టాడు

శభాష్ నాకు తగ్గ కూతుర'ని సౌభాగ్యం వీపు చరిచి వొళ్ళు కదిలేలా ఫెళ ఫెళమని నవ్వాడు ప్రజాపతి

ఆయన ఆనందంలో తానూ పాలుపంచుకున్నారు సూర్యనారాయణ గారు. అమ్మడి మావగారు సౌభాగ్యానికి బాబయ్య కావడం సబబేనని సమర్థించుకుంటూ

విద్యుత్ సరఫరా లేకపోవడం వల్ల ఆగిపోయిన యంత్రాలు కరంట్ రాగానే వర్క్ చేసినట్లు నేను మొక్కుకున్నాను గుడికి వెళ్ళాలి తాతయ్యా వెళ్దాం పద" అంటూ పొడి పొడిగా జనాంతికంగా అంది అమ్మడు. తాతయ్యని వీలైనంత త్వరగా ఈ సీన్ నుంచి తప్పించాలని ఆమె తాపత్రయం ఆయన వుంటే నాటకం రసాభాసమవుతుందని భయం చేతిలో పైసా లేని సూర్యనారాయణ గారు మనుమరాలి పెళ్ళి వ్యవహారం ఎలా ప్రారంభించాలో పాలుబోక ఆలోచిస్తున్నారు

"శుభం త్వరగా వెళ్ళి రండి అన్నాడు ఉభయం, వాళ్ళని వీలైనంత దూరంలో వుంచాలనే దురుద్దేశ్యంతో

పెద్దవారు ఆయన లేకపోతే ఎలా? పెళ్ళి వ్యవహారాలు మనిద్దరికీ కొత్త అంటూ నసిగాడు ప్రజాపతి

ఈ ఇంటికి పెద్ద దిక్కు ఆయనే అనుకోండి పెళ్ళి వ్యవహారాలు నేర్చుకోవాలనే అభిలాష నాకు చిన్నప్పటి నుంచి వుంది. ఆ కోరిక నేడు తీరుతున్నది శుభమాని తాతగారూ, అమ్మడు గుడికి బయలుదేరారు. మనం ఆపడం అపచారం యిక వెళ్ళండమ్మా" అంటూ అమ్మడిని తొందర చేశారు.

ఉభయం మంచి వ్యవహర్త. మనుమరాలు పెళ్ళి సెటిల్ చేస్తున్నాడని ఆపోహపడి సూర్యనారాయణగారు అమ్మడి మాట కాదనలేక గుడికి బయలు దేరారు

(ఇంకా ఉంది)

# చదువుకో...చదువు కొనుక్కో!

సుధ కళ్యాణి


















**'మే'** నెల చివరి వారంలో ఓ రోజు ఉదయం ఁదిగంటల సమయం

వెచ్చగా వీస్తున్న గాడ్పుతో పాటుగా ఎండ ఁపుల్ని పేల్చి పారేస్తోంది ఆ ఎండలో నెత్తి మీద ోపీ గానీ, గొడుగు కానీ, లేకుండా వేడినీ, గాలినీ, రిస్తూ, అవుట్‌డోర్ డ్యూటీ చేస్తున్నాడు ఁబాకరం




సెక్యూరిటీ గేటుకు కాసింత దూరంలో వున్న 'తూనిక యంత్రం' దగ్గర 'లారీ' మీద పనికిరాని ఇనుప ముక్కల్ని లోడ్ చేయించుతూ, లారీ బరువును, తూకం వేయించడం కోసం చూస్తున్నాడు కంట్రాక్టరు ప్రబాకరంతో పాటే అక్కడ చెకింగ్ కోసం వచ్చిన సెక్యూరిటీ గార్డు లారీకి దగ్గర్లోనే నించుని ఇనుప ముక్కలు తప్పించి, మరే ఇతర వస్తువూ లారీ ఎక్కియ్యకుండా జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నాడు

లారి మీద లోడ్ వేస్తున్న కూలీల శరీరాలపై మొలల మీద తప్ప, మరే బాగంలోనూ, ఏ ఆచ్చాదనా లేదు వాళ్ళ నల్లటి శరీరాలు చెమటలెక్కి చెమట బిందువులు మిల మిలా మెరుస్తున్నాయి రాటుదేలి, మొరటుదేవి, వున్న వాళ్ళ శరీరాలు ఆ ఎండల్ని లెఖ్ఖ చేయనేలేదు

అర్ధగంట గడిచింది

లారి మూడొంతులు లోడ్ అయిపోయింది

ప్రబాకరంకు అంత ఎండలో అలా నించుని, లారీని లోడ్ అవుతున్న ఇనుప ముక్కల్నీ 'వాచ్' చేయడం అలవాటు లేదు అయినా తప్పదు

వారానికో పర్యాయం వంతు ప్రకారంగా అక్కౌంట్సు నుంచి ఎవరో ఒకరు ప్రతినిది రావాలి అది రూలు

ఆ రోజు ప్రభాకరానిది వంతు

మెయిన్ గేటు దగ్గరున్న సెక్యూరిటీ గార్డులు ఒకరిద్దరు అక్కడే వున్న ఓ 'షెల్టరు'లో చేరి కబుర్లాడుకుంటున్నారు గేటు దగ్గర ఒకే ఒక్క గార్డు డ్యూటీ చేస్తున్నాడు

లారీ డ్రైవరూ, కంట్రాక్టరూ, సెక్యూరిటీ గార్డూ కబుర్లలోకి దిగేరు

ప్రబాకరం మాత్రం అక్కడే వున్న టైమ్ కేబిన్ నీడలో నించున్నాడు అతని శరీరం కూడ అప్పటికే చమటలు పోసేసి, వేసుకున్న టెరీకాట్ షర్టు తడిచి ముద్దయి పోయింది

గొడుగు లేదు, నెత్తి మీద టోపీ లేదు

ఎండకు బయపడుతూ నీడలోకి చేరేదు కూలీలు సీరియస్‌గా తమ పనిని తాము చేసుకుంటూ పోతున్నారు అప్పుడప్పుడు ఒక్క అరనిముషమో, నిముషమో ఆగి ఊపిరి పీల్చుకుని, మళ్ళా, ఆ వెంటనే పనిలోకి మునిగి పోతున్నారు

అలా ఆ ఎండలో శరీరం కుమ్ముకుని, చమటలు కార్చుకుంటూ లోడ్ చేసినా, వాళ్ళకు ఆ కంట్రాక్టరు యిచ్చేది రోజుకు, మనిషికీ, ఆర్రూపాయలే ఆ దినబత్యంతో ముద్ద దిగని బ్రతుకు వాళ్ళది

పనికి రాని ఆ ఇనుప ముక్కల్ని తీసుకెళ్ళి, ఊచలుగా ప్లేటులుగా, తయారు చేసి తిరిగి అమ్ముకునే ఆ కంట్రాక్టరు సంపాదించే దానిలో నిజానికి నూటికి రెండో వంతో, మూడో వంతో కూలి రూపంగానైనా ఆ కూలివాళ్ళకు లబించదు

ప్రభాకరం ఆ అతిపెద్ద సంస్థలో గుమాస్తాగా చేరి అప్పటికి సంవత్సరం లోపే అయింది

ఉద్యోగం క్రొత్త. వాతావరణమూ క్రొత్తే!

పదకొండు గంటలయిందన్నట్లుగా కంపెనీ అంతా ప్రతిధ్వనిస్తూ, 'సైరన్' మ్రోగిందొక్కమారుగా .

# వేరు పురుగులు



ఎం. ఉమామహేశ్వర రావు

లారీ లోడ్ యింకా పూర్తిగా లేదప్పటికి కూలీలు విరామం లేకుండా పని చేస్తూనే ఉన్నారు

దాదాపుగా ఏడనిమిది టన్నుల సరుకు పట్టే 'లారీ' అది ఏడెనిమిది టన్నుల ఇనుప ముక్కల్ని లారీలో వేయాలంటే ఆ శ్రమ, శ్రమియించే ఆ కూలి జనాలకే తప్ప మరెవ్వరికీ బోధ పడదు

ఎండ వేడి రాన్రానూ హెచ్చవడంతో ప్రభాకరానికి దాహంతో గొంతు పిడచగట్టుకు పోయింది దగ్గర్లో మంచి నీరు దొరకదు తిన్నగా సెక్యూరిటీ ఆఫీసుకు పోయి అక్కడున్న కొళాయి విప్పి త్రాగాలి

మరో గత్యంతరం లేకపోయింది ప్రభాకరానికి కాస్సేపు ఆలోచించి అక్కడే ఉన్న సెక్యూరిటీ గార్డును పిలిచాడు అతను వినయంగా వచ్చేడు

'మంచినీళ్ళు త్రాగి వస్తానండీ!! ఈలోగా చూస్తూండండి' అన్నాడు అభ్యర్ధన పూర్వకంగా

'అలాగే సర్! మీరెళ్ళి నీళ్ళు త్రాగి రండి మరో పావు గంటలో లారీ ఎలాగూ లోడ్ అయిపోతుంది గదా! నేను చూస్తుంటాను ఫర్వాలేదు వినయంగా పలికేడు సెక్యూరిటీగార్డు

అతనిపై ఎంతో నమ్మకం కలిగింది ప్రభాకరానికి తనో అయిదు నిముషాల పాటు అక్కడ లేకున్నా డేగల వంటి గార్డుల దృష్టి నుంచి తప్పుకుని ఏ వస్తువూ లారీ ఎక్కదు ' అనుకున్నాడు ప్రభాకరం

అనుకున్నదే తడవుగా నెమ్మదిగా అక్కడి నుంచి సెక్యూరిటీ ఆఫీసులో వున్న మంచినీళ్ళ కొళాయి వేపు కదిలేడు

ఇదే సమయం కోసం ఎదురు చూస్తున్నాడు కంట్రాక్టరు చాల సేపట్నుంచి

అతని ముఖంలో సంతోషం తొంగి చూసింది కళ్ళు ఆనందంతో మెరిసేయి మనస్సు ఉప్పొంగింది గబగబా నడుచుకుంటూ సెక్యూరిటీగార్డున్న చోటికి వచ్చేడు కంట్రాక్టరు దగ్గర్నే లారీ డ్రైవరు కూడా నించున్నాడు

ఆ ముగ్గురి మధ్యా ఓ నిర్ణయం అప్పటికప్పుడే జరిగిపోయింది.

కంట్రాక్టరు జేబులోంచి బరువుగా పైకి వచ్చిన కవరు మరు నిముషంలో సెక్యూరిటీ గార్డు ఫేంటు జేబులోకి దూరిపోయింది మరో రెండు నిముషాల్లో అక్కడెక్కడో దాచిన ఇరవై కేజీలకు పైగా బరువున్న ఓ రాగి తీగె చుట్ట డ్రైవరు సీటు క్రింద గల చెక్క పెట్టెలో దూరిపోయింది నిశ్శబ్దంగా..

కాని ఇదంతా ఓ జతకళ్ళు దూరం నుంచి జాగ్రత్తగా గమనిస్తున్నాయన్న విషయం ఆ ముగ్గురిలో ఎవరికీ తెలీదు

ఇదంతా తెలీని ఆ కూలివాళ్ళు తమ పనిని తాము చేసుకుంటూ పోతున్నారు

మంచినీళ్ళు త్రాగి, నెమ్మదిగా లారీని సమీపించేడు ప్రభాకరం గార్డు కేసి ప్రశ్నార్ధకంగా చూసేడు ' అతను అడ్డంగా తల వూపేడు దానర్ధం ఏదీ విరుద్ధంగా లోడ్ చేయబడలేదూ అని

ప్రభాకరం తల వూపేడు జవాబుగా

లారీ లోడ్ పూర్తయింది కూలి జనం చేతుల్ని దులుపుకుంటూ లారీ దిగిపోయేరు గేటులోంచి లారీని పంపించేందు కవసరమైన 'గేటు పాస్' కోసం వెళ్ళేడు కంట్రాక్టరు

లారీ బరువును నికరంగా లెఖ్ఖగట్టి, 'డిస్పోజల్' పుస్తకంలో సంతకం చేసేడు ప్రభాకరం

అప్పటికి సరిగా పదకొండున్నర అయింది సమయం లారీ నెమ్మదిగా కదిలి సెక్యూరిటీ గేటు సమీపించి ఆగింది గేటు పాస్‌తో వచ్చిన కంట్రాక్టరు కళ్ళతోనే అతన్ని క్రిందికి దిగవద్దని సంజ్ఞ చేయడంతో చిరునవ్వు ముఖంతో తల వూపేడు డ్రైవరు

ఒక్క నిముషం,

ఒక్క నిముషం చాలు దొరను దొంగ గానూ దొంగను దొరగానూ నిరూపించడానికి

ఒక్క నిముషంలోనే ప్రపంచాన్ని తలక్రిందులు చేయగల మనుష్య జాతికి కేవలం ఆ లారీని బయటకు పంపించడం పెద్ద సమస్యకాదు

ఏ ఒక్క నిముషమైన జరగవలసిన అన్ని కార్యక్రమాలు సవ్యంగా జరిగిపోతే ఆపద తొలగిపోతుంది

లేకపోతే?! . తలకు ముళ్ళకంప చుట్టుకుపోతుంది

ఇందాకటి సెక్యూరిటీగార్డు, పైకి గంభీరంగా నటిస్తూ, గబగబా వచ్చి, లారీ కేబిన్‌లోకి, బాడీలో వున్న ఇనుప ముక్కల వేపూ చూసి, రైట్ రైట్ ఓకే! అంటూ గ్రీన్ సిగ్నల్ ఇస్తూ, గట్టిగా విజిలు వూదేడు

లారీ ముందుకు కదలడానికి ఇంజన్ స్టార్ట్ చేసేడు డ్రైవరు

కాని అదే సమయంలో, డ్రైవరు భుజం మీద బలమైన చెయ్యి పడింది త్రుళ్ళిపడి చూసేడు డ్రైవరు ఎదురుగా సెక్యూరిటీ ఆఫీసరు పద్మనాభం నించున్నాడు జేవురించిన ముఖంతో

అతని కళ్ళ వెంట నిప్పులు కురుస్తున్నాయి అతని ప్రక్కనే వినయంగా నించున్నాడు ప్రభాకరం

దిగు! పద్మనాభం గొంతు కర్కసంగా ఉరిమింది భయపడుతూ క్రిందికి దిగేడు డ్రైవరు మరుక్షణంలోనే అతని సీటు క్రిందనున్న చెక్క పెట్టెలో దాచిన 'రాగి వైరు' బయటకు తీసేడు పద్మనాభం

కంట్రాక్టరు ఆ చుట్టుప్రక్కల నుంచి మాయమయ్యాడు డ్రైవర్ని అరెస్టు చేసి సెక్యూరిటీ ఆఫీసులోని తన కేబిన్ వేపు తీసుకెళ్ళాడు సెక్యూరిటీ ఆఫీసరు పద్మనాభం

* * * *

చాల థాంక్స్ ప్రభాకరం గారూ!!

మీరు చేసిన సహాయానికి కృతజ్ఞతలు మరి సెక్యూరిటీ గార్డ్సు, కంట్రాక్టర్లూ, ఏకమై, ఈ 'చర్య'కు పాల్పడినట్టుగా డ్రైవరు స్టేట్‌మెంట్ ఇచ్చేడు దాదాపుగా అయిదారు వందల రూపాయల విలువగల ఈ రాగి వైరు దొంగిలించి లారీలో వేసి పట్టుకుని పోతున్న వీళ్ళపై వెంటనే యాక్షన్ తీసుకోబోతున్నాం మీరీ డ్రైవరు స్టేట్‌మెంట్‌పై సాక్షి సంతకం చేయండి!!

అంటూ డ్రైవరు యిచ్చిన వాంగ్మూలం వ్రాయబడిన కాగితంపై సంతకం కోసం ప్రభాకరం ముందుకు త్రోసేడు సెక్యూరిటీ ఆఫీసరు పద్మనాభం

అందులో విషయం అంతా పూర్తిగా చదివి, నిట్టూర్చుతూ అన్నాడు ప్రభాకరం

'సార్!! మీరీ డ్రైవర్నీ, సెక్యూరిటీ గార్డునూ, కంట్రాక్టర్నూ, ఏం చేస్తారు??'

పద్మనాభం చిన్నగా నవ్వేడు ప్రభాకరం ప్రశ్నకు

ఎవరన్నా సరే దొంగతనం చేసిన వాళ్ళను ఏం చేస్తారు?!

కఠిన శిక్ష విధిస్తారు డ్రైవర్ని అరెస్టు చేసి రోజంతా పోలీస్ కస్టడీలో వుంచి రేపుదయం తతిమ్మా చర్య తీసుకుంటాం

మా సెక్యూరిటీ గార్డ్సును వెంటనే సస్పెండ్ చేస్తాం అనక ఆ కంట్రాక్టరు మిగతా లోడ్ ఆపేస్తాం ఇక మీరు వెళ్ళిరండి!!

సాలోచనగా అన్నాడు సెక్యూరిటీ ఆఫీసరు పద్మనాభం ప్రభాకరం మాట్లాడ లేదింక

అన్నం పెట్టే సంస్థను దోచుకుంటున్న దొంగల్ని పట్టి ఒప్పు చెప్పేనన్న తృప్తితో బయటకు కదిలేడు ప్రభాకరం

* * * *

ఓ నాల్రోజులు గడిచిపోయేయి ఆ రోజు పట్టుబడిన దొంగల విషయమై ఏం జరిగిందో?

# వేరు పురుగులు

వాళ్ళకు శిక్షలు అమలు జరిపిందీ లేనిదీ తెల్సుకుందామని తిన్నగా సెక్యూరిటీ ఆఫీసరు పద్మనాభం 'కేబిన్' లోనికి అడుగులు వేసేడు ప్రభాకరం

ఏవేవో పేపర్ల మీద సీరియస్‌గా సంతకాలు చేస్తున్నాడు పద్మనాభం

ప్రభాకరాన్ని చూసి కూర్చోమన్నాడు కూర్చున్నాడు ప్రభాకరం

'ఆ రోజు కేసు ఏం చేసార్సార్?? . ఉత్సుకతను జోడిస్తూ, ప్రశ్నించాడు ప్రభాకరం

ఏ కేసు??

తెల్లబోయాడు పద్మనాభం ఇదేదో క్రొత్త విషయం అన్నట్టుగా వుంది అతని వాలకం

అదేనండీ ఖరీదైన ఆ రాగి వైరును లారీలో వేసుకుని తీసుకుపోతుంటే అడ్డి, ఆ వైరును కనుక్కుని కేసు రాసేం గదా! . ఆ కేసు సంగతి!

మెల్లగా అన్నాడు ప్రభాకరం

ఆ కేసును వెంటనే కొట్టిపారేసాం లారీని విడుదలచేసి పంపేసేం కూడా!"

పద్మనాభం జవాబుకు మతిపోయిందిప్రభాకరానికి

అదేటి ,సార్!! ఆ లారీలో డ్రైవరు సీటు క్రింద దాచిన రాగి వైరు చుట్ట దొరకడం అదిదొంగతనంగా తీసుకుపోతున్నట్టు డ్రైవరుఒప్పుకోవడం, అందులో మన సెక్యూరిటీగార్డు సహాయం కూడా ఉన్నదని, అందుకతను 'లంచం' కూడా పుచ్చుకున్నాడని తెలి, కేసు తయారు చేయడం నేను సాక్ష్యం సంతకం చేయడం,అదంతా .

ఇంకా ఏదో అంటున్న ప్రభాకరాన్ని ఆపేసేడు సెక్యూరిటీ ఆఫీసరు

'చూడండి ప్రభాకరంగారూ!! అసలు ఆ రోజు మనకు దొరికింది రాగి వైరు పైనుండే రబ్బరు గొట్టం ముక్కలండీ అందులో రాగివైరు లేందే!!'

అదీగాక లోడ్ అవుతున్న లారీని అలా వదిలేసి మీరు ఏమాత్రం బాధ్యత లేకుండా ఎక్కడికో వెళ్ళిపోయేరు అవునా?!

ఆ సమయంలో లారీలో వేయకూడని వస్తువుల్ని వేసేసారు ఆ కూలి వెధవలు వాళ్ళంతా దొంగ వెధవలండీ!! ఆ లారీని అప్పుడే కామ్‌గా బయటకు పంపెయ్యకపోతే, మీ ఉద్యోగానికే ప్రమాదం ఏర్పడుతుంది . ఆ!

తృళ్ళిపడ్డాడు ప్రభాకరం అతనంటున్న మాటలు నమ్మలేనట్టుగాముఖం పెట్టేడు

'అవునండీ!! అసలు మీరు ఆ లారీని ఒదిలేసి వెళ్తే ఎలా? డ్యూటీయా? లేక మరొక్కటా?? .ఆ మాత్రం సంస్థ బాగు కోసం శ్రమించకపోతే ఎలా?? . ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా, ఆ కూలి వెధవలున్నారే దొంగ వెధవలు మన కళ్ళు కప్పి సామాను పట్టుకుపోతారు మీ వంటి యువకులు యిలా తెలిసీ తెలీక ఉద్యోగాలు పోగొట్టుకోవడం నాకు బాధనిపించింది అందుకే కామ్‌గా ఆ లారీలో వున్న దొంగ వస్తువుల్ని పారేయించి, రాగి వైరనుకుని పట్టుకున్న రబ్బరు గొట్టం ముక్కల్ని దూరంగా పారేసి, లారీని పంపేసేను

చూసేరా? మీకు ఎంత ప్రమాదం తప్పిందో??ప్చ్! ప్చ్!! . ఆ పని చేయకపోతే అన్యాయంగా మీ ఉద్యోగం పోయి వుండేది ఇకనైనా మీరు జాగ్రత్తగా మీ డ్యూటీని చేసుకుంటూ 'యితర వ్యవహారాల్లో తల దూర్చకుండా' వుండండి లేకుంటే నష్టపోయేది మీరే!! '

ఆఖరు మాటల్ని నొక్కి పలికేడు పద్మనాభం

అంతా విన్న ప్రభాకరం నోటమ్మట మాట రాలేదు

నందిని పందిగానూ, పందిని నందిగానూ మార్చేసే శక్తిగల ఆ మనుషుల్ని చూస్తుంటే నిలువెల్లా అసహ్యం కలిగింది కన్నతల్లి కంటే మిన్నగా ప్రతీనెలా వేలకు వేల రూపాయలు చేతికందించే సంస్థను నిలువునా దోపిడీ చేసి దోచుకుంటున్న వీళ్ళు, వేరుపురుగులు, చీడపురుగులు '

నిశ్శబ్దంగా గొణుక్కుంటూ అక్కడి నుంచి లేచేడు ప్రభాకరం

కేబిన్‌లోంచి బయటకు వస్తున్న ప్రభాకరాన్ని చూసి కిసుక్కున నవ్వేడు అక్కడే వున్న ఆ నాటి సెక్యూరిటీగార్డు

అతని వేపోసారి తీక్షణంగా చూసి చరచరా కదిలేడు ప్రభాకరం

'వెర్రి వీనుగ!

మా సెక్యూరిటీ మీదనే రిపోర్టు చేస్తావా? నేను లంచం పుచ్చుకుని రాగి వైరును లారీలో పెట్టించానని సాక్ష్యం యిస్తావా?ఇప్పుడేవయింది? మేం ఎవరనుకున్నావ్?? ఈ సంస్థను మరే యితర దొంగలూ దోచుకోకుండగా చూస్తున్న పెద్దమనుషులం అవకాశం రావాలే గాని మేం మాత్రం చూస్తూ వదలం మా జేబులు నింపందే ఏ దొంగా పోలేదు గొట్టంగాడివి పిచ్చి, పిచ్చిగా ప్రవర్తిస్తే, రోజూ , ఆఫీసాదిలేక యీగేటుమ్మటే బయటకు వెళ్ళే నీ చేతిలోనే ఓ రాగి వైరు ముక్క పెట్టేసి, నువ్వే దొంగతనంగా పట్టుకు పోతున్నావని నిన్ను పట్టుకుని నీ ఉద్యోగం పీకించి వేస్తాం!ముప్పుతిప్పలు పెట్టి మూడు చెఱువుల నీళ్ళు త్రాగిస్తాం!! . . జాగ్రత్త!'

అంటున్న ఆ సెక్యూరిటీగార్డు మాటలు నెమ్మదిగా వినిపిస్తుంటే ఏమీ అనలేక తల వొంచుకుని వెళ్ళిపోయాడు పాపం ప్రభాకరం!! □

## సంవత్సరంలో జూలై నెల అత్యంత అదృష్టమైన నెల ఎందుకైంది?




యూనిట్స్ ప్రత్యేకమైన ధరకు, కేవలం రూ. 12.75 లకే లభిస్తున్నాయి!

# UNITS

జూలై నెలంతా యూనిట్స్ ప్రత్యేకమైన తక్కువ ధరకు లభిస్తాయి. సంవత్సరమంతటికీ ఈ నెలలో కారు చౌక ధరకు లభిస్తాయి

యూనిట్స్ మీకందించే లాభాలేవిటో చూడండి!

ప్రతి సంవత్సరం యూనిట్స్‌పై లాభాలు పెరుగుతూ వస్తున్నాయి. ఈ సంవత్సరానికి దాని రేటు పూరించే రూ. 14.25%. అంతే కాకుండా యూనిట్స్ మీకు ఇతర సదుపాయాలు కూడా సమకూరుస్తున్నాయి. ఉదాహరణకు మీ అవసరాలకు అతిసునాయాసంగా సమయానికి డబ్బు తీసుకోగలగటం, పన్నులపై ప్రత్యేకమైన కన్సెషన్ లాభాలు, మీ పెట్టుబడికి ఖచ్చితమైన భద్రత వుంది

యూనిట్స్ పొందడం చాలా తేలిక. మీరు చేయవలసిందల్లా మా కార్యాలయాలకుగానీ, ప్రముఖ బ్యాంకులకుగానీ, ముఖ్య తంతి తపాలా ఆఫీసులకు గానీ వెళ్ళడం లేదా మా ముఖ్య ప్రతినిధులను, ఏజెంట్లను అడగండి వారే మీకు వివరాలు చెబుతారు.

జ్ఞాపకం వుంచుకోండి! ఇప్పటికి 15 లక్షల మందికి పైగా తమ డబ్బును యూనిట్స్‌కు పెట్టుబడి పెట్టారు. ఇప్పుడు పెట్టుబడి పెట్టాల్సిన వంతు మీదే!




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

హెచ్ ఓ బొంబాయి-20

(ఎ పబ్లిక్ సెక్టర్ ఫైనాన్సియల్ ఇన్సిట్యూషన్)

ప్రాంతీయ కార్యాలయం

"రెజీనా మ్యాన్షన్" 46 సెకెండ్‌లేన్ బీచ్, మద్రాసు-600 001

టెలిఫోన్ నంబరు 27433/24146

ఆంధ్రప్రదేశ్ కార్యాలయం 27-11-6B, మేరీ స్ట్రీట్

గవర్నర్‌పేట, విజయవాడ-520002 టెలిఫోన్ నంబరు 63964

**మీ మిగులు ధనాన్ని - యూనిట్ యూనిట్‌గా పెరగనివ్వండి!**

అంధ్రప్రదేశ్‌లోని ముఖ్య ప్రతినిధులు

శ్రీ కె. బి. తిలక్, గుంటూరు, ఫోన్ 23439 (ఆ) శ్రీ వై. సోమసుందరరావు, తణుకు, ఫోన్. 106 (ఆ)

శ్రీ సి. నారాయణస్వామి, 15-5-4, క్రిష్ణనగర్, వైజాగ్. శ్రీ యస్. వీరరాఘవులు, గుంతకల్లు, ఫోన్: 579 (ఆ).

శ్రీ ఎ ఆర్. కృష్ణారెడ్డి, కడప, ఫోన్ 2766 పి పి (ఆ) శ్రీ కె. వి. కోటి వీరయ్య, తిరుపతి, ఫోన్ 3004 (ఆ)

Sista's - UTI.327 85 TE A

# క్రీడావనిలో మృత్యుహేల!

క్రీడలలో అభిమానుల మధ్య తరచూ వివాదాలు పడం, ఘర్షణపడటం మామూలే! అయితే దవలు ముదిరి అమానుషంగా ప్రవర్తించి భత్సాన్ని సృష్టించిన సందర్భాలు కూడా ఎన్నో న్నాయి ఇలాంటివి పాశ్చాత్య దేశాలలో మరీ క్కువ! కొన్ని నెలల క్రితం మెక్సికో ఒలంపిక్ ్టేడియమ్‌లో అభిమానుల మధ్య పెద్ద వివాదం లరేగి ఎనిమిది మంది ప్రాణాలను కోల్పోయారు మూభై మందికి పయిగా గాయాలవాత పడినారు పలం కొన్ని వారాల క్రితం లివర్‌పూల్‌కి చెందిన ఎస్సెల్‌స హేసెల్ స్టేడియమ్‌లో యూరోపియన్ కప్ సాకర్ చాంపియన్ షిప్" కోసం రుగుతున్న ఫుట్‌బాల్ పోటీలో బ్రిటిష్ అభిమానుల మధ్యా, ఇటాలియన్ అభిమానుల మధ్యా చెలరేగిన వివాదం విలయానికి దారి తీసింది. అనూహ్యమైన హత్యాకాండకు మూలమయింది క్రీడారంగం మరుభూమిగా రూపొందింది ఎక్కడ చూచినా హాహాకారాలు! ఏ మూల చూచినా నెత్తుటి చారలు!! యావత్ప్రపంచమూ దిగ్భ్రాంతి చెందేలా దారుణ మారణ నరమేధం జరిగింది! రక్త తర్పణంతో రణహోమం దాహం తీర్చుకొంది! 38 మంది విగత జీవులు కాగా కొన్ని వందల మంది వికలాంగులైనారు! ఈ నిర్భాగ్యులకి ఆర్థిక సహాయం చేయటం కోసం బ్రిటిష్ ప్రభుత్వం 317500 డాలర్ల నిధిని సమకూర్చినా ఆ దేశానికి వచ్చిన మచ్చ మాసిపోతుందా? జరగకూడని అకృత్యం జరిగిపోయింది ఈ అకృత్యానికి బలైపోయిన వారికి, వారి కుటుంబాలకి ఏమిస్తే మాత్రం సంతోషం కలుగుతుంది? యావజ్జీవం మానసిక సంఘర్షణ తప్ప!

సాకర్ చాంపియన్ షిప్ కోసం జరుగుతున్న పోటీలో బ్రిటిష్ అభిమానులకి, ఇటలీ అభిమానులకి కొద్ది కొద్దిగా ఘర్షణ మొదలై వాగ్యుద్ధం ప్రారంభం అయింది ఈ పోటీని ప్రపంచ వ్యాప్తంగా సుమారు 40 కోట్లమంది టీవీల ద్వారా చూస్తున్నారు కూడా! 58 వేల మంది ప్రేక్షకులు స్టేడియమ్‌లో ఉన్నారు దురదృష్టకరమైన ఆ సంఘటనకు ముహూర్తం సమీపించింది మాటా మాట పెరగడంతో పెట్రేగిపోయిన లివర్‌పూల్ అభిమానులు జూవెంటస్ అభిమానుల మీదికి దండెత్తారు! స్టేడియమ్‌లో జూవెంటస్ అభిమానుల మధ్యా, లివర్‌పూల్ అభిమానుల మధ్యా ఇనుప తీగెల కంచె కూడా ఉంది బ్రిటిష్ అభిమానులు కొందరు తప్ప తాగి ఉన్నారు కూడా! సంఖ్యాపరంగా ఇటాలియన్ అభిమానులకంటే బ్రిటిష్ వాళ్లదే పైచేయి! బ్రిటిష్ అభిమానులు ఇనుపకడ్డీలని తీసుకొని ఇటాలియన్ అభిమానుల మీదికి రావడంతో కలవరం బయలు దేరింది జనంలో కలకలం పుట్టింది కొందరు ఇటాలియన్‌లు బ్రిటిష్ అభిమానుల కాళ్లమీద పడి వేడుకొన్నా వారు కనికరించ లేదు. శివమెత్తిన అంబోతుల్లాగా ఎవరినిపడితే వారిని ఎక్కడపడితే అక్కడ కొట్టడం మొదలు పెట్టారు పిల్లలు, ముసలివారు, ఆడవారూ దిక్కు తెలియకుండా ఎటుపడితే అటు పరిగెత్తడం ప్రారంభించారు ఈ గందరగోళంలో స్టేడియంలోని ఒక భాగం గోడ కూలిపోయింది ఇనుప చువ్వలు కొందరి

స్టేడియం గోడ కూలగానే భయవిహ్వలులైన అభిమానులు పారిపోయే ప్రయత్నంలో జరిగిన తొక్కిసలాట.






మద్రాసు తెలుగు (సంగీత, నాటక, నృత్య సాహిత్య ఐక్య) అకాడమీ వారి ఆధ్వర్యంలో మదరాసులోని స్వామి శంకర్ దాస్ ఆడిటోరియంలో కుమారి సుధాచంద్రన్ (మయూరి) అభినందన సత్కారం నాట్య ప్రదర్శన జరిగినప్పటి దృశ్యం శ్రీయుతులు ఎస్ పి బాలసుబ్రమణ్యం, కోనేరు కృష్ణ, కోనేరు లక్ష్మయ్య, రామోజీరావు (ఈనాడు), టి వి కె శాస్త్రి, ముఖ్యఅతిథి డా అక్కినేని నాగేశ్వరరావు, కుమారి సుధాచంద్రన్, డా పద్మా సుబ్రమణ్యం, శ్రీమతి చిత్రా విశ్వేశ్వరన్, శ్రీమతి శారద, శ్రీమతి ఎస్ జానకిలను చిత్రంలో చూడవచ్చు

# సినిమా

## త్వరలో విడుదలయ్యే "ఇల్లాలికో పరీక్ష"

ద్విపాత్రధారి మోహన్‌బాబు తల్లిగానూ, ఇల్లాలిగానూ శారద అద్వితీయంగా నటించారు ఇటీవలే సిల్క్ స్మిత డాన్స్‌ను పిక్చరైజ్ చేయడంతో మొత్తం.షూటింగ్ ఫినిష్ అయింది డబ్బింగ్ కూడా పూర్తి చేశాం" అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె వెంకట్రామరాజు సమర్పించే ఎ ఆర్ ఆర్ పిక్చర్స్ 'ఇల్లాలికో పరీక్ష చిత్రంలోని పాటలు ఇటీవల పాత్రికేయులకోసం ప్రదర్శించారు వేటూరి గీతాలకు రాజ్‌కోటి మళ్ళీ మళ్ళీ వినాలనిపించే మధురమైన బాణీలు కూర్చారు గణేష్ పాత్రో సంభాషణలు, విపిన్ దాస్ చాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, బి నాగేశ్వరరావు సహకార దర్శకత్వం, నాయని మహేశ్వరరావు కూర్పు, సూరి ప్రొడక్షన్, కె వెంకట్రాముడు నిర్వహణ, గూనా నాగేంద్ర ప్రసాద్ సహ దర్శకత్వంతో కె ధ్రువకుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ కె వెంకట్రామరాజు సమర్పకులు

## బాలకృష్ణ చిత్రాలు

- నందమూరి రమేష్ దర్శకత్వంలో కంటిపూడి సత్యనారాయణ సమర్పించే వనితా ఆర్ట్స్ తొలి చిత్రానికి చక్రవర్తి సంగీతం, నందమూరి మోహన్‌కృష్ణ చాయ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో ఎస్. భాస్కర్, సి హెచ్ సత్య నారాయణ నిర్మాతలు
- జంధ్యాల రచన, దర్శకత్వంలో కె నరసింహం నాయుడు సమర్పించే యువచిత్ర వారి 5 వ చిత్రానికి కె వి మహదేవన్ సంగీతం, నందమూరి మోహన్‌కృష్ణ ఛాయ, రాజు సాహసాలు, తార నృత్యాలతో కె మురారి నిర్మాత,
- ఎ కె వి ప్రసాద్ నిర్మించే విశ్వశాంతి ఎంటర్‌ప్రైసెస్ తొలి చిత్రానికి కై మురళీ మోహన్‌రావు దర్శకుడు
- బి సారంగన్ సమర్పణలో వి శ్రీనివాస్ ప్రసాద్, వి శ్రీనివాసరెడ్డి నిర్మించే జయలక్ష్మి మూవీ క్రియేషన్స్ సంకెళ్ళు చిత్రానికి వి విద్యాసాగరరెడ్డి దర్శకుడు
- ఎస్ ఎ చంద్రశేఖర్ దర్శకత్వంలో భీమవరపు బుచ్చిరెడ్డి నిర్మించే జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ చిత్రంలో బాలకృష్ణ సరసన రాధ నాయిక భీశెట్టి కథకుడు చక్రవర్తి సంగీత దర్శకుడు □

నరేష్, మనో చిత్ర, "మావారి గోల" లో



"హీరోయిన్" లో రాధిక






### ఎస్. వి. ఆర్. గుడివాడ

★ ఒహో అదా రహస్యం ఆంధ్రుల ఆత్మ గౌరవాన్ని తెలుగింటి ఆడపడుచుల మాన మర్యాదలు కాపాడుతున్న జ్యోతిలక్ష్మి, జయమాలిని, సిల్క్ స్మిత, అనూరాధల అంద దండలు చూసుకునా మీరు మాపైధ్వజమెత్తేది?

● కాదు అలాంటి వారిని చూసే మీలాంటి వారి బలహీనతలని చూసుకుని!

★ విడాకుల చట్టం తెచ్చుకున్నారు కదా? మరి మళ్ళీ రిజర్వేషన్‌లు తీసుకోడానికి సిగ్గేయడం లేదూ?

● బోడి గుండుకీ మోకాలికీ ముడేయడం అంటారు దాన్నే వ్యక్తిగతమైన విడాకులకీ ఆర్థికమైన రిజర్వేషన్లు తీసుకోడానికీ- పొంతన ఏమిటి? మీకు ఆవేశమే కాని బుర్ర పని చేయదా?

★ గాంధీ ఉద్యమాలలో నడిచేప్పుడు అంతా మామూలుగా నడుస్తుంటే గాంధీ. మాత్రం తలవంచుకుని తప్పు చేస్తున్నట్టు నడుస్తారేం?

● వేగంగా నడవడానికి తలవంచుకుని నడుస్తాడు- గాంధీ స్పీడు తోటి వారు అందుకోలేక పోయేవారట అయినా- తలవంచుకోవడం- తప్పు చేయడం వల్ల అన్న తప్పుడు ఆలోచనకి స్వస్తి చెప్పండి

### కె. ఆర్. ఆర్. వెంకటపాలెం

★ మీ దినదినగండం మద్రాసు ప్రసరణ అయినంత మాత్రాన ఒరిస్సాలో వారు, వినలేరను కోవడం పొరపాటు

● నా అవిజ్ఞాన ప్రతిభని క్షమించు సోదరా- మాకు మద్రాసులోనే తెలుగు కార్యక్రమం గోలల మధ్య వస్తుంది విజయవాడది- తుఫానుల మధ్య వస్తుంది. అక్కడి వారు క్షుణ్ణంగా విన్నారంటే- నమ్మడం ఎలా?!

### కె. ఎస్. ఎస్. ఆర్. తాళ్ళూరు

★ వ్యక్తిత్వం అంటే ఏమిటి?

● మీకు మీరు యిచ్చుకునే విలువ

### బి. ఆర్. ఆర్. నిడదవోలు

★ నేటి సినిమాలు చూసి ప్రజలు నేర్చు కుంటున్నది?

● హింసించడం ఎలా? గాంగ్ రేప సరదాగా ఎలా చేయడం? అమ్మాయిల నెలా బూతుకాని బూతులతో ఆట పట్టించడం- ఒక టేమిటి షూల్లో నేర్పనివీ, తల్లి తండ్రుల వలన సంక్రమించనివీ- అన్నీ నేర్చు కుంటున్నారు అంతే కాదు దొంగతనా లెంత సులభంగా చేయవచ్చు హత్య ఎంత చాకచక్యంగా చేయవచ్చు డబ్బు లెలా గుంజవచ్చు మొదలైన వ్యాపార రహస్యాలు నేర్చుకుంటున్నారని- తెలుస్తోంది

### ఎన్. ఎల్. కె ఎస్. విశాఖ

★ శీలం పోతే స్త్రీ ఉరేసుకోవాలి! మళ్ళీ అలా జరక్కుండా చూసుకోవాలి; ఏం అక్కర లేదు మగవాడికి లేని నీతి ఆడదానికెందుకు?

● మగాడు గడ్డి కరిస్తే ఆడదీ కరవాలని లేదు అంచేత మగాడికి లేని నీతి- ఆడదానికి ఉండక్కర లేదని రూలు లేదు ఇక శీలం పోగొట్టు కోవడం అన్నది- ప్రమాదం దొంగ దొరికితే - నేరారోపణ జరగాలి. అంతేగాని ఉరి వేసుకు చావనక్కర లేదు 'శీలం దోచుకున్న వాడే నా భర్త' అంటూ అలాటి వాడినే పెళ్ళాడాలని పట్టు పట్ట నక్కర లేదు- సినిమాల్లోలాగ!

### ఎమ్. ఎస్. ఆర్. కాశీబుగ్గ

★ మీ ప్రశ్నావళి శీర్షిక ఆసక్తిదాయకంగానూ ఉత్సాహపూరితంగానూ వుంటుంది

● సంతోషం మీకు తేళ్ళూ జెర్రెలూ పాకినట్టు వున్నా - చదువుతే నాకూ సంతోషమే -

### కె. వి. ఆర్ మైలవరం

★ ఆకాశం పైకి ఒకే సమయంలో ఒక యినుపకడ్డీ ఒక కర్ర ముక్క విసిరితే వాటిలో ఏది ముందు భూమికి చేరుతుంది?

● ఇంత చిన్న ప్రయోగం- చేసి చూడ కూడదా?! (తల కాస్త పక్కకి పెట్టి మరీ చెయ్యండి)

### జె. ఎస్. కె. శ్రీకాకుళం

★ ఈ మధ్య నేనో అమ్మాయిని ప్రేమించాను ఆమెతో 'మిమ్మల్ని ప్రేమించాను ఐ లవ్‌యు, ఐ లైక్‌యు, అన్నాను చిరునవ్వు నవ్వి నాకు చెప్పకుండా పెళ్ళి చేసుకుంది ఛీ మీ ఆడ జాతిని నమ్మరాదని నిర్ణయించు కున్నాను

● మంచి పని చేశావయ్యా! తమరలా అనేసరికి 'మీ పాదాల చెంత రవంత చోటివ్వండని' అమ్మాయి గారు . పడిపోలేదనా మీ ఉడుకుబోతనం?! ఆడాళ్ళకీ అప్పుడప్పుడు బుర్ర పని చేస్తూంటుందని ఆ అమ్మాయి - చెప్పక చెప్పింది!

### బి. వి. నల్లగొండ

★ నేటి సినిమాలపై మీ అభిప్రాయం? ఈ సినిమాల ప్రభావం యువతరంపై ఎక్కువగా వుండడానికి కారణం?

● 'ఏ'ఇచ్చి బాధ్యత తీర్చుకుంటున్నారు ప్రభుత్వం; డబ్బే చూసుకునే వాళ్ళు- పబ్లిసిటీ సర్వ అసభ్యంగా చేసి జనాన్ని రాబడుతున్నారు ఇక హీరోలని విలన్ననీ ఒకేలా అనుకరించే యువకులు వారి చేష్టలు నిజ జీవితంలో అమలు చేస్తున్నారు అదే గొప్ప హీరోయిజమ్ అనుకుని నిజంగా విలువలు గుర్తించిన యువత- యీ సినిమాలూ యీ పబ్లిసిటీ కూడా సహించదని పిస్తుంది నాకు

### డి. ఎల్. డి. చోడవరం

★ కోతి నుండి పుట్టాడు మానవుడు ఆధారం ఏంటి?

● ఏం లేదు-అప్పుడప్పుడు బయట పడే. అతగాని బుద్ధులే - ఆధారం!

★ పతివ్రత అంటే?

● ఏం కాదు! ఆడవాళ్ళకి ఉన్న పర్యాయ పదాల్లో □

మీ ఆవిడ అప్పడాల కర్ర మొహం మీదికి విసురుతుంటే తగలదులే అని ఎలా అనుకున్నావ్?



సీరియల్

# మనసు మెలిసింది

కళ్యాణీ సోమరాజ్

(గత సంచిక తరువాయి)

కాలేజి వదిలిపెట్టడానికింకా వ్యవధి వుంది రమ చెట్టు నీడలో కారు పార్క్ చేసి తనతో తెచ్చుకున్న 'అన్నాకెరినా' తీసి చదువుకుంటోంది

సుమతిని కాలేజికి పంపటానికి బలవంతాన ఒప్పించాల్సి వచ్చింది సీతను అంతటితో సుమతి విషయం ఇంట్లో ఎవ్వరికి తెలియకుండా మరుగునపడింది

రమకి రోజు సుమతిని కాలేజిలో దింపి, తీసుకురావటం అనే కొత్త డ్యూటి పడింది అయితే దానివలన మూలపడ్డ కారుకి, ఏమీ తోచని రమకి మంచి కాలక్షేపమే!

కాలేజి బస్ హారన్ వింటూ పుస్తకంలోంచి తల ఎత్తి చూసింది దూరంగా సుమతి మరొక యువకునితో మాట్లాడుతూ వస్తోంది బహుశ అతనే సుమతి చెప్పిన 'రమేష్'అనుకుంది రమ మనిషి చాలా పొడగరి సన్నగా చామన ఛాయలో వున్నాడు వెర్రి మొర్రి పాషన్స్ లేకపోయినా మొహం కళగా వుండటం వలన ఆకర్షణీయంగానే వున్నాడు

'పిన్నీ! ఇతనే రమేష్! ఎమ్ బి ఎ చేస్తున్నారు హైదరాబాద్‌లో'

రండి మీతో రెండు నిముషాలు మాట్లాడాలి ఇలా కార్లో కూర్చోండి' అంటూ రమ చొరవగా అతన్ని ఆహ్వానించింది

అతను మొహమాటపడుతూనే ముందు సీట్లో కూర్చున్నాడు సుమతి వెనుక డోర్ తెరచి పుస్తకాలు పడేసి అలాగే నిలబడింది పిన్ని మాట్లాడే విషయం ఏమై యుంటుందా, అని నిశ్శబ్దంగా ఆలోచిస్తోంది

మీకు మా సుమతి ఎలా పరిచయం

మా చెల్లెలు, సుమతి ఒకే క్లాసు సుమతి అప్పుడప్పుడు మా ఇంటికొచ్చేది మేము ముగ్గురం చాలాసేపు కూర్చుని కబుర్లు చెప్పుకొనేవాళ్ళం అప్పుడప్పుడు, క్యారెమ్స్, టేబుల్ టెన్నిస్ ఆడేవాళ్ళం ఆమె రూపం, మాట తీరు, నడవడి నాకెంతో నచ్చాయి నాలో ఆమెకేం నచ్చాయో తెలియదు కాని సుమతి కూడ నన్ను ప్రేమిస్తోందని గ్రహించాను కులాలు వేరని తను చొరవ చూపించడం లేదని కూడ నాకు తెలిసింది అయితే క్రమ క్రమంగా ఆమె అంతట ఆమె నాతో ఫ్రీగా మాట్లాడేది పెళ్ళి గురించిన ప్రసక్తి మా మధ్య ఎప్పుడూ రాకపోయినా, ఇద్దరి మనస్సుల్లోనూ నిగూఢంగా వుంది అదే!

ఎం బి ఎ తరువాత ఏం చేయాలని మీ సంకల్పం

మా బాబాయిలంతా మంచి పలుకుబడి వున్నవాళ్ళే! చదువు పూర్తైతే ఏదో మంచి ఉద్యోగం తప్పకుండా దొరుకుతుంది

ఒక వేళ ఉద్యోగం మంచిది దొరక్కపోతే'

మా నాన్నగారికి నేనొక్కడినే! ఆయన బిజినెస్ చూసుకుంటాను'

మీ పేరెంట్స్ ఎక్కడుంటారు?

మా పేరెంట్స్ విజయవాడలో వుంటారు ఇక్కడ మా బామ్మ, తాతయ్య వ్యవసాయం చూస్తు వున్నారు చెల్లి ఇక్కడే చదువుకుంటోంది

మరి మీ వాళ్ళకేం అభ్యంతరం లేదా! మీలో కట్నాలు అవీ చాలా ఇస్తారని విన్నాను మీరు కట్నం తీసుకోరని సుమతి చెప్పింది

"అవునండి ప్రేమించి పెళ్ళి చేసుకునేటప్పుడు కూడ కట్నం తీసుకుంటే ఇంక ఆ ప్రేమకు విలువేముంది మీరన్నట్లు మా వాళ్ళలో లక్షలు ఇస్తామని వస్తూనే వున్నారు బహుశ ఈ విషయంలో మా వాళ్ళను ఎదిరించక తప్పదేమో! అయినా సుమతి కోసం నేను ఏదైనా చేయటానికి సిద్ధమే నేను వచ్చి మీ పెద్ద వాళ్ళను అడుగుతానని చెప్పాను సుమతి బయపడుతోంది

'అలాటి పని చేయకండి మా వాళ్ళకిలాటివిష్టం వుండవు మీరు వచ్చి అడిగారంటే నానా రభస అవుతుంది

పోనీ మీలాటి పెద్దలు ప్రోత్సాహం వున్న చాలు కదండీ, సుమతి నేను ఒకటి కావటానికి

రమ నవ్వింది మీరు పొరబడుతున్నారు నాలాటి ఒక్కతి ఇలాటి వాటికి ప్రోత్సాహం చూపించినందువలన ఏం లాభం వుండదు నేను మీతో పాటే చెడ్డదాన్ని అవుతాను అంతే!

ఇంతకీ మీ సలహా ఏమిటి?'

'ప్రస్తుతానికి మీరిద్దరూ కలుసుకోవటం తగ్గించండి ఇంట్లో అప్పుడే మీ విషయం తెలిసింది సుమతిని చదువు మాన్పించే పరిస్థితుల్లో నేనే నచ్చ చెప్పి తీసుకొస్తున్నాను సుమతి చదువు పూర్తి కావటం ముఖ్యం ఆడపిల్లకైనా మొగ పిల్లవాడికైనా చదువు చాలా అవసరం, తన కాళ్ళ మీద తాను నిలబడగల శక్తే కాదు స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకునే నేర్పుని ప్రసాదిస్తుంది విద్య! అంతవరకు మీరు ఓపిగ్గా ఎదురు చూడండి ఈలోగా మీరు ఉద్యోగస్థులైతే ఆర్థిక స్వాతంత్ర్యం కూడ ఉంటుంది విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!'

* * * * *

లతకు పురుడు వచ్చే రోజులు నీకు వీలైతే కొన్ని రోజులు వుండడానికి రా! నాకు కాస్త సహాయంగా వుంటావు' అంటూ తల్లి వ్రాసిన ఉత్తరాన్ని చూసుకొని మద్రాస్ ప్రయాణం పెట్టుకుంది రమ అప్పుడే పుట్టింటికి వెళ్ళి ఆరు నెలలు దాటింది ఇన్ని రోజులు తన వాళ్ళను వదిలేసి ఉండగలిగిందంటే, అదంతా పెళ్ళి మహత్యం కదా అనుకుంది రమ ఆమె మనసు అప్పుడే రెక్కలు చాచుకొని తన

జరిగిన కథ–3: కట్నం ప్రసక్తి లేకుండా మూర్తి, రమ రిజిస్టర్ మేరెజి చేసుకుంటారు రమని వెంట పెట్టుకొని వచ్చిన మూర్తిని తల్లితండ్రి తూలనాడినా పెద్దన్న, వదిన సీత ఆదరిస్తారు. రమని చూడడానికి వచ్చిన మూర్తి పెద్దక్కయ్య, చిన్నక్కయ్య రమని ఈటెలలాంటి మాటలతో బాదిస్తారు మర్నాడు మూర్తి చేత, రమ చేత సత్యనారాయణ వ్రతం చెయించి ఆ పీటల మీదే మూర్తి చేత రమకి 'మూడు ముళ్ళు' వెయించారు రమని తీసుకుని మూర్తి తన చిన్నన్నయ్య విశ్వనాద్ ఇంటికి విజయవాడ వెళతాడు విశ్వనాద్, యశోద వీరిని చూడగానే ఎంతో ఆనందపడిపోతారు రమ పెద్ద బావగారి కూతురు సుమతి తమ కులం కాని వ్యక్తిని ప్రేమిస్తుంది సుమతి వల్ల రమ తమ కుటుంబ ఆర్థిక పరిస్థితి తెలుసుకుంటుంది

వాళ్ళ దగ్గరకెళ్ళిపోయింది

మూర్తి మెయిల్లో ఒక బర్త్ రిజర్వ్ చేయించాడు అత్తగారు, మామగారు వెళ్ళమనలేదు వుండమనలేదు తటస్థంగా విని వూరుకున్నారు

అత్తగారు మాత్రం - రమా, ప్రసూనను చూసివెళ్ళిన పెళ్ళివారు నచ్చిందంటూ ఉత్తరం వ్రాసారు నిన్ననే! ఇచ్చిపుచ్చుకోవటాలు అన్నీ కుదిరితే త్వరలో ముహూర్తాలు కూడా పెట్టుకుంటారు పురుడు రాగానే వచ్చేయి ' అంది ఏ కళ నున్నదో గాని

అలాగే' అంది రమ, ఈవిడకు నా మీద ఇంత ప్రేమ ఎప్పటినుంచో అనుకుంటూ ! వారం రోజుల క్రితం ప్రసూనని చూడడానికి పెళ్ళివారు వచ్చారు. రెండో ఆడబడచు అత్తగారి వైపు దూరపు బంధువులట వాళ్ళు అని తోడికోడలు చెప్పగా వింది అబ్బాయి బ్యాంక్‌లో ఫీల్డ్ ఆఫీసరుట అతనితో పాటు అక్క, బావ అతని ఫ్రెండ్ వచ్చారు అప్పటికి దనం పుట్టింటికెళ్ళి వారం అయింది సీత ఇంట్లోకి రాకూడదు సుందరమ్మ కాలు చెయ్యి ఆడక రమను సహాయం కోరక తప్పలేదు రమకి ఆనాడు వాళ్ళన్న మాటలు గుర్తు వచ్చి నిరాకరించాలని అనుకున్నా అప్పుడున్న పరిస్థితుల దృష్ట్యా న్యాయంగా అన్పించక కాదనలేకపోయింది

'వదినా! నీ చీరలేమైనా ఇవ్వవా ధనం వదిన వూళ్ళో లేదు పెద్ద వదిన దగ్గర అన్నీ పాత పట్టు చీరలే వున్నాయి. అంటూ తెచ్చి పెట్టుకున్న వినయంతో అడిగింది ప్రసూన

రమ మారు మాటాడకుండా, తన బిస్కట్ రంగు పట్టు చీర, ఒంటి పేట లాకెట్ గొలుసు తీసి ఇచ్చింది

ప్రసూన అలంకరణ విషయంలో ఈసారి రమ చెప్పినట్లు తూ. చ తప్పకుండా అనుసరించింది తలలో ఒక గులాబి మాత్రమే పెట్టుకుంది. చెవులకు తన రాళ్ళ దుద్దులు తీసి రమ ఇచ్చిన బెంగాలి రింగ్స్ తగిలించింది

వంటింట్లో అవస్థపడుతున్న అత్తగార్ని లేపి హాల్లోకి పంపి, సుమతి సహాయంతో కాఫీ, టిఫిను పావు గంటలో తయారు చేసింది అయితే ఈసారి తను మాత్రం పెళ్ళివారి మధ్యకు వెళ్ళకుండా అన్ని సుమతి చేతే పంపింది

అయితే అదే ముప్పు తెస్తుందని ఆమె ఆనాడు ఊహించలేదు!!

రమ కారు ఎక్కుతుంటే సుమతి, ప్రసూన వచ్చి త్వరగా వచ్చేయి పిన్నీ అంటూ, త్వరగా వచ్చేయి వదినా! అంటూ సాగనంపారు

మద్రాస్ వెళ్ళగానే సేఫ్‌గా చేరినట్లు ఉత్తరం వ్రాయి వీలైనంత త్వరగా వచ్చేద్దూ ఒక్కడినే బోరు అన్నాడు మూర్తి

ఒక్కరే ఏం ఖర్మ అంతమంది వుండగా!

ఎంతమంది వున్నా, నీ తరువాతే అని అంటాడేమో మూర్తి అనుకుంది రమ కాని అతనలా అనలేదు

ఎంతమంది వున్న ఎవరి స్థానం వాళ్ళకే రమా! అతని హృదయంలో తనకి ఏ స్థానం వుందో ! అనుకుంటూ రమ కదులుతున్న రైల్లోంచి చెయ్యి వూపింది

స్టేషన్‌కి ప్రభాకరం వచ్చాడు రమకి మద్రాస్‌లో అడుగు పెట్టగానే ప్రాణం లేచి వచ్చినట్లైంది అలవాటైన పరిసరాలు చైతన్యం చిందులేస్తున్నట్లున్న రోడ్లు దారి పొడుగునా ప్రభాకరంతో ఏదో మాట్లాడుతూనే వుంది. 'అబ్బ ఎన్నాళ్ళయింది ఇలా నోరు విప్పి కరువు తీరా మాట్లాడి' అనుకుంది రమ

ఇంటికి రాగానే, తల్లి చేసిన టిఫిన్ తిని, షవర్ తీసుకుని అందర్నీ ఒకసారి పలకరించి, తన రూమ్‌కెళ్ళి మంచం ఎక్కింది మధ్యాహ్నం భోజనాల టైమ్‌కి లత వచ్చి నిద్ర లేపితేగాని మెలుకవ రాలేదు

"అబ్బ చాలాసేపు నిద్రపోయానా వదినా! అంటూ ఒళ్ళు విరుచుకుంటూ లేచింది

"మూర్తి ఏమిటి నిన్ను నిద్రపోనివ్వటం లేదనుకుంటా'

'ఛీ. పో వదిన ప్రయాణం బడలిక అంతే! పద నాన్నగారు, అమ్మ మనకోసం ఎదురు చూస్తుంటారేమో" అంటూ మొహం కడుక్కుని తిలకం దిద్దుకుని



బయటకు వచ్చింది.

డైనింగ్ టేబుల్ దగ్గర అందరికి తన వూరి విశేషాలు, ఇంట్లో వాళ్ళ మనస్తత్వాలు వర్ణించి మరీ చెప్పింది

'అబ్బ ఎన్నాళ్ళయిందమ్మా బంగాళదుంపల వేపుడు తిని అంటూ కూర మరికాస్త వేయించుకుని తింటున్న కూతుర్ని వింతగా చూసింది తల్లి

"అదేమిటే చుట్టు ప్రక్కల మంచి మంచి తోటలవి వుంటాయట కదా! తాజా కూరలు చేసుకోరా మీ ఇంట్లో!"

'ఆ ఇంట్లో వంట గురించి అడక్కమ్మా ఏవో చేలో పండిన ఆకు కూరలు, పెరట్లో కాసే ఆనపకాయల్లాంటివి తప్పించి మరో కూర చేసుకోరు."

అంత పొదపన్న మాట"

"పొదుపు ఒక్క తిండి విషయంలోనే. మిగిలిన విషయాల్లో చూపిస్తే బాగానే

# ముసురు వెలిసింది

వుండును ఆ సంసారం ' అనుకొంది మనసులో పైకి మాత్రం అనలేదు అత్తగారు వాళ్ళని మరీ చులకన చేయటం మంచిది కాదని కొంత, తనేదో కష్టాలు పడిపోతున్నాననుకొని వీళ్ళు బాధపడతారన్న ఉద్దేశ్యంతో

రమ బాగా చిక్కిపోయింది అన్నారు అంతా వింటున్న తండ్రి

"ఔను నల్లబడింది కూడాను

తన వారి మధ్య, వాళ్ళ ఆపేక్షలో రోజులు క్షణాల్లో గడిచిపోతున్నాయి రమకు తోచనితనమంటూ లేకుండా కాలం గడిచిపోసాగింది స్నేహితుల ఇళ్ళ కెళ్ళి గంటల తరబడి గడపటమో, తల్లితోను, వదినతోను చెస్, పేకాట ఆడుతూనో, తెలుగు, ఇంగ్లీషు, హిందీ సినిమాలు ఫ్రెండ్స్‌తో చూస్తూనో ఆమె కాలక్షేపం చేయసాగింది

రమ వచ్చిన పది రోజులకు లత మగపిల్లవాడిని ప్రసవించింది 'మూర్తిని కూడ బారసాలకి రమ్మనమని తండ్రి ఉత్తరం వ్రాసాడు కాని మూర్తి 'నాకు ఇప్పుడప్పుడే రావటానికి వీలుండదన్నట్టు' వ్రాసాడు ఆ ఉత్తరం చూసి తల్లి, తండ్రి నిరుత్సాహపడ్డారు రమకి చాలా కోపం వచ్చింది మూర్తి మీద 'మూర్తి కూడ రెండు రోజులుంటే అమ్మా, నాన్న ఎంత సంతోషపడతారు ఎంతసేపు ఆడపిల్లలకేనా అత్తగారి మాట, మామగారి ఆజ్ఞ పాలించేది మొగవాడు అన్ని విషయాల్లోను స్వాతంత్ర్య జీవన్న మాట' అనుకుంది రమ

లత కొడుకుకి 'పవన్' అని పేరు పెట్టారు

రమని రమ్మంటూ మూర్తి మళ్ళీ ఉత్తరం వ్రాసాడు ఈసారి ఉత్తరంలో ఆమెను ఆశ్చర్యపరచే విషయం కూడ వ్రాసాడు 'ప్రసూనకు, సుమతికి సంబంధాలు నిశ్చయమైయ్యాయి ముహూర్తాలు కూడ పెట్టుకున్నారు వచ్చే నెల పదో తారీకో అంటూ

సుమతికి పెళ్ళి నిశ్చయం అవటమేమిటి? రమ ఎంత ఆలోచించినా అర్థం కాలేదు ఎన్నిసార్లు చదివినా అంతకంటే వివరాలేవి ఉత్తరంలో లేవు 'ఇక ఆలశ్యం చేయడం మంచిదికాదనుకుంటూ రెండు రోజుల్లో బయల్దేరి తెనాలి వచ్చేసింది

"అదేమిటి రమా! ఉత్తరం వ్రాయకుండా వచ్చేవేం? వ్రాస్తే స్టేషన్‌కి వచ్చేవాడిని కదా!

'మీకు తీరుబడి వుంటుందో వుండదోనని' మూర్తి గ్రహించాడు రమకెందుకో కోపం వచ్చిందని

' అయితే నేను రాలేదని అమ్మాయిగారికి చాలా కోపం వచ్చిందన్న మాట '

చివ్వున ఒక్కసారి మూర్తి వైపు చూసింది

"కోపం వస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి?'

సారీ రమ! నువ్వింత ఫీలవుతావని నేను అనుకోలేదు అదే సమయంలో నేనో పేషెంట్‌కి ఆపరేషన్ చేసాను అతని కండిషన్ రెండు రోజులు క్రిటికల్‌గా వుంది అందుకని రాలేకపోయాను మరొకసారి ఇద్దరం కలిసి సరదాగా నాలుగు రోజులుండి వద్దాం

రమ ఆ తరువాత ఏం మాట్లాలేదు మౌనంగా టవల్ తీసుకుని బాత్ రూమ్ వైపు నడిచింది

"ఇంకా కోపం పోలేదా!' అంటూ మూర్తి షవర్ తిప్పి ఆమెను దాని కిందకు లాగి అల్లరిపెట్టాడు

"అబ్బబ్బ వుండండి బాబు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాను'

నా ప్రేమలో నా'"

'కాదు ఈ నీళ్ళతో

"కోపం పోయిందా!'

'కోపం మాట ఎలా వున్నా, ప్రాణం పోయేలా వుంది'

మూర్తి నవ్వుకుంటూ ఇవతలకు వచ్చేసాడు

"అదేమిటి సుమతి పెళ్ళి కుదిరిందని వ్రాసారు' తల పొడి టవల్‌తో తుడుచుకుంటూ అడిగింది

'ఔను ప్రసూనని చూడటానికి పెళ్ళికొడుకుతో పాటు అతని ఫ్రెండ్ కూడా వచ్చాడు కదా! అతనికి సుమతి బాగా నచ్చిందట వాళ్ళంతట వాళ్ళే కబురు చేసారు చాలా లకీ గరల్'

నా మొహం లకీ! అనవసరంగా ఆ పిల్లను వాళ్ళ ముందుకు పంపి నేనే ఆ అమ్మాయికి అన్యాయం చేసానన్న మాట స్వగతంలో అన్నట్టు పెద్దగానే అంది

ఏమిటి అంటున్నావు? రమ మాటలు అర్థం కాలేదు

'సుమతికీ పెళ్ళి ఇష్టమేనా'

ఏమో! నాకు తెలియదు బహుశ ఇష్టమే అయ్యుంటుంది అయినా చిన్నపిల్ల దానికేం తెలుసు

సుమతి మీరనుకున్నంత పసిపిల్ల ఏం కాదు' ' అంటూ సుమతి, రమేష్‌ల ప్రేమ విషయం మూర్తికి వివరంగా చెప్పింది

మీకు చేతనైతే ఈ పెళ్ళి ఆపకూడదూ' రమ అంది ఆశగా'

ఇంట్లో అందరి సంగతి బాగా అర్థం చేసుకున్నదానివి, నువ్వు కూడ ఇలా మాట్లాడతావేం మనం చేసిన పనికే వుండుండి అగ్గి రాజెల్లుతూనే వుంది మళ్ళీ మన ఆధ్వర్యంలో నే జరగాలా ఈ కులాంతర వివాహం

' మీ స్వార్థం కోసం ఆ పిల్ల అలా ఇష్టంలేని పెళ్ళికి బలికావలసిందేనా'

రమా! నువ్వలా పుస్తకంలోని డైలాగ్స్ చదవక మంచి సంబంధం అబ్బాయి జూనియర్ కాలేజీలో లెక్చరరట ఆస్తిపాస్తులున్న వాడేట సుమతి ఇప్పుడు బాధపడ్డా ముందు సుఖపడుతుంది నువ్వు కూడా అన్ని మర్చిపోయి నాలుగు అక్షింతలు వేసి ఆశీర్వదించు '

మూర్తి అనుకున్నంత తేలిగ్గా రమ అనుకోలేకపోయింది కళ్ళముందు సుమతి, రమేష్ నడచి రావటం, అతను మృదువుగా అన్ని విషయాలు తనకు వివరించటం గుర్తు వచ్చింది. పూర్ ఫెలోస్! అనుకుంది జాలిగా

ఇంటికి సున్నాలు కొట్టటం అయిపోయింది గుమ్మాలకు లక్క పెడుతున్నారు రమ తన చీర కుచ్చెళ్ళను ఎత్తి పట్టి లోపలికి అడుగుపెట్టింది ఇల్లంతా నానా గందరగోళంగా వుంది అప్పుడే పెళ్ళి కళ వచ్చేసినట్టుంది ఇంట్లో అందరూ ఏదో పనితో హడావిడిగా తిరుగుతున్నారు సుమతి మాత్రం కన్పించలేదు

మధ్యాహ్నం భోజనాలు అయ్యాక మంచి నిద్ర వస్తున్నా ఆపుకొని సీత వాళ్ళ రూమ్‌లోకి అడుగు పెట్టింది రమ

మద్రాస్ విశేషాలేమిటి? అంతా కులాసానా! సీత వర్త చొక్కాకి వున్న చినుగులు కుడుతోంది

'ఆఁ అంతా కులాసానే! మీరేమిటి ఓపిగ్గా చినుగులు చేత్తో కుడుతున్నారు దనం అక్కయ్య రూమ్‌లో మిషెన్ వుందిగా'

' ఆఁ పొన్లెద్దు అదేమైనా అయితే మళ్ళీ గొడవ '

ఆ ఒక్క మాటలో రమ చాలా గ్రహించింది ధనం తన వస్తువుల్ని ఎంత బద్రంగా దాచుకుంటుందో రమకు తెలిసిన విషయమే!

సుమతి పెళ్ళి అని వ్రాస్తే నేను నిజంగా నమ్మలేదు'

మాకే ఆశ్చర్యంగా వుంది రమా! వాళ్ళు దాన్ని ప్రసూన పెళ్ళి చూపుల్లో' చూడటమేమిటి, వెంటనే నచ్చిందంటూ కబురు చేయడం, మీ బావగారు నేను నమ్మలేదు

'మన సుమతి బంగారు బొమ్మలా వుంటుంది వాళ్ళకు నచ్చటంలో ఆశ్చర్యం ఏమిటి? పెళ్ళికొడుకు ఎలా వుంటాడు నేను సరిగ్గా చూడలేదు'

'ఆఁ బాగానే వుంటాడు అయితే కాస్త పొట్టి మన సుమతి కంటే కొంచెం నలుపు అనుకో! అయినా మొగవాడికి అందచందాలేమిటి?'

అంటే మొగవాడైతే చాలన్న మాట

'నీకు మన అమ్మాయి సంగతి తెలుసు కదా దాని విషయం నలుగురిలో వెల్లడి కాకుండా అది ఓ ఇంటిదైతే మనకు అంతే చాలు '

'ఒక్క కులం మనది కాదన్న మాటే కాని రమేష్ సుమతికి అన్నివిధాల తగినవాడు'

'రమా నువ్వు కూడా అలాగే అంటున్నావా' దానికి బుద్ధి చెప్పాల్సింది పోయి "

'ఒకసారి అతనితో మాట్లాడాను నిజంగా నాకెంతో నచ్చాడు చక్కని వినయం, అందమైన రూపు, ఆస్తిపాస్తులు అన్ని వున్నాయి

ఇక చాల్లే అవు ఎంత అప్రదిష్ట అతన్ని నాలుగు మందలించాల్సింది పోయి అతని తరఫున మాట్లాడుతున్నావా అది చేసిన దౌర్భాగ్యపు పనికి అసలే కుళ్ళి కుళ్ళి ఏడుస్తూంటే పెళ్ళి చేయమని సలహా చెబుతున్నావా' సీత కంఠంలో కోపపు జీర చూసి రమ చాలాసేపు ఏం మాట్లాడలేదు

కట్నం ఎంత?'

ప్రసన్నకి ఇరవై వేలు తీసుకుంటున్నారు వాళ్ళు వీళ్ళు మాత్రం తక్కువ తీసుకుంటారా' లాంఛనాలు అన్నీ అందులోనే అంతకంటే మేము ఇచ్చుకోలేమని చెప్పాం"

'సుమతి చేసుకుంటానందా!'

'దాని మొహం అసలు దాన్ని అడిగి చేస్తామా!

రమ మనస్సు ఎక్కడో కలుక్కుమంది రూపాయి పెట్టి వస్తువు కొనేటప్పుడు కూడ ఒకటికి రెండు సార్లు నాణ్యత విచారించి కాని, కొనం ఇరవై వేలు పెట్టి కొనుక్కొంటున్న పెళ్ళికొడుకు నచ్చింది లేంది కూడా ఆలోచించటం లేదు మగవాళ్ళు నిజంగా ఎన్ని పుణ్యాలు చేసుకుంటే ఇలాంటి దేశంలో పుడతారో! పురుషుడు పుట్టినప్పుడే అతనికో రేటు నిర్ణయిస్తారేమో వాళ్ళ తల్లిదండ్రులు డబ్బిచ్చి కొనుక్కొన్న స్త్రీ అన్ని అతనికి సమర్పించి బానిసలా అనామకంగా బతుకుతోంది ఎంత చిత్రంగా వుంది ఈ వ్యవస్థ పెళ్ళి కూతుర్ని చేసినప్పుడే దించిన తల, చచ్చేవరకు ఎత్తనివ్వరు, అత్తగార్ల దగ్గర నుంచి ఆడబడచు మరదులు వరకు భార్య ఆత్మ గౌరవం తనదిగా భావించని భర్తని అంత డబ్బెట్టి కొనుక్కొన్నందుకు సిగ్గుపడాలి ఆడది

ఏమిటి రమా! కూర్చునే నిద్రపోతున్నావా!"

లేదు అక్కయ్యా! ఇక వెళతాను కాస్సేపు పడుకుంటా! అంటూ లేచి బయటకు వచ్చేసింది

సుమతి వరండాలో ఎదురైంది రమ కంటికి ఒక ఛాయ తగ్గి, దీనంగా కన్పించింది ఆమె రూపు

'చూసావా పిన్నీ! అంతా బలవంతంగా నా మెడలు వంచి పెళ్ళికి సిద్ధం చేస్తున్నారు' అన్నట్లున్నాయి ఆమె చూపులు

కులాసానా! సుమతి!

కులాసాగా వున్నందుకు బెంగగా వుంది పిన్నీ'

అదేం మాట విధిని ఎదుర్కొనే అవకాశం లేనప్పుడు తలవంచక చేసేది ఏముంది? అంది రమ స్వాంతనగా .

సుమతి నిట్టూర్చి వెళ్ళిపోయింది

పెళ్ళి ఇంకా రెండు రోజులుండగానే చుట్టాలు ఒక్కొక్కరే దిగటం మొదలు పెట్టారు రమని చూసి 'ఈ అమ్మాయేనా మన మూర్తి ప్రేమించి పెళ్ళి చేసుకున్నది పిల్ల బాగానే వుంది అంటూ తలో విధంగా తన గురించి అనుకోవటం వింటూనే వుంది రమకే విధంగానూ పెళ్ళి పనులలో పాల్గొనే ఉషారు లేదు నిర్లిప్తంగా, నిరుత్సాహంగానే తిరుగుతోంది

ఆ రోజు కాశిపతి, విశ్వనాదం ఇద్దరు కట్నం సొమ్ము తీసుకెళ్ళి మగపెళ్ళివారికి ఇచ్చి రావటానికి బయలుదేరారు ఇంతలో యశోద వచ్చి 'సుమతి కన్పించటం లేదుట, అక్కయ్య కంగారు పడుతోంది మీ ప్రయాణం ఆపండి అంటూ కబురు తెచ్చిందీ క్షణాల మీద ఇల్లంతా గందరగోళంలా తయారైంది రమ కూడ ఆశ్చర్యపోయింది

నూతులు, గోతులు, బావులు, చెరువులు రైల్వే స్టేషన్లు తలా ఒకళ్ళు తలా దిక్కు పోయి గాలించుకొచ్చారు సీతకి సుమతి ప్రేమ కథను బయటపెట్టక తప్పలేదు ఆ సమయంలో ' అంతా విన్న మామగారు వీరభద్రావతారం దాల్చారు.



అత్తగారు ఆయనతో పాటు తాను చిందులు వేసింది 'కూతుర్ని అదుపులో పెట్టుకోవటం చేతకాని అధమస్తులుగా – ముద్రించబడ్డారు సీత, సీత భర్త రామనాథం

సీత మెల్లగా రమకు తెలుసు అన్ని విషయాలు బహుశ సుమతి పారిపోయిన విషయం కూడా తెలిసే వుంటుంది అంది వెక్కుతూ

రమ ప్రేక్షకురాలిలా చూస్తున్నదల్లా ఖంగారుపడి, నాకా' నాకేమి తెలియదు వూరి నుంచి వచ్చాక సుమతితో పట్టుమని పది నిముషాలైనా కూడా మాట్లాడలేదు

నీకీ పెళ్ళి చేయటం ఇష్టం లేదన్నట్లుగా మాట్లాడావు కదా!

అందుకని నేను సుమతిని పారిపొమ్మన్నానా!

"ఏమో! దాని మనసులో ఏ విషం నింపావో ఇప్పుడు ఏమి తెలియనట్లు ఇంత వగలుపోతున్నావు అయ్యో పైసా కట్నం తీసుకు రాకపోయినా కడుపులో పెట్టుకుని చూసుకొంటున్నందుకు ఈ ఇంటి పరువు ప్రతిష్టకే ఎసరు పెట్టావన్న మాట ' సుందరమ్మ అందుకొనేసరికి రమకి అదుపు చేయలేని కోపం వచ్చింది

ఆపండి కట్నం కట్నం అంటూ నన్ను రాచి రంపాన పెడుతూనే ఉన్నారు అభిమానించింది ఎక్కడ మీరు'

నోర్ముయ్యి, పెద్దవాళ్ళన్న గౌరవం లేకుండా మీ అత్తగార్నే ఎదిరిస్తావా' మామగారు కోపంగా ఉరిమారు

చదువుకున్నదన్న అహంకారం నాన్నగారు పెద్ద, చిన్న తారతమ్యం కూడా తెలుసా' కాశిపతి అవకాశం కోసం చూస్తున్నట్లుగా అన్నాడు అతనికి ఆ రోజు రమ తనని వ్యంగ్యంగా హేళన చేసిన దగ్గరనుంచి అక్కసుగానే వుంది

పోనీ రమా! అతనెక్కడుంటాడో చెప్పు నీ కాళ్ళ మీద పడతాను సీత అర్థించింది

మీరునమ్మినా, నమ్మకపోయినా వాళ్ళ విషయం నాకు తెలియదు అతని అడ్రసు నాకు తెలియదు' రమ ఖచ్చితంగా అనేసి తన గదికి వచ్చేసింది వెనక నుంచి కాంతం పెద్ద గొంతుకతో మొగుడి ఆస్థి ఏదో ఖర్చు అవుతుందని ఏడుపు అందుకే దాన్ని గోతులోకి దింపింది కట్నం తేకుండానే ఇంత అధికారం చలాయిస్తోంది ఇక కట్నం తీసుకు వస్తే మనల్ని అప్పుడే బయటకు గెంటేదేమో" అని హేళన చేయటం రమకి వినిపిస్తూనే వుంది

"చూసారా! వాళ్ళంతా నన్ను దోషిలా నిలబెట్టి ఎన్ని మాటలంటున్నారో!" మేడ మెట్ల దగ్గర ఎదురైన మూర్తిని చూడగానే రమకు దుఃఖం ఆగలేదు

'నేను మొదటే చెప్పాను సుమతి విషయంలో నువ్వు కలుగ చేసుకోవద్దని " అతని కంఠంలో కూడ తన మీద అనుమానం స్పష్టంగా విన్పించేసరికి రమ నిర్విణ్ణురాలై చూస్తూ నిలబడింది

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



అమెరికా సంయుక్త రాష్ట్రాలలో అత్యున్నతమైన గౌరవంగా భావించే 'మెడల్ ఆఫ్ ఆనర్' పతకాన్ని ఈసారి మదర్ థెరెసాకి బహూకరించారు. భారతదేశంలో తదితర ప్రాంతాలలో పేదలకి ఆమె చేసిన సేవలని ప్రస్తుతిస్తూ అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ ఆమెకి ఈ బహుమతిని జూన్ 20న అందజేశారు. సాధారణంగా ఈ పతకాన్ని అమెరికన్‌లకే ఇస్తారు. కానీ ఈ సందర్భంలో దానిని పాటించడం లేదని ఆయన అన్నారు. పేద ప్రజల పేరిట ఈ గౌరవాన్ని తాము అందుకుంటున్నామని, ఈ బహుమతిని పేద ప్రజలకి ఇచ్చినట్లే తాము భావిస్తున్నామని మదర్ థెరెసా అన్నారు. □

---



ఫిలిప్ జీగ్లర్ యూరోపులో పేరు గడించిన రచయిత. రాజ కుటుంబీకులు లేదా ఆ కోవకి చెందినవారి జీవిత చరిత్రలు రాయడంలో దిట్ట అనిపించుకొన్న వారు ఈయన!

నాలుగవ విలియమ్, లార్డ్ మెల్‌బోర్న్, లేడీ డయానాల మీద ఈయన రాసిన పుస్తకాలు మంచి ప్రాముఖ్యాన్నే పొందాయి. ఇటీవల లార్డ్ లూయిస్ మౌంట్‌బాటన్‌ని గురించి కూడా ఒక పుస్తకం రాశారు. అది పెద్ద సంచలనాన్ని సృష్టించింది.

మౌంట్‌బాటన్ పుస్తకంలో జీగ్లర్ శ్రీమతి మౌంట్‌బాటన్‌కీ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూకి మధ్య ఉండే సంబంధాలని వివరిస్తూ బాగానే రాయడంతో ఇటు మనదేశంలోనూ అటు యూరోపులోనూ ఆ పుస్తకంపై ఎంతోమంది దృష్టిని సారించారు. వారిద్దరి మధ్యా ఉండే వ్యవహారం పెద్ద రహస్యం కాకపోయినా ఎందుకో మరి ఈ పుస్తకం అచ్చు కావడంతో చెప్పుకోదగ్గ జాప్యమే జరిగింది. □

# వారఫలం

## 12-7-1985 శుక్రవారం మొదలు
## 18-7-1985 గురువారం వరకు

★ **మేషం** : మీరు వ్యాపారం చేసేవాలైతే, యిది శుభ ఫలదాయక వారం. బాగా వ్యాపారం అభివృద్ధి చేయాలనే మీ ఆకాంక్ష నెరవేరుతుంది. అయినా డబ్బు చేతికి రావటంలో ఎక్కడో పొరపాటున్నట్లు గమనించగలుగుతారు. స్త్రీలకు ఇదివరకటి కాలాని కన్నా సులువుగా పనులు నెరవేరుతాయి. వృత్తియందు పెంపు గమనించగలరు.

★ **వృషభం** 'గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్' అని మీకూ తెలుసు. మీ ప్రయత్నాలు ఉద్యోగ వృత్తులందు వెనుకటి మాదిరి ప్రగతి పథం పట్టకపోవటం గమనించగలరు. ప్రయాస అధికం, ఫలితం స్వల్పం. వయసు వచ్చిన సంతాన శుభకార్య నిర్వహణ నిమిత్తం శ్రమిస్తారు. స్త్రీలకు అన్నివిధాలా, అన్నిరంగాలలో అనుకూలం.

★ **మిథునం** : విద్యావిధానంలో మీకుగల ప్రజ్ఞ, చాకచక్యం రాణించగలదు. మీ ఆరోగ్యమందు అభివృద్ధి కనిపించి తీరుతుంది. మాటకు విలువ పెరగటం, తద్వారా ఏదో మేలు చేకూరటం గమనింపగలుగుతారు. అవకాశవాదులను మాత్రం దాపునకు చేర్చకండి. స్త్రీలకు రాజకీయరంగాన తెగతెంపులు కొందరకు. కుటుంబ పనులందు శ్రమ కొందరకు.

★ **కర్కాటకం** : ధర్మకార్య నిర్వహణకు అవకాశమున్నది. విదేశ ప్రయాణమునకు అనుకూలత కొందరకు. ఉద్యోగ రీత్యా చేసిన యత్నాలు ఫలించుట కొందరకు. పెద్దలతో సంపర్కం కొందరకు చెప్పదగిన అంశాలు. స్త్రీలకు చక్కటి 'రాశిఫలం' అనుభవించగలవారం. క్రమంగా ఆటంకాలు తొలగుతవి.

★ **సింహం** : అన్ని విధాలా అనుకూలమే. ఆశించిన విధాన శుభ నిర్వహణమునకు నడుము కడుతారు. కానివారు మీకు అపకారం తలపెట్టటం గమనించగలుగుతారు. పోయిన ఉద్యోగం లభ్యం కావటం గమనించగలరు. స్త్రీలకు స్వజనులతో టి తగాదాలు తల ఎత్తగలవు. సాటివారి పోటీని ఎదుర్కొనవలసి యుండును.

★ **కన్య** . స్థితియందు, ధన రాబడి యందు, ఉద్యోగమందు మీకు రాణింపు, పెంపు. చెప్పదగిన వారం. మీకు 'జాయింటుగా' ఉన్న ఆస్తిని గూర్చిన వివాదాలు చెలరేగనున్నవి. ఒకానొక వ్యవహారం చాలకాలంగా వేధిస్తున్నది గదా! అలాంటిది, ఈ వారం మీకు అనుకూలం. స్త్రీలకు గతంలో చేసిన యత్నం ఫలించి, నూతన వాహనం సంపాదించుకొగలుగుతారు. బంధు కలయిక గల సమయం, గ్రహించండి.

★ **తుల** : బాధ్యతాయుతమైన పదవి నిర్వహించే వారయితే ఎంత జాగ్రత్తగా ఉంటె అంత మేలు. అపకారం చేసే వర్గం ఒకటి ఉన్నదని గ్రహింపగలుగుతారు. జాగ్రత్తగా సంచరించాలనీ తెలిసికొంటారు. స్త్రీలకు కుటుంబానంద లోపం, వ్యర్థప్రయాణాలు, ప్రయాస.

★ **వృశ్చికం** : అధికారుల వలన జరుగవలసిన పనులకు ఆటంకాలు రానున్నవి. ఆప్యాయతతో ఆదరించే వారు దూరం కావటం గమనించగలరు. స్వార్థపరులు మీ చుట్టూ ఉన్నారని గమనించగలుగుతారు. బాగా ఓర్మితో సంచరించుట అవశ్యకమని గ్రహిస్తారు. స్త్రీలకు వృత్తియందు, ఉద్యోగమందు ఆటంకాలుంటాయి.

★ **ధనుస్సు** : వార మధ్యభాగం ధన విషయంలో, కార్యసాధనలో, అప్పులు వసూలు కావటంలో, పెద్దల పరిచయ భాగ్యం ఏర్పడుటలో అనుకూలం. ముగిసినట్లే ముగిసి కార్య విఘ్నం కావటం కూడా గమనించగలుగుతారు. స్త్రీలకు కొన్ని నెలల క్రితం ప్రారంభించిన గృహ వ్యవహారం అనుకూలంగా చక్కబడగలదు.

★ **మకరం** : ఇంతకాలం సర్వానుకూలతను చేకూర్చిన 'శని' భగవానుడు కొంత కాలం మరుగున పడగలడు. మరలా కొంత కాలం తరువాత ఆయన వలననే అన్నివిధాలా, అన్నిరంగాలలో మీకు అనుకూలత చెప్పదగిన ముఖ్యాంశం. యత్నకార్య విలంబన, మిత్రులతో మనస్తాపం. స్త్రీలకు ధనలబ్ధి, నూతనోత్సాహం.

★ **కుంభం** : సాటివారితో పోటీని ఎదుర్కొనవలసి యుండును. స్థితి యందు అంతో యింతో పెంపు చేకూరుట కూడ గమనించగలుగుతారు. అధికారుల వలన జరుగవలసిన పనులు సుకరంగా నెరవేరనున్నవి. రాజకీయంగా మీ మనోరథం సఫలమయ్యే కాలంగాదు. స్త్రీలకు ఓర్పుతో కార్యసాధన గావించాలి. ఆటంకాలు అధిగమించాలి.

★ **మీనం** . దైవబలమున్నది. రాశిఫలం అనుకూలం, వ్యాపారమందు పెంపు చెప్పదగిన అంశం. వ్యవహారం మీరు ఆశించినట్లు 'కోర్టు' ద్వారా కాక మధ్యవర్తిత్వం ద్వారా సానుకూలం కాగలదు. ఇదివరకటి కన్నా ధనాదాయంలో మెరుగు, పుణ్యకార్యాచరణమునకు అనుకూల వారం. స్త్రీలకు కుటుంబ సభ్యులతో మాటపట్టింపు రావచ్చు. ఉద్యోగ రీత్యా 'అనుకొన్నదొకటి అయినదొకటిగా' తెలిసికొంటారు కొందరకు. ప్రయాణం తప్పనిసరి కాగలదు. గ్రహించండి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## కొవ్వొత్తుల చిరువెలుగులలో... గులాబీపూల సువాసనలలో...

## మేమిద్దరమే వున్న ఏకాంతంలో!



# ఏముండాలి విందు భోజనంలో ?

ఆ విందు చాలా ప్రత్యేకంగా ఉండాలి మరి ఎందుకంటే మీరు ప్రత్యేకమైన వారికోసం వంట చేస్తున్నారు కాబట్టీ.

అప్పుడు మీకు కావలసినవి విజయ పాల ఉత్పాదనలు విజయ వెన్న, నెయ్యి, జున్ను, పాలపొడి ఏదైనా కానీ మీ వంటకు ప్రత్యేకమయిన రుచిని ఇస్తాయి.

నిముషాలలో తయారు చేసే ఫలహారం కానీ షడ్రుచుల విందుభోజనం కానీ విజయ రుచి విశిష్టం.

ఎప్పుడూ విజయ ఉత్పాదనలను మీ అందుబాటులో ఉంచుకోండి ఎందుకంటే ఎప్పుడు అవసరం వస్తుందో ఎవరికి తెలుసు ?

**ఆంధ్ర ప్రదేశ్ పాడి పరిశ్రమ సమాఖ్య**

లాలా పేట, హైదరాబాదు - 500 017







## విజయ. అది లేకుంటే విందులో స్వారస్యం ఎక్కడిదిమరి !

APDDC/37/85/Te

# మార్పు

పానుగంటి లక్ష్మీరాఘవి

చల్లని ఆ సాయం సమయంలో, అత్యంత ఆహ్లాదకరమైన ఆ వాతావరణంలో, హాయైన అనుభవాన్ని పొందుతూ కారు డ్రైవ్ చేస్తున్నాను నేను నున్నని తారురోడ్డు కారుతో పోటీపడుతూ పరుగులు పెడుతూ, వెనక్కి దూసుకు పోతోన్నట్లనిపిస్తోంది

స్పీడో మీటర్‌లో ముల్లు అరవైని చూపిస్తోంది నా మనస్సు మాత్రం ఆరేళ్ళ నాటి గతాన్ని నెమరేస్తోంది

సడన్ బ్రేక్ వేయాల్సొచ్చింది, గేదె ఒకటి అడ్డు రావడంతో అది తప్పుకొనేసరికి, ఆక్సిలేటర్ మీది నించి కాలు తప్పించి, మళ్ళీ డ్రయివ్ చేస్తూ ఆలోచనలో పడ్డాను డ్రైవింగ్‌లో ఎంత అనుభవం వున్నా, ఈ రోడ్డు మీద అదెందుకూ పనికిరాకుండా వుంది

"ఏమైందంకుల్ ఎనీ యాక్సిడెంట్? అంటూ ప్రశ్నించాడు ప్రక్కనే కూర్చొన్న విజయ్

"నువ్వూ ఆలోచనలో పడ్డావటోయ్ నాలాగే" అన్నాను జవాబేం చెప్పకుండానే, 'ఔనంకుల్ మీతో ఆర్నెల్ల స్నేవాసం కదా మరి. అన్నాడు నవ్వుతూ నేనూ నవ్వేసి, "వెరీగుడ్ కరెక్టుగా చెప్పావ్" అంటూ మెచ్చుకున్నాను.

మళ్ళీ నిశ్శబ్దంగా డ్రయివ్ చేయసాగాను నా ఏకాగ్రతకి భంగం కలిగించటం ఎందుకనుకున్నాడో ఏమో, ఏం మాట్లాడకుండా, కన్పించే దృశ్యాలను చూడటంలో నిమగ్నమైపోయాడు విజయ్

ఆ విజయ్ తండ్రి సత్యం, నేనూ మంచి స్నేహితులం ఆరేళ్ళ క్రితం వరకూ తరచూ కల్సుకొంటూండేవాళ్ళం సత్యం అప్పట్లో చిన్న చిన్న రచనలు చేస్తూండేవాడు ఆ తర్వాత నేను సైకియాట్రీలో స్పెషలైజ్ చేసేందుకు ఛాన్స్ రావడంతో, విదేశాలకి వెళ్ళిపోయాను అక్కడ్నించి అప్పుడప్పుడూ వుత్తరాలు వివరంగా రాస్తుండేవాణ్ని సత్యానికి

మొదట్లో జవాబులు వచ్చినా, రాన్రానూ తగ్గిపోయి, ఆ తర్వాత పూర్తిగా ఆగిపోయాయి. వాడి విషయాలే తెలీక పోవడంతో కొన్నాళ్ళు బాధపడ్డాను ఆ తర్వాత రొటీన్‌లో పడిపోయి, నేనూ రాయడం మానేశాను వుత్తరాలు

విదేశాల్నుండి తిరిగి వచ్చేశాక, హైదరాబాద్‌లో స్థిరపడిపోయాను ఒంటరి బ్రతుకయినా, వృత్తిరీత్యా చాలా బిజీ అయిపోవడంతో, తీరికే చిక్కేది కాదు

ఎలాగో ఇంక తీరిక చేసుకొని, ఆర్నెల్ల క్రిందట ఒక రోజు తాను కారేసుకుని ఈ వూరికి బయల్దేరి వచ్చాడు, ఎలాగైనా తన ప్రాణస్నేహితుడు సత్యాన్ని కలుసుకోవాలని వాడో పెద్ద రచయిత అయిపోయాడిప్పుడు

వో పేరున్న వీక్లీలో వాడి వివరాలు ప్రకటించటంతో, వాడ్ని కల్సుకోవాలనే ఆత్రంతో ఆ రోజు కార్లో బయలుదేరి ఈ వూరు వచ్చాను వాడి ఇల్లు ఎవరినయినా కనుక్కుంటే తెలుస్తుందేమో అని కారు ఓ పక్కగా ఆపాను

అంతే ధడాల్న ఓ రాయొచ్చి విండో గ్లాస్‌ని అటాక్ అయ్యింది ఎవరా అంటూ చుట్టూ చూడబోయేంతలో, మరొకటి వచ్చి మరో అద్దాన్ని పగులగొట్టింది

'ఎవరీ పాడు పని చేసేది' అంటూ గట్టిగా అరుస్తూ దిగాను నేను

అంతే ఓ పన్నెండేళ్ళ పిల్లాడు గబగబా వచ్చి నా మీద కలియబడ్డాడు చిత్రవిచిత్రమైన శబ్దాలు నోటితో చేస్తూ ఎడాపెడా బాదేస్తున్నాడు నన్ను

ముందు షాక్‌తోనూ, ఆ తర్వాత ఆ కుర్రాడి నేర్పుకూ నిశ్చేష్టుడిగా నిలబడిపోయాను ఎటువంటి ప్రతిస్పందనా కనపడకపోయేసరికి, కాసేపు యుద్ధం చేసి అలిసినట్లుగా నిలబడిపోయాడా అబ్బాయి

చుట్టూ అందరూ చోద్యం చూస్తూ నిలబడ్డారు.

ఇంక ఈ పిల్లాడ్ని ఈ కారుగలాయన తీసికెళ్ళి పోలీసులకి అప్పచెప్పడం ఖాయం ఇంతటితో వీడి పీడ విరగడౌతుంది" అని తలుస్తున్నారు వాళ్ళంతా

"బాబూ! కమలంపూడి సత్యంబాబు ఇల్లు ఎక్కడో నీకు తెలుసా?'

రాయి విసిరి అద్దం పగలగొట్టినా, మీద పడి మనిషిని చితగ్గొట్టినా కిమ్మనక, పైగా తననే ఫలానా ఇల్లు తెలుసునా అని అడిగేసరికి ఓ క్షణం ప్రతిమలా నిలబడిపోయాడు వాడు

ఆ తరువాత తేరుకుని "ఓ నాకు బాగా తెల్సు పద చూపిస్తా' అంటూ ముందుకు దారితీశాడు రా భాబూ! కారెక్కు ఇద్దరం కలిసే వెళదాం అట్నుంచి తిన్నగా తీసికెళ్ళి నిన్ను మీ ఇంటి దగ్గర కూడా దింపుతాలే రా ముందు అంటుంటే తెల్లబోయినట్లు చూశాడు వాడు ఫ్రంట్ డోర్ తెరిచి ఎక్కమని సైగ చేసేసరికి మౌనంగా కారెక్కాడు చుట్టూ చేరినవాళ్ళు మాటలే మర్చిపోయి నిలబడి చూస్తుండగా నా కారు కదిలింది

అతడి సూచనల ప్రకారం నడిచి, ఓ యింటి ముందాగింది కారు డోర్ తీసుకొని దిగేస్తూ ఎదురుగ్గా వున్న యిల్లు చూపించి, తూనీగలా ఎటో పారిపోయాడు వాడు

దిగి ఆ యిల్లు సమీపించాను అనాడు తలుపు తట్టాలా వద్దా ఇంతకూ ఆ కుర్రాడు నిజమే చెప్పాడా లేక తుంటరిగా ఇలా ఎవరిల్లో చూపించి, తప్పించుకు పారిపోయాడా అని సందిగ్ధంలో పడ్డాన.

అంతలో ఆ ఇంటి తలుపులు తెరుచుకొంది వాడే సత్యమే లోపల్నుంచి బయటికి రాబోతూ, నన్ను చూసి ఆగాడు ఆశ్చర్యంతో తలమునకలవుతున్న వాడిలాగా, అరెరే ఏమిటిది కలా నిజమా! నువ్వు నువ్వేనా రామం ' అంటూ వచ్చి నన్ను వాటేసుకున్నాడు అభిమానంగా

మాకది అలవాటే క్షణం ఆగి నేను మెల్లగా విడిపించుకొంటూ, ఇది మీ ఇల్లే అన్న మాట అన్నాను ఔనౌను మర్చేపోయాను గానీ, ముందు లోపలికిరా' అంటూ లాక్కుపోబోయాడు వాడ్ని వారిస్తూ, 'ఉండు ముందు కారు లాక్ చేసి రానీ" అంటుంటే అటు చూసి, "కారు నీదేనా సరే లాక్ చేసి రా అరే అద్దాలు పగిలిపోయాయేంటి?' అన్నాడు ఆశ్చర్యంగా

'అవును ఈ వూరొచ్చాకే పగిలాయి' అని నేననగానే, 'అయితే నీకు కన్నా కలిశాడన్న మాట వాడి పనే అయ్యుంటుంది ఇది " అన్నాడు,

"ఆ అబ్బాయి పేరు కన్నా అన్నమాట నేనడగటం మర్చిపోయాను " అన్నాను నేను "ఇంకా నయం . పేరూ గీరూ అడగటమా అక్కడే నాలుగు తన్ని పారేయాల్సింది వాడ్ని." అన్నాడు సత్యం కోపంగా

నాకు నవ్వొచ్చింది ఎన్ని పాడు పన్లు చేసినా, కన్నబిడ్డ కన్నబిడ్డే కదా ఆ అభిమానం వాడ్ని కన్నవాళ్ళకుంటుంది మనకి అకతాయిగా కన్పడ్డాడని కొడితే, వాళ్ళూరుకొంటారా చెప్పు " అన్నాను "వాడ్ని కన్న ఆ దురదృష్టవంతులం మేమేరా సర్లే అదంతా తర్వాతగానీ, ముందు లోపలికిరా అంటూ

ముందుకు దారితీశాడు సత్యం

ఆశ్చర్యం నుంచి తేరుకోకుండానే, వాడ్ననుసరించాల్సొచ్చింది

లోపల కూర్చున్నాం కల్యాణి లోపల్నించి వచ్చి నమస్కరించింది 'ఊ ఏమిటమ్మా సంగతులు .. చాలా కాలమైంది మనం కలిసి ఎలా వున్నారు మీరంతా? పిల్లలు బావున్నారా ' అంటుంటే మధ్యలో సత్యం కల్పించుకొంటూ, "నీ ప్రశ్నలన్నింటికీ తర్వాత తీరుబాటుగా జవాబు చెబుతుంది లేరా, అంటూ కల్యాణి వైపు తిరిగి ముందు మా వాడికి కాసిన్ని మంచినీళ్ళూ, ఆ తర్వాత కాఫీ ఫలహారాదులూ యిస్తే బావుంటుంది గదా లేకపోతే ఖబుర్లతోనే కడుపు నింపేద్దామా అన్నాడు ఆవిడతో.

"భలేవారే అదేం మాట! ఇప్పుడే తెస్తానుండండి అంటూ లోపలికెళ్ళిందామె 'డ్రస్ ఛేంజ్ చేసుకొస్తానుండరా అంటూ వాడూ లోపలికెళ్ళాడు ఒంటరిగా మిగిలిపోయిన నేను, ఏం తోచక ఆ రూమ్‌ని పరికిస్తూ తిరగసాగాను

అలమారులో ఏదో వ్రాత ప్రతిలా కనిపించింది కొత్తగా నవలేదన్నా మొదలుపెట్టాడు కాబోలు అనుకొంటూనే పరికించాను పైనున్న పేజీని ఏదో నవల కోసం ప్లాటు వూహిస్తూ, పాయింట్ బై పాయింట్ ఆర్డర్‌లో రాసుకొన్నట్టున్నాడు అందులో ఇలా వుంది

"స్నేహితుల వలయం మధ్యగా అలంకృతయై నిలిచి, వేదిక మీదికి రాబోతూన్న విజిత, ప్రఖ్యాత ఎస్ పి కూతురు ఆకస్మికంగా అదృశ్యం కావటం కలకలం పెళ్ళాగిపోయింది పరువు పారిపోయింది "ఎస్ పి ఆవేదన బాస్! నీ కూతురు క్షేమంగా వుంది అతి జాగ్రత్తగా మళ్ళీ నిన్ను చేరాలంటే, మా దారికి అడ్డు రాకూడదు జాగ్రత్త' స్మగ్లర్ల ముఠా నుండి ఎస్ పి కి అందిన లేఖా సారాంశం

"రేపు నీ జీవితంలోనే అతి పెద్ద మార్పు రాబోతోంది ఆ తర్వాత ఇంక జగన్‌కి వచ్చిన బెదిరింపు సందేశం

ఎక్కడా ఎప్పుడూ.. ఎవ్వరూ ఇవ్వలేనంత అద్భుతమైన పార్టీని అరేంజి చేసిన ప్రఖ్యాత నటుడు ఇంట విందారగించిన అందరూ, పూర్తి కాకముందే పక్షుల్లా నేల కొరిగిన వైనం '

'ఎవ్వరు దీనికి కారకులు.. ఏమిటి దీని కారణం అని ఆలోచించి తన అఖండమైన తెలివితేటలతో డిటిక్టివ్ విధుర్ సాధించే అద్భుతమైన పరిశోధనే అందరూ అందరే నవల ఫైటింగ్, సస్పెన్స్, రొమాంటిక్ థ్రిల్లర్

"ఎస్ పి కూతురు విజిత, ప్రఖ్యాత .డిటిక్టివ్ విధుర్‌ల కమనీయ కల్యాణంతో నవల సుఖాంతం

ఆ కాగితం మళ్ళీ అక్కడే పెట్టేస్తూండగా, వచ్చాడు సత్యం

"ఆ చూశావన్న మాట అదే నేను రాయబోయే నవల ఇంకా ఈ రోజే ప్లాట్ దొరికింది అందుకే పాయింట్స్ నోట్ చేసుకొని వుంచాను రాత్రికి మొదలెడదామను కొంటున్నాను అన్నాడు టిఫిన్ ప్లేట్ నా కందిస్తూ

"అలాగా ఎన్నాళ్ళు పడుతుంది పూర్తయ్యేసరికి?' అన్నాను

"ఆ ఏముంది పట్టుమని పదిరోజులు కూడా పట్టదు మొదలెడితే, ఇంక తపస్సులా అందులో మునిగి పోవడమే పూర్తయ్యేంత వరకూ తిండి కూడా సయించదు నాకు అన్నాడు

ఇంతకీ నీ వివరాలూ, విశేషాలూ చెప్పనేలేదు నాకు అన్నాడు మళ్ళీ వాడే క్లుప్తంగా వివరించాను అన్నీ విని సంతోషించాడు నీ పట్టుదలా, తెలివితేటలూ నాకు తెల్సుగా అయితే ఇప్పుడెలా వుంది నీ ప్రాక్టీస్ అన్నాడు చెప్పాను

టిఫిన్ అనే కార్యక్రమం పూర్తయ్యింది

మూడు గ్లాసులతో కాఫీ తీసుకొనివచ్చి, తనూ కూర్చొంది కల్యాణి

కొద్దిసేపు లోకాభి రామాయణం మా చర్చలో చోటు చేసుకొంది

ఒరే సత్యం నువ్వేమీ అనుకోనంటే నాదొక సందేహం అడగాలనుందిరా అనీ నేననడంతో, "నీకు సందేహాలా పైగా నేను తీర్చడమా? బలేవాడివే ఏమన్నా జోక్ చేస్తున్నానా ఏం? అన్నాడు నవ్వుతూ

'నువ్వు నవ్వే నీ నవ్వు వెనక, పెద్ద విషాదం ఏదో నాకు కన్పడుతోందిరా! లక్షణంగా మా చెల్లిల్ని పెళ్ళాడేవ ముద్దు ముద్దుగా ఇద్దరే పిల్లలు అది కూడా ఓ పాపా, ఓ బాబూ కదా! ఆఫీస్‌లో పన్చేస్తున్నందుకు జీతం వస్తోంది పైగా రచనలతో పైన సంపాదనా, పైగా పేరు ప్రతిష్ఠలూ బాగానే వచ్చాయ్ నీకు ఇంక నువ్వు చింతించడానికి తగ్గ కారణం ఏమిటా అని తల పగలగొట్టుకొంటున్నా నిందాకట్నించీ అనాను నేను 'ఏం చెప్పమంటారన్నగారూ మా బాధ చెప్పినా అర్థం కాలేనిది దానికి కారణం ఏమిటో కూడా తెలీడం లేదు మాకు ' అంది కల్యాణి

నువ్వుండు కల్యాణీ నేను చెప్తాను అంటూ అందుకొన్నాడు సత్యం

మా అబ్బాయి విజయ్‌ని మేం ముద్దుగా కన్నా అని పిలుస్తాం! పిల్చినంత ముద్దుగానూ వాడి



ముచ్చట్లు తీరుస్తాం. వాడు అడిగినవన్నీ కొనిస్తాం, వాడి క్కావల్సినవి తినిపిస్తాం. వాడు కోరిన సినిమాలు చూపిస్తాం. వాడికి ఏ లోటూ రాకుండా చూసుకొంటూ వుంటాం. అయినా సరే వాడెలా తయారయ్యాడో చూడు. ఇంట్లో చెప్పిన మాట వినడు. అసలు చదవనే చదవడు. స్కూలికి ఇష్టం వుంటే పోతాడు. లేకుంటే లేదు. ఊళ్లో అందరితో గొడవలే. వాడు యుద్ధం చెయ్యని మనిషి లేడు. పోట్లాడని పిల్లలు లేరు. అందరితోటీ కలబడి పోతాడు. నీకూ అనుభవం అయ్యిందిగా." ఆగాడు. తను చెప్పాల్సిందీ చాలా వుందన్నట్లు మధ్యలో కల్పించుకొంటూ, "వాడు ఇంటికొస్తాడంటే భయం. వాడు కొట్టే చావు దెబ్బలకి భయపడి మా అమ్మాయి ఆ లోపలి గదిలోనే ఏడుస్తోంది. కొట్టినా, తిట్టినా మారడు. తెల్సిన వాళ్ళు గనుక, మా పరిస్థితిని అర్థం చేసుకొని ఊళ్ళో వాళ్ళు ఊరుకొంటున్నారే గానీ, ఎప్పుడో ఎవరో ఒకరు వాడ్ని ఏం చేస్తారో, ముందు ముందు వాడి భవిష్యత్ ఏమిటో ఘా కంతుపట్టడం లేదన్నయ్య గారూ" అంది కల్యాణి కళ్ళ నీళ్ళు పెట్టుకొంటూ.

"రాన్రానూ వీడొస్తున్నాడూ అంటే, వూళ్ళో పిల్లలంతా తప్పుకు పారిపోవడం మొదలెట్టారు. నేను బైటికెడితే. ప్రతివాళ్ళూ నన్ను చూసి వ్యంగ్యంగా నవ్వడమే. ఎదురుబడి ఏమీ అనలేక, వెనకాల "సొంత కొడుకుని బాగు చేసుకోలేడు కానీ, వూళ్ళో వాళ్ళనీ, దేశాన్నీ బాగుచేస్తానికి, కథల్రాయడం మొదలెట్టాడీయన" అని వాళ్ళనుకోవడం నాకు వినిపిస్తూనే వుంది. కానీ ఏం చేస్తాను? వాడ్ని ఎలా బాగు చెయ్యాలా అని ఆలోచించీ, ఆలోచించీ అలసిపోయిన నా మనస్సు, కథల్రాయడంలోనే సేద దీరుతోందిరా ... చెయ్యగలది ఏమీ లేనప్పుడు నాకు చేతనైన ఈ కథల్రాయడంలో ఇటు మానసిక తృప్తీ, అటు కాస్త పేరుప్రఖ్యాతుల్లాంటివీ లభిస్తున్నప్పుడు మానుకోవటం దేనికనిపించి ఇలాగే కొనసాగిస్తున్నాను." బాధపడ్డాడు సత్యం.

"వాడు చేసే అల్లరి, సందర్భాలతో సహా వివరంగా చెప్తారా నాకు" అని నేనడగడంతో మళ్ళీ కల్యాణి మొదలుబెట్టింది.

"ఏముంది ... స్కూలుకి వెళ్లాడనుకోండి ... ఏ ఇద్దరు పిల్లల్లో మాటా మాటా అనుకొంటుంటే, వీడు వెళ్ళి, వాడికి అన్యాయంగా తోచిన కుర్రాడ్ని చితక్కొట్టేస్తాడట. ఏమన్నా అంటే 'నిన్న సినిమాలోని హీరో అలాగే అన్యాయంగాళ్ళ నందరినీ చితక్కొట్టేడు కదా' అంటాడు. వాడి స్వంత చెల్లితే రెండు చాక్లెట్లు ఎక్కువ తీసేసుకుందనుకోండి, ఏ కప్ప పిల్లనో, పీతనో, బొద్దెంకనో తెచ్చి దాని మీద పడేస్తాడు. అది గోల పెట్టేస్తుంటే ఫలానా సినిమాలో నిజం చెప్పించడానికి ఇలానే చేశారుగా! అంటూ వాదిస్తాడు. హింసతోనే సమానత్వం

# మార్పు

సాధించగలం అనే నమ్మకం వాడి మనసులో బాగా పాతుకు పోయిందన్నయ్య గారూ?" అంటూ వివరించింది కల్యాణి.

"నువ్వు చెప్పింది నా కర్థమయ్యిందమ్మా! కానీ నేను వచ్చి కారన్నా దిగకముందే, ఏ అన్యాయానికీ ప్రయత్నించక ముందే నా కారు మీదా, ఆ తర్వాత నా మీదా ఎదుర్కొన్నాడెందుకు? అదే నాకు అర్థంగాలేదు మరి." నా సందేహం బయటపెట్టాను.

"ఓసీ అదా! ఏముందీ ... మరేదో సినిమాలో విలన్ పెద్ద కారులో పల్లెకి వచ్చి అక్కడ అన్యాయాలు చేసి అందర్నీ వేధించి వుంటాడు. నీ కారుని చూడగానే, అది గుర్తొచ్చి వుంటుంది అప్పుడు. హీరో ఆ విలన్నీ, అతడి వందలకొద్దీ అనుచరుల్నీ క్షణంలో ఉతికిపారేయడం కూడా గుర్తొచ్చి వుంటుంది. ఆ హీరో కంటే తనో వెయ్యాకులు ఎక్కువ చదివానని వూహించుకొని, మా వాడు నిన్ను ప్రజల్ని వేధించక ముందే, అన్యాయాలు జరక్క ముందే చితగ్గొట్టాలని భావించి ఉంటాడు. ఇంతకన్నా ఇందులో ఆలోచించడానికేం లేదు." తేల్చి చెప్పాడు సత్యం.

"అప్పుడు మీరు వాడ్ని, చుట్టుప్రక్కల అందర్నీ పోగేసి మొత్తం కలిసి చితగ్గొట్టి వుండాల్సింది. ఆ దెబ్బతో వాడు లొంగి వచ్చేవాడేమో" బాధపడిందామె.

"వాడికి ఫైటింగ్ పిక్చర్స్ అంటే చాల యిష్టం. అవి చూసొచ్చి ఇంట్లో చెల్లెలి మీద ప్రాక్టీస్ చెయ్యడం. ఆ తర్వాత ఊళ్ళోకి వెళ్ళి అన్యాయం అనిపించిన చోటల్లా కలియబడ్డం. నాల్రోజులు పోతే ఈ తెలుగు సిన్మాలలోని ద్యూయెట్లు కూడా చూసొచ్చి ప్రాక్టీస్ చేసేలా వున్నాడు." సత్యమే చెప్పాడు. అది వినగానే ఊహించని భయం కల్యాణి కళ్ళలో కదలాడింది.

"కల్యాణీ ... నువ్వెప్పుడైనా వాడికి కథ చెప్పావామ్మా" అడిగాను.

ఆశ్చర్యంగా చూసింది కల్యాణి. నా ప్రశ్న అసంబద్ధం అని తోచిందేమో ఏమీ మాట్లాడలేదు.

"పిల్లలు కోరినవన్నీ యిచ్చేసి, అడిగిన సిన్మాలు చూపించేసి. చదువులో పడేస్తే సరిపోతుందనుకుంటారీ ఆధునిక యువతులు. వాళ్ళ ఆలనాపాలనా చూసి, ఆదరం – ప్రేమాభిమానాలూ చూపించి, కథలూ ఖబుర్లతో మంచీ – చెడూలకు గల తేడాలూ, తారతమ్యాలూ వాళ్ళకి చెప్పాలని మీకు తోచదు. వాళ్ళు చదివే కథల పుస్తకాలలో హింస, వాళ్ళు చూసే సినిమాలలో హింస, వాళ్ళు వినే మాటలలో హింస, ఇలా అన్నిటా హింసతో మాత్రమే అన్యాయాన్ని ఎదుర్కోగలం అనే అభిప్రాయం వాళ్ల మనసుల్లో బలపడేలాగా ఇటు సమాజమూ, అటు తల్లిదండ్రులూ, అందరూ సహకరిస్తుంటే, ఇంక అహింసకు ఈ ప్రపంచంలో తావెక్కడ ..." క్షణం ఆగాను నేను.

ఇద్దరూ ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు నా వంక.

"ఎవరు చేయాల్సిన పనులు, ఏదో యథావిధి నిర్వహించి, తీరిక సమయాలలో కాలక్షేపం కోసం వెతుక్కుంటున్నారీ నాటి స్త్రీ పురుషులు చదువులతోనూ, మోయలేని పుస్తకాల భారంతోనూ. అలసిసొలసి వచ్చిన చిన్నారి మనసులని, సాంత్వనపరచి, చల్లగా ... మనసుకి హత్తుకొనేలా ... కమనీయ కథలతో వాళ్ళని అలరించే వాళ్ళంటూ అరుదేమో. ఇంత పెద్ద దేశాన్ని ఒకే తాటి మీద నడిపించి, తెల్లవారి అధికార కబంధ హస్తాల నుండి స్వాతంత్ర్యాన్ని సాధించిన గాంధీజీ కేవలం అహింసనే ఆయుధంగా అమలుపరిచారు. ఆనాటి దేశ నాయకులందరూ ఆయన అడుగుజాడలనే అనుసరించారు. మన రాష్ట్రాన్ని విశాలాంధ్రగా నిల్పిన ఘనులు శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఏ హింసనూ ఆశ్రయించలేదు. ఇలా ఎన్నో ... ఎన్నెన్నో వున్నాయి చెప్పుకోవాల్సినవి.

"తెల్లని పాలవంటి మనసులు పసివాళ్ళవి. వాళ్ళ మనసుల్ని కల్మషభరితం చేస్తే ఎలా చెప్పండి. ప్రతీ చోటా హింసనే చూసే వాళ్ళ మనసులు, హింసని ఆచరించక ఏం చేస్తాయి చెప్పండి. అంతదాకా ఎందుకు ... ఇందాక నువ్వే, వాడ్ని చితగ్గొట్టి బుద్ధి చెప్పి వుండాల్సింది అంటూ నాకు సలహా ఇచ్చావే. తెలిసీ తెలీని పసి మనసుతో వాడు, తనకి అన్యాయంగా తోచిందాన్ని హింసతోనే ఎదుర్కొంటున్నాడు. కానీ నువ్వు ... వాడు చేసేది తప్పుగా తోచి. హింసించి దార్లోకి తెమ్మంటున్నావే. ఇది ఎంతవరకూ సబబు అని ఆలోచించావా? వాడ్ని తప్పు పట్టి, మనమూ అదే ఆచరిస్తే ఎలా చెప్పు?" ప్రశ్నించానామెని.

అర్థమైందన్నట్లు చూసింది కల్యాణి. మళ్ళీ తనే సందేహంగా "కానీ ... కానీ ... నన్నిప్పుడేం చెయ్యమంటారు చెప్పండి." అంది.

"అదే చెప్పబోతున్నాను విను. పిల్లలు కొట్లాటలకు దిగినప్పుడు వాళ్ళని తిట్టీ, కొట్టీ దారికి తీసుకురాలేం మనం. అది మంచి పద్ధతి కాదు. వాళ్ళలోని ఆ ఆవేశం తగ్గనిచ్చి, దగ్గర కూర్చోబెట్టుకుని, చల్లని మంచి మాటలతో అహింస, భూతదయ, ప్రేమాభిమానాలు వాళ్ళ మనస్సుకి హత్తుకు పోయేలా తల్లే తన పిల్లలకి చెప్పి, మంచి దార్లోకి తీసుకురావాలి. అంతేకానీ, కేవలం నాలుగు బాదేసి, "వీడింతే ... ఇంక మారడు." అనేసి వదిలేయడం కాదు. అది ముందు ముందు వాడి భవిష్యత్ జీవితానికి ఎంత హానికరమో గ్రహించగలగాలి. అంతేకాని, తప్పుకు తగిన దండన మాత్రం విధించేసి, ఏ నవలో పట్టుకు చదువుకొంటూ, వాడి చేతికి ఏవో పుస్తకాలిచ్చి చదువుకోమన్నంత మాత్రంలో అయిపోదు.







అర్థమైందనుకొంటాను అని నేనగానే అర్థమైందన్నట్లుగా తలూపింది

"నువ్వెళ్ళి వంట సంగతి చూడు కల్యాణీ మళ్ళీ భోజనాలు ఆలస్యం అయిపోతాయి అన్నాడు సత్యం ఆమె లేచి లోపలికెళ్ళింది

అప్పుడే బయటి నుంచి వచ్చాడు బాబు వాడి చెయ్యి పట్టి దగ్గిరికి తీసుకొని ఒళ్ళో కూర్చోపెట్టుకున్నాను పెట్టెలోంచి బిస్కట్ పాకెట్ అందుకొని వాడి చేతికిచ్చాను కారు దగ్గరి నా ప్రవర్తన గుర్తొచ్చిందేమో వాడికి నేను శత్రువును కాదని తెల్సుకొని వుంటాడు అందుకే మర్యాదగా అందుకొన్నాడు

తిను బాబూ" నీకే అది" అన్నాను వాడు సిగ్గుపడుతున్నట్లుగా తలొంచుక్కూర్చొన్నాడు ప్యాకెట్ విప్పి రెండు తీసి వాడికి తినిపించబోయాను

'ఊహూ! ముందు చెల్లికిచ్చి రానీ అన్నాడు

సత్యం ఇదంతా తెల్లబోయినట్లుగా చూస్తున్నాడు ఇది కలగానీ కాదు గదా' అనే భావన వాడి కళ్ళలో కదలాడుతోంది

సత్యం నన్నేదో ప్రశ్నించబోతుంటే వాడిని వారించి, నేను మా వూరి విశేషాలూ వివరాలూ అన్నీ చెప్పటం మొదలెట్టాను

క్షణం తర్వాత లోపల్నుంచి వచ్చిన బాబు, ప్యాకెట్‌లోంచి మాకిద్దరికీ కూడా బిస్కట్లు అందించి, తనూ తీసుకొని అక్కడే కూర్చొని తింటూ మా ఖబుర్లు వినసాగాడు మమ్మల్ని డిస్టర్బ్ చెయ్యటం ఇష్టం లేనట్లుగా! అది గమనించి, నే నేవేవో సరదా ఖబుర్లు మాత్రమే మా మాటల్లో వుండేలాగా జాగ్రత్తపడ్డాను

జరుగుతున్న దానిని నమ్మలేని వాడిలా, కూర్చొండిపోయిన సత్యం మా ఖబుర్లు వింటున్నాడో లేదో అనుమానమే బాబు మాత్రం చాలా ఆనందంగా వింటున్నాడు

భోజనాలు అయినాయి ఆ ఇంట్లోని అందరూ, నేను చెప్పే కబుర్లు వింటూ, జోక్సుని ఆనందిస్తూ, నేను సిటీ నుంచి వస్తూ తెచ్చిన మిఠాయీలు, పళ్ళూ ఫలహారాలతో సహా తినటం గమనించాను ఏదో నిశ్చింతలాంటిది ఆ భార్యాభర్తల కళ్ళలో కదులాడినా, ఇది క్షణికమేనేమో అనే ఆందోళన కూడా వ్యక్తమౌతోంది

ఎవరి మంచాల మీద వాళ్ళం కూర్చొని, తాంబూలం సేవిస్తూ చిన్ననాటి ముచ్చట్లు మొదలెట్టాం నేనూ సత్యం నేను ఆ టాపిక్ తీసుకొచ్చాను

ఇప్పటి పిల్లలు చదువుల్లోనూ, స్నేహాల్లోనూ పాలిటిక్స్ చోటు చేసుకొంటున్నాయి అందుకే ఆనాటి మా తియ్యటి, స్వచ్ఛమైన ఆత్మీయతతో కూడిన స్నేహ మాధురుల అనుభవాలను ఏర్చి కూర్చి చెప్పసాగాను నా సూచనల ననుసరించి, ఊఁ అంటూ, మధ్యలో నవ్వుతూ ఒకటి రెండు పొడి ముక్కలు మాత్రం మాట్లాడాడు సత్యం నా వాగ్ధోరణి చాలాసేపు సాగింది

ఆ తర్వాత ఎవరికి వాళ్ళం ఆదమరిచి నిద్రలో కొరిగాం

తెల్లారింది నేను గబగబా తయారయి బయల్దేరబోతూంటే, కాఫీ టిఫిన్‌లు ఆప్యాయంగా చేసి పెట్టింది కల్యాణి తరచుగా వస్తూండండి అన్నయ్యగారూ" అంది అలాగేనమ్మా అన్నాను నేను

వర్షపు జల్లు కురిసి, పుడమిని క్షాళనం చేసినట్లుగా, నువ్వు వచ్చి మా మనసుల్ని కల్మషరహితం గావించావ్‌రా! నాకు చాలా సంతోషంగా వుంది నా చేయి పట్టుకుని అన్నాడు సత్యం

'రచయిత ననిపించుకొన్నావ్‌రా! అని నవ్వుతూ వాడి భుజం తట్టాను నేను కారు దాకా వాళ్ళిద్దరూ వచ్చారు పాప ఇంకా నిద్ర లేవలేదట

విజయ్ ఉదయానే లేచినట్లున్నాడే ఏడీ మరి? వాడికి నాకో స్వీట్ కిస్ ఇమ్మని వాడ్నడగాలనుకొన్నానే అన్నాను నేను

నేనిక్కడే వున్నానంకుల్ అంటూ కారుకి అటు వేపునించి జవాబు వచ్చింది వాడు చుట్టూ తిరిగి నా దగ్గరికి వచ్చాడు

అంకుల్! మీతో నేనూ వస్తానంకుల్ నాకు ఈ వూళ్ళో ఏమీ బాగులేదంకుల్ కొన్నాళ్ళు మీ దగ్గరుంటాను మిమ్మల్ని అసలు అల్లరే పెట్టను మీ కారుని, మీ వస్తువుల్నీ కూడా ఏఁ చెయ్యను ఇక్కడ నా కసలే బాగాలేదు మీతో రావద్దా చెప్పండంకుల్' అర్థింపుగా అడిగాడు విజయ్

అలాగే విజయ్ ' అన్నాను నేను వాడి తల నిమురుతూ

ఒరే కన్నా ఇలా రా ముందు" తల్లిదండ్రులిద్దరూ పిలిచారు

నా పేరు విజయ్ ఇంక నన్నలాగే పిలుస్తే పలుకుతాను' మొండిగా చెప్పాడు వాడు అంకుల్‌ని వెళ్ళనీ ఈసారి మనం వెడదాంలే అన్నారు వాళ్ళు 'ఊహూఁ నేను మీతో రానే రాను అంకుల్‌తో అయితేనే వెళతాను ' మరింతగా బిగిశాడు వాడు

'ఇదో క్రొత్త గొడవొచ్చి పడిందేమిట్రా బాబూ!' వద్దంటే, మళ్ళీ ఎవర్ని ఏం చేస్తాడో ఏమిటో అన్నట్లుగా ఆలోచిస్తుండిపోయారు వాడి తల్లిదండ్రులు

'నిన్నను కొట్టానని కోపం వద్దంకుల్ నేనూ మీతో రావొద్దా అక్కడ నేను అల్లరి చేస్తే, వెంటనే పంపించేయండి మళ్ళీ ఊఁ ఊఁ నేను మాత్రం వస్తాను ఇవాళ మీరు తీసికెళ్ళకపోయినా నేను వెనకాలే వచ్చేస్తానంతే ' అంటూ నన్నే బెదిరించాడు మళ్ళీ

వాడు నిజంగానే అంత పనీ చేసే వాడిలాగా కన్పించాడు అందుకే నేను నవ్వుతూ విజయ్‌ని నాతో రానివ్వమ్మా కల్యాణీ వాడి గురించి మీరేం ఆలోచించవద్దు వాడు సరదాగా అక్కడ గడిపి మళ్ళీ వచ్చేస్తాడులే మీ అబ్బాయిని నేనేం అట్టిపెట్టుకోనుగా ఏదో వాడి సరదా తీరేదాకా కొద్ది

# ప్రవహించే పాట

**డా॥ సి. నారాయణరెడ్డి**

నాభిలో పుట్టిన పాట
నాలుక మీది కెగురుతుంది.
గొంతులో పడగెత్తిన పాట
గుమ్మం దాటి ఉరుకుతుంది.
ప్రసరణం పాటకు రక్త గుణం.
ఆవేశాన్ని అంటిపెట్టుకుని
ఆశయాన్ని ఒంట పట్టుకొని
ప్రవహించే పాటకు
ప్రజలు సముద్రాలు,
ఊరేగింపులో అది
ఉగ్రనేత్రం,
ప్రతిఘటనల్లో అది
ప్రభంజన గాత్రం,
పాటకు శ్రుతి ప్రజల నాడి
పాటకు స్థాయి ప్రగతివాడి

## మార్పు

రోజలు నాతో వుండనీ ఏరా సత్యం ఏమంటావ్" అంటూ ఇద్దర్నీ అడిగి చూశాను

ఆ తరువాత ఒక పావు గంట తరువాత తర్జన భర్జనలతోటే సాగింది చివరికి ఎలాగైతేనేం వాడి పంతమే నెగ్గింది విజయ్ నాతో బాటూ కార్లో ఎక్కి కూర్చొని వాళ్ళ అమ్మానాన్నలకు టా టా చెప్తుంటే, ఆనాడు ఇద్దరూ కూడా చెమర్చిన కళ్ళతో నే వీడ్కోలిచ్చారు

క్రితం రోజు సాయంత్రం వాడు, అద్దాలు పగలగొట్టి కారుని పాడు చేసినందుకూ, నన్ను కొట్టి అల్లరిపెట్టినందుకూ, బజార్లో వాణ్ని ఏం చేయకపోయినా, యింట్లో తన మీద ఏదన్నా ఫిర్యాదు చేస్తానేమో అని తెల్సుకోడానికి వాడు చాటుగా నిలబడి వున్నాడట

అందువలన మా ముగ్గురి మధ్యా నడిచిన సంభాషణ అంతా చాటుగా విన్నాడట తనని నేనేం చెయ్యకుండా, ఇంకా పైగా తననే సమర్థిస్తూ తల్లిదండ్రుల్ని మందలించడం వాడి మనస్సుకి చాలా ఆనందాన్నే కలుగజేసిందట

ఇంత మంచి అంకుల్ దగ్గర కొన్నాళ్ళుండి వస్తేనేగాని, అమ్మానాన్నలకు తనంటే 'ఇది' పోదు అని వాడికి చాల అనిపించిందట

దాని పర్యవసానమే పట్టుపట్టి సాధించిన ఈ ప్రయాణం ఆ సంగతిని వాడు ఆ రోజు దారిలో నాతో చెప్పాడు

ఇద్దరం కలిసి ఆ తర్వాత హైదరాబాదు వచ్చేశాము

అక్కడ వాడి ప్రవర్తన నాకెంతో ఆనందాన్ని కలిగించింది నన్ను సంప్రదించందే ఏ పనీ చేసేవాడు కాదు అయినా, సలహా మాత్రమే నేనిచ్చి, నిర్ణయం వాడికే వదిలేసేవాడిని

వాడికి తెలీని ప్రతీదీ వివరంగా చెప్పటానికి ప్రయత్నించాను మంచికి – చెడుకూ, హింసకూ – అహింసకూ, న్యాయానికీ – అన్యాయానికీ గల తారతమ్యాన్ని తీరుబడిగా వున్న సమయంలో సోదాహరణంగా వివరించాను ఏ జీవినీ ఏ క్షణంలోనూ మానసికంగా గానీ లేదా శారీరకంగా గానీ హింసించే హక్కు మనకి ఎంత మాత్రమూ లేదని వాడికి తెలియజెప్పడం కష్టసాధ్యమే అయింది

అబ్బాయిని పెంచుకొంటున్నారా" అంటూ వాడి ముందే నా పరిచయస్తులు నన్ను ప్రశ్నిస్తే చిర్నవ్వు నవ్వి వూరుకొనేవాడ్ని

వాళ్ళతో ఏమీ చెప్పరేం అంకుల్" అనే వాడు

వాడి పసి మనసులో నాతోనే వుండిపోవాలనే వూహ బలంగా నాటుకుపోయిందని తెలుసు తెలిసీ తెలీని ఆ వయసే అలాంటిది మరి

అందుకే తల్లిదండ్రులు పిల్లల మీద ఎన్ని ఆశలు పెట్టుకుంటారో, క్షణం క్షణం పిల్లల ప్రవర్తనను సరిదిద్దబోయి ఎన్ని ఆంక్షలు విధించి, పెంచుకొస్తారో చెప్తూనే, కలలోనైనా వాళ్ళ ఆశలు పిల్లల చుట్టూ ఎలా అల్లుకొని వుంటాయో, కథల్లాగా చెప్పాను

వాడి ప్రవర్తన హింసాత్మకంగా వుండకపోయినట్టయితే వాళ్ళ అమ్మానాన్న ఇంకా ఎంత అల్లారుముద్దుగా చూసుకొంటారో వాడికి తెలియచెప్పేవాడిని

అంతేకాక, నాకు తీరిక వున్నప్పుడు వాడ్ని కొన్ని కొన్ని సినిమాల షూటింగ్‌లకు కూడా తీసికెళ్ళి చూపించసాగాను

ఇలాంటి పిల్లల మనసు పెడ మార్గాన పట్టిందని వదిలెయ్యకూడదు అలాగని మందులూ, మాకులూ వుపయోగించాల్సిన అవసరమూ లేదు దండన కఠిన శిక్షలూ అసలే ప్రయోజనకరం కాదు

కేవలం వాళ్ళ మనస్సుకి సాంత్వన కావాలి అశాంతితో వేగిపోయి వెర్రెక్కిపోయేలా కాకుండా, చల్లని హాయైన అనునయం మాత్రమే వాళ్ళకి కావాలి

అందుకే మిత్రుల్ని వాకబు చేసి ఫైటింగ్ సీన్లు వుండే సమయాలలో ఆ చిత్రీకరణ చూపించేందుకే తీసికెళ్ళాను

అదేంటి అంకుల్! ఆ హీరో కుర్చీలోనే వున్నాడే మరి హీరో అక్కడ అంతెత్తు నుంచి క్రిందబడి సైకిల్ చెయిన్లతో వాళ్ళ చేత పాపం దెబ్బలు తింటున్నాడుగా మరి? అంటూ అమాయకంగా ప్రశ్నించేవాడు

దెబ్బలు తినేది డూప్ అనీ, సరదాగా ట్రిక్ ఫోటోగ్రఫీ ద్వారా వందమందిని ఒకేమాటు చిత్తుగా వేయగలిగే సీన్లో ధైర్యంగా హీరో గారు దర్శనం ఇస్తారనీ వాడికి తెలియచెప్పాలిసొచ్చింది

అక్కడ పిస్టల్‌తో దెబ్బతిన్న అన్యాయంగాడు చచ్చిపోయాడు కదా! మరి మళ్ళీ అలా లేచి వెళ్ళిపోతున్నాడేంటి? అంటూ అడిగేవాడు అది కేవలం నటన అనీ, అక్కడితో ఆ సీన్ ముగిసిపోయి ముగిసిపోయిందనీ చెప్తే అపనమ్మకంగా చూసేవాడు అలా అన్యాయంగాళ్ళు మళ్ళీ లేచి వెళ్తున్నందుకు చాలా బాధపడిపోయేవాడు

'అంకుల్ 'నేను పెద్దయ్యాక ఇలాంటి సినిమాలే తియ్యనియ్యను అన్యాయంగాడు చావాల్సిందే

మళ్ళీ లేవడానికి వీల్లేదు కోపంగా అన్నాడు అతడికి అది వుద్యోగం లాంటిదనీ, పైసల కోసం కొద్దిసేపు అలా నటించాడేగానీ, బయట అతను చాలా మంచివాడనీ విజయ్‌కి నచ్చ చెప్పాను

ఇలా నిజానికీ, పైసల కోసం జీవించే జీవితానికీ మధ్యగల అంతరాలు తెలుసుకొంటూ తన ప్రవర్తనలో ఎన్నెన్నో మార్పులు స్వయంగా తెచ్చుకోగలిగాడు విజయ్

ఇంట్లోనూ బయటా అహరహమూ నాతో బాటుగా మెసలుతూ, ఎన్నో, ఎన్నెన్నో విషయాలు తెలుసుకొన్నాడు విజయ్

నెల తిరిగేసరికి వాడి అమ్మానాన్నలు వచ్చారు కొడుకుని చూడటానికి వాళ్ళు వచ్చేసరికి నేనూ, విజయ్ డైనింగ్ టేబిల్ ముందు కూర్చొని భోంచేస్తున్నాం వాళ్ళు ముగ్గురూ లోపలకి ప్రవేశించారు

సారీ అంకుల్ అంటూ లేచి వెళ్ళి వాష్ బేసిన్ దగ్గర చెయ్యి కడుక్కోసాగాడు విజయ్

ఇదేమిటి వాళ్ళను చూడగానే తింటూన్న కంచం ముందు నుండి లేచి ఇలా చెయ్యి కడిగేసుకొంటున్నాడు మళ్ళీ ఏమన్నా ఆశ్చర్యపోయాను నేను వాళ్ళయితే సరేసరి

వంగి పాదాభివందనం చేశాడు విజయ్ తన తల్లిదండ్రులకి

విజయ్ అంటూ ఇద్దరూ ఎంతో ఆనందంతో వాడిని లేవదీశారు కొడుకుని దగ్గరికి తీసుకొన్నారు ఆ తల్లిదండ్రులు వాడు తింటూ వదిలిపెట్టిన కంచం దగ్గరికి తీసుకొచ్చి కూర్చోపెట్టి, తన చేత్తో అన్నం తీసి వాడికి తినిపించింది కల్యాణి వాడికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ఇన్నాళ్ళటి తన ప్రవర్తనతో ఇటువంటి తీపి క్షణాలు పోగొట్టుకొన్నానే అనిపించిందేమో!

నువ్వు మనిషివి కాదురా, దేవుడివి వీడింకేందుకూ పనికిరాడని, మాతో బాటుగా వూరు వూరంతా వదిలిపెట్టిన క్షణంలో నువ్వు వచ్చి, వాడిని ఏకంగా దేవుడిలా మార్చేశావు కదురా! నీ వంటి స్నేహితుడు ఈ జన్మలో దొరకడం అనేది నాకు ఆ భగవంతుడిచ్చిన వరంరా! అపూర్వ వరం అంటూ నన్ను ఏకాంతంలో కావలించుకున్నాడు నా మిత్రుడు సత్యం

వాడికి అన్నీ వివరంగా తెలియజెప్పాను నేను అంతా విన్నాక తన రచనానుభవం అంతా వుపయోగించి నన్నాకాశానికెత్తేశాడు

ఆ రాత్రి వుండి మర్నాడు వెళ్తూ, విజయ్‌ని కూడా తమతో బాటు తీసికెళ్తాం అన్నారు వాళ్ళు ఆ రాత్రంతా చెల్లెలితో ఖబుర్లేసుకు కూర్చొన్నాడు విజయ్ మేం ముగ్గురం మాటల్తోనే చాల రాత్రి గడిపేశాం

విజయ్‌ని తమతో రమ్మనగానే, ఏం అభ్యంతరం పెట్టకుండా, బయలుదేరాడు కానీ, తను నెల కొక్కసారైనా నన్ను చూసి వెళ్ళేందుకు పర్మిషనివ్వాలని ఓ కండిషన్ పెట్టాడు వాడు సరేనంటూ ఒప్పుకొన్నారు వాళ్ళు

నేనే స్వయంగా కారులో తీసికెళ్ళి వూళ్ళో దింపి వచ్చాను ఆ కుటుంబాన్ని తిరిగి వచ్చేటపుడు నా కళ్ళు చెమర్చాయి ఇన్ని రోజులూ వాడు నాకు బాగా అలవాటయిపోయాడు ఇప్పుడు ఒంటరిగా తిరిగి రావటం అనేది నా మనసుకి ఎలాగో వుంది కానీ తప్పదు

అదిగో అప్పటి నుంచీ ఇలా వాడు వచ్చినప్పుడల్లా వాడితో సరదాగా గడపటం, తిరిగీ వాడ్ని ఇలా తీసికెళ్ళి మళ్ళీ వాడి వూర్లో దించి రావటమూ మామూలైపోయింది

ఆ ప్రయాణం అలా సాగిపోతూనే వుంది కాలం తన పరిధిలో తాను ముందుకు కదిలిపోతూనే వుంది □

## ఇవేమన పద్యాలు




చెమురుగల్గు దివ్వె సంతోషమై వెలుగు
ధనము గలుగువాని తలపు హెచ్చు
ధనము తీర తలపు తనుదానె తీరును
విశ్వదాభిరామ వినురవేమ.

# నిజాం నవాబుకు ప్రజల జవాబు

(హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర: రచన: శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు ప్రచురణ: స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, గాంధీభవన్, హైదరాబాదు. 840 పుటలు, రాయల్ సైజు వెల నూరు రూపాయలు )

దేశ స్వాతంత్ర్యసిద్ధికై తమ సర్వస్వాన్ని అర్పించిన త్యాగధనుల దివ్యస్మృతికి భక్తి శ్రద్ధలతో అంకితం చేయబడిన ఈ బృహత్ గ్రంథంలో, కేవలం హైదరాబాదు సంస్థానంలో జరిగిన స్వాతంత్ర్య సమర వివరాలే కాక, నాటి హైదరాబాదు రాష్ట్ర స్వరూపము, దాన్ని పరిపాలించిన అసఫ్ జాహి వంశస్థులైన నిజాం నవాబుల పుట్టుపూర్వోత్తరాలు మొదలైన అనేక చారిత్రక విషయాలు వున్నాయి.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ (1857) కాలానికి పూర్వమూ, తరువాతా మన దేశంలో అన్ని ప్రాంతాలతో పాటు హైదరాబాదు సంస్థానంలో బ్రిటిష వారికి వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించిన మహపత్‌రామ్, తుర్రేబాజ్ ఖాన్ మొదలైన మహావీరుల గాథలు ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది హైదరాబాదు నగరంలో కొన్ని ముఖ్య వీధులకు ఆ వీరుల పేరు పెట్టారు కాని వాటిని తలచినవారు నేడు లేరు!

హైదరాబాదు సంస్థానం బ్రిటిష వారు సృష్టించిన కృత్రిమమైన రాష్ట్రం ఈస్టిండియా కంపెనీతో 1800 సంవత్సరంలో చేసుకున్న సంధి ప్రకారం అప్పటి నిజాం రాజు నిజామలీఖాన్, దక్కనుకు సూబేదారు (గవర్నరు) మాత్రమే. ఇతడు నిజాముల్ముల్క్ కుమారుడు. అనగా రెండవ నిజాము ఇతడు నమ్మదగిన వాడుగా అనిపించక పోవడంతో బ్రిటిష వారు, ఇతనిమీద నిఘా వుంచడానికి రెసిడెంటును నియమించారు రెసిడెంటే ముఖ్యమంత్రిని, మంత్రులను నియమించేవాడు బ్రిటిష సైన్యాలు బొల్లారంలో ఉండేవి బ్రిటిష వారి యెడ కనపరచిన విధేయత వలన క్రమంగా- కొన్ని అధికారాలు నవాబుకు సంక్రమించాయి. మన దేశంలోని సంస్థానాలన్నిటిలో హైదరాబాదు రాష్ట్రం పెద్దది విశ్వాసపాత్రుడైన మిత్రుడుగా బిరుదు సంపాదించుకున్న నిజాం అంతరంగిక వ్యవహారాలలో బ్రిటిష వారు క్రమంగా కలగజేసుకోవడం మానుకున్నారు

తెలుగువారు, మహారాష్ట్రులు, కర్నాటులు గల ఈ రాష్ట్రం పదహారు జిల్లాలుగా విభజించ బడింది. ఇందులో తెలంగాణా ఎనిమిది జిల్లాలు, మరాఠ్వాడా అయిదు జిల్లాలు, కర్నాటక మూడుజిల్లాలు

బ్రిటిష్ ఇండియాలో వస్తున్న పరిణామాల ప్రభావం ఈ రాష్ట్రం మీద పడకపోలేదు ఖిలాఫత్ ఉద్యమ ప్రభావంతో హిందూ మహమ్మదీయులు ఏకమై స్వాతంత్ర్య సాధనకు పూనుకున్నారు ఈ ఐక్యత అటు బ్రిటిష వారికీ ఇటు నిజాం నవాబుకూ ఇష్టంగా లేదు దీనితో పాటు కాంగ్రెసు ఉద్యమ ప్రభావమూ ఇక్కడి ప్రజలమీద పడసాగింది

ఏడవ మరియు ఆఖరు నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ కాలంలో ఇటు ప్రజలలో చైతన్యం పెరగడం, అటు ప్రభుత్వ దమననీతి పెరగడం ఒకేసారి జరిగింది మతపరమైన ఉద్రేకాలను రెచ్చకొట్టే పనులు జరిగాయి పౌరహక్కుల కోసం ఆర్యసమాజం వారు, కాంగ్రెసు వారు, కమ్యూనిస్టులు పోరాడసాగారు. గణేశోత్సవాలు జరుపుకునే వారిపై అత్యాచారాలు, ఓం పతాక దహనాలు, హవనకుండాలను అపవిత్రం చేయడం మొదలైన క్రూర చర్యలు జరిగాయి ఆర్యసమాజ కార్యకర్తలను హత్య చేయడం, జైళ్ళలో నిర్బంధించడం జరిగింది

దేశంలో వందేమాతరం ఉద్యమం ఈ రాష్ట్రంలోనూ మంచి సంచలనాన్ని కలిగించింది వేల సంఖ్యలో సత్యాగ్రహులు జైళ్ళకు వెళ్ళారు విద్యార్థులు కళాశాలలను బహిష్కరించారు. ఇది 1938-39 నాటి మాట తరువాత క్విట్ ఇండియా ఉద్యమం వచ్చింది. 1942లో హైదరాబాదు సంస్థానంలో- చైతన్యవంతులైన యువకులు ఉద్యమాన్ని ఉధృతం చేశారు. 1938 లోనే హైదరాబాదు స్టేటు కాంగ్రెసు సంస్థ చట్ట విరుద్ధమైనదిగా ప్రభుత్వం ప్రకటించింది. అంతకుముందే 1930 నుంచి పని చేస్తున్న ఆంధ్ర మహాసభలో రాజకీయవాదులు, మితవాదులు అతివాదులు ప్రవేశించి ఆ సంస్థ ద్వారా తమ స్వాతంత్ర్య సమరం సాగించారు.

ఆర్యసమాజీయులు పౌరహక్కుల కోసం నిరంతరం పోరాడుతూనే వున్నారు పండిత్ నరేంద్రజీ, పండిత్ వందేమాతరం రామచంద్రరావు, పండిత్ వినాయకరావు విద్యాలంకార్ మొదలైనవారు ఈ ఉద్యమంలో ముఖ్యులు కాంగ్రెసు నాయకులైన హయగ్రీవాచారిగారు, కమ్యూనిస్టు నాయకులైన రావి నారాయణరెడ్డిగారు మొదలైన వారెందరో ఆర్య సమాజంతో ప్రభావితులై పౌరహక్కుల కోసం పోరాడిన వారే అని రచయిత మాణిక్యరావు గారు 29వ ప్రకరణంలో పేర్కొన్నారు

నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ అనే సంస్థ నిర్వహించిన పాత్రను గురించి రచయిత మాణిక్యరావు గారు చాలా వివరంగా వ్రాశారు ఆంధ్ర మహాసభ పతాక కింద అన్ని రాజకీయ భావాలు గల స్వాతంత్ర్యవీరులు పాల్గొన్నారు గాంధీవాదులైన జమలాపురం కేశవరావు గారు, కమ్యూనిస్టులైన రావి నారాయణ రెడ్డి గారూ ఈ ఉద్యమంలో పాల్గొన్నారు ఏక వేదిక నుండి నిజాం ప్రభుత్వాన్ని యెదిరించారు అయితే దర్మవరంలో 1942లో జరిగిన తొమ్మిదవ ఆంధ్ర మహాసభలో కాంగ్రెసువాదులకు, కమ్యూనిస్టులకు అభిప్రాయ భేదాలు మొదలైనాయి పదకొండవ మహాసభ భువనగిరిలో జరిగింది ఆ సభకు అధ్యక్షులు రావి నారాయణరెడ్డి గారు ఆంధ్ర మహాసభలో కమ్యూనిస్టు ప్రాబల్యం హెచ్చింది దానితో మహాసభ రెండుగా చీలిపోయి జాతీయవాదుల ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుల ఆంధ్ర మహాసభ ఏర్పడ్డాయి మడికొండలో జాతీయవాదులు పన్నెండవ మహాసభ జరిపారు కమ్యూనిస్టుల పన్నెండవ ఆంధ్ర మహాసభ ఖమ్మంలో జరిగింది ఈ చీలిక రజాకార్లకు, నిజాం నవాబుకు కొంతవరకు ఉపయోగపడింది

అటు తీవ్ర మతోన్మాదులైన రజాకార్లకు లిటిల్ హిట్లర్ ఖాసిం రజ్వీ నాయకుడయ్యాడు ఆజాద్ హైదరాబాద్ (స్వతంత్ర హైదరాబాద్) నినాదం లేవదీశాడు రజాకార్లను స్వప్రయోజనాలకు ఉప

మీరిప్పుడు 'ప్రగతిపథం'లో...
పవర్ కట్
మీరు 'ప్రగతిపథం'లో విద్యుత్‌శాఖ-దాని ప్రజాసేవ'పై ప్రత్యేకకార్యక్రమం చూశారు కదూ! ఇహిహి....
ఇప్పుడు మరొక...
MONTE KRISTO

కొలిపిన ప్రభుత్వం ఆఖరుకి రజాకార్ల చేతిలో కీలుబొమ్మ అయిపోయింది

రజాకార్లు, రాష్ట్రంలో, ముఖ్యంగా గ్రామ ప్రాంతాలలో జరిపిన దౌర్జన్యకాండను మాణిక్యరావు గారు ఈ గ్రంథంలో వివరంగా వ్రాశారు జైళ్ళలో వున్న సత్యాగ్రహులపై సైతం దాడులు చేసి హింసించి చంపిన వివరాలు ఇందులో పొందుపరచారు మూడు ప్రాంతాల వారు ఏకగ్రీవంగా అమోదించిన నాయకులు స్వామి రామానంద తీర్థ, రాజీ యెరుగని త్యాగశీలి' షల్ బ్రేక్, బట్ షల్ నాట్ బెండ్ (ఆహుతి అయిపోతాం, కాని లొంగిపోము) అన్నదే ఆయన నినాదం యెన్నోసార్లు నిజాంనవాబు ఆయనతో సంప్రదింపులు జరిపారు భారతం యూనియన్‌లో, రాష్ట్రం విలీనం కావడం ప్రజా ప్రభుత్వం యేర్పడడం, తప్ప మరో ప్రత్యామ్నాయ సూచనకు ఆయన ఎన్నడూ అంగీకరించ లేదు

యుధాతదపు ఒడంబడిక భారత, హైదరాబాదు ప్రభుత్వాల మధ్య యేర్పడడం, భారత యేజెంటు జనరల్‌గా శ్రీ కె ఎం మున్షీగారు హైదరాబాదు రావడం, భారత సైన్యాల ఉపసంహారణ మొదలైన వివరాలుతో, ఆఖరు పట్టంగా పోలీసు చర్యను గురించీ, కన్నులకు కట్టినట్లు వ్రాశారు ఈ గ్రంథంలో రచయిత

తర తమ భేదం లేకుండా– అన్ని పార్టీలవారూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న తీరును వివరించారు రచయిత పేరు పేరున వేలాది స్వాతంత్ర్యయోధులను గురించి వ్రాశారు ఈ గ్రంథంలో ఎన్నో విలువైన చిత్రాలు ప్రచురించ బడ్డాయి

భారత స్వాతంత్ర్యం కోసం జరిగిన తుది సంగ్రామం హైదరాబాదు నడిగడ్డ మీదనే జరిగిందని స్వామీ రామానంద తీర్థ అన్నారు

ఈ తుది ఘట్టానికి పూర్వరంగాన్నీ, ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలను ఇంత వివరంగా తెలిపే గ్రంథం మరొకటి ఇప్పటికి రాలేదంటే అతిశయోక్తి కాదు సరళమైన శైలిలో ఎందరికో తెలియని అనేక చారిత్రక, సాంఘిక, మతపరమైన వివరాలను, రాజకీయ పరిణామాలను ఈ గ్రంథం చక్కగా చిత్రించింది రెండు వందల యేండ్ల నిజాం పరిపాలన నిజస్వరూపం ఈ గ్రంథంలో సాక్షాత్కరిస్తుంది నలభై యెనిమిది ప్రకరణాలతో, వందల చిత్ర పటాలతో రమారమి 700 పుటలు గల ఈ బృహత్ గ్రంథం రచించిన శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు గారు బహు భాషలు తెలిసిన రచయిత ఈ గ్రంథ రచనకు కావలసిన వివరాలను సేకరించడానికే రచయితకు యేండ్లు పట్టివుంటాయి వాటిని చక్కగా గ్రథనం చేసి అమూల్య విషయాలను గ్రంథస్థం చేశారు ఇటువంటి అపురూపమైన గ్రంథాన్ని ఎంతో సంయమనంతో రచించిన శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు గారినీ, విషయ సేకరణలో తోడ్పడిన వారి మిత్రులనూ, వ్యయ ప్రయాసలకు ఓర్చి ఈ గ్రంథాన్ని ప్రచురించిన స్వాతంత్ర్య సమరయోధుల సంఘాన్నీ, ముఖ్యంగా శ్రీయుతులు టి హయగ్రీవాచారి, కాటం లక్ష్మి నారాయణ గారలను అభినందించాలి

నేటి తరానికి హైదరాబాదు రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి వివరంగా తెలియదు ఇది అవశ్య పఠనీయమైన గ్రంథం ఈ గ్రంథం చదువుతుంటే బ్రిటిష్ ఇండియాలో జరిగిన స్వాతంత్ర్యోద్యమానికీ, నాటి హైదరాబాదు రాష్ట్రంలో జరిగిన పోరాటానికీ మధ్యగల తేడాలు, మధ్యయుగాల నిజాం రాచరికం చేసిన దురంతాలూ, స్వాతంత్ర్యయోధులు అనుసరించిన భిన్న భిన్న మార్గాలు అవగతమవుతాయి భారతమాత గర్భంలో యేర్పడిన ఈ వింత వ్రణానికి స్వతంత్ర భారత ప్రభుత్వం జరిపిన విజయవంతమైన శస్త్ర చికిత్సను గూర్చి చదువుతుంటే విషాదం, ఆనందం, ఆశ్చర్యాల కలుగక మానవు

— దాశరథి.



# సీరియల్ మల్లిక

యర్రంశెట్టి శాయి

(గత సంచిక తరువాయి)

ఒకరోజు భార్గవ్‌ని నిలదీసింది మల్లిక

'ఎంతకాలం ఇలా ఓవర్ వర్క్ చెయ్యటం? అంత అవసరమేమొచ్చింది?

చెప్పానుగా మల్లీ! కంపెనీ స్థితి చాలా అధ్వాన్నంగా వుంది పరిస్థితి టైట్‌గా వుంది ఆషామాషీగా పనిచేసే వాళ్ళకసలు పుట్టగతులుండటంలేదు నేనే కాదు అందరూ ఇలాగే చేస్తున్నారు ఏం చేస్తాం మరి, ఒళ్ళమ్ముకున్నాక?

'ప్రతి క్షణం ఏమవుతుందోనని భుజాల మీదుగా చూసుకోవటం – ఆ టెన్షనంతా ఎందుకు? వేరే వుద్యోగం చూసుకోవచ్చుగా? ఇంత అనుభవం వున్నాక ఈ ఉద్యోగం కాకపోతే ఇంకొకటి!

చూసుకోవచ్చు కాని ఇది సమయంకాదు ఎందుకో తెలుసా? కొత్త ప్రాడక్ట్ తయారు చేసే పని మీద వున్నాం దానికి నేనే ఇన్‌ఛార్జి! ఇంతకుముందు ఈ ప్రాడక్ట్ మీద చాలామంది రిసర్చ్ చేశారు కానీ ఎవ్వరూ తయారు చెయ్యలేకపోయారు ఇప్పుడు మా కంపెనీ చెయ్యగలిగితే పేటెంట్ మాకే వస్తుంది ఈ దేశంలోనే కాదు విదేశాల్లో కూడా! అదీగాక ఈ ప్రాడక్ట్ ప్రత్యేకత ఒకటి వుంది ఇది వుంటే కాన్సర్ రిసర్చికి ఇప్పుడయ్యే ఖర్చులో సగం ఖర్చు తగ్గుతుంది మా కంపెనీ భవిష్యత్తే గాక కాన్సర్ రిసర్చి భవిష్యత్తు కూడా ఈ ప్రాడక్ట్ మీద ఆధారపడి వుంది

ఈ ప్రాడక్ట్ గనక మార్కెట్‌లోకి వస్తే మా కంపెనీ స్థితి తారుమారవుతుంది వూహించలేని ఎత్తుకు ఎదిగిపోతుంది అప్పుడు మన భవిష్యత్తెలా వుంటుందో ఆలోచించి చూడు కంపెనీలో మన షేర్లు కొన్ని పదుల రెట్లు పెరగవచ్చు! అటు పేరు, ఇటు డబ్బూను! ఒక్క దెబ్బకి రెండు పిట్టలు! అతను ఆ రోజున పడిన శ్రమంతా ఏమయ్యిందో – కంఠంలో చెప్పలేని హుషారు ధ్వనిస్తోంది

'కానీ, అన్నీ ఇఫ్స్ అండ్ బట్స్ కదా? ఎందరో ప్రయత్నిస్తే గాని రిజల్ట్ మీకొస్తుందన్న నమ్మకమేమిటి? గుడ్డు పొదగక ముందే కోడిపిల్లల్ని లెక్క బెట్టినట్టుంది నువ్వు చెప్పేది! నమ్మకంలేని దాని కోసం ఇంత శ్రమపడటం, ఈ లోపల జీవిత సుఖాన్ని త్యాగం చెయ్యటం దండగ కదూ?

భార్గవ్ ముఖం సీరియస్‌గా మారింది జీవితంలో దేనికీ గ్యారంటీ వుండదు మల్లీ! గ్యారంటీ లేదు కదాని అసలు ప్రయత్నించకపోతే పొందే అవకాశమేదీ? పడతామని భయపడి నిచ్చెన ఎక్కకపోతే పైకే చేరుకోలేం! ప్రతి దానికీ కొన్ని రిస్కులు తీసుకోక తప్పదు డబ్బూ, పేరూ సంపాదించటం చాలా మంది అనుకున్నట్టుగా అంత తేలిక కాదు

ఇంకా డబ్బు సంపాదించకపోతేనేం? మనకున్నది చాలదా?

చాలదు ఎందుకో చెప్పనా? నాకొక ఆశ వుంది ఇప్పుడే కాదు ఎప్పట్నుండో వుంది ఏమిటో చెప్పనా?

చిట్టిగాడిలాంటి వాళ్ళకీ, మనలాంటి వాళ్ళకీ వున్న దూరం తగ్గించాలి ఆ కార్యం సాధించటానికి ముఖ్యంగా డబ్బు కావాలి అంతా ఇంతా కాదు ఎంతో డబ్బు కావాలి!

డబ్బు సంపాదించడానికి అనువైన అవకాశాలున్న దేశంలో వున్నాం ఇక్కడ సంపాదించలేకపోతే ఇంకెక్కడా సంపాదించలేం

వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు ఈ ప్రాడక్ట్ రిసర్చి నాకొక గొప్ప అవకాశం! ఈ అవకాశాన్ని ఏ పరిస్థితుల్లోనూ విడవదలుచుకోలేదు మల్లీ! మనిద్దరికీ కొంచెం కష్టమైనా సరే

అనుకున్నది అనుకున్నట్టు జరిగితే వచ్చే సంవత్సరం ఈపాటికి మిలియనేర్లమవుతాం! ఆ డబ్బు తీసుకుని ఇండియా వెళ్ళిపోదాం కోటి రూపాయలు చేతిలో వుంటే అక్కడ ఎన్నయినా చెయ్యొచ్చు అక్కడక్కడా చిన్న, చిన్న పరిశ్రమలు స్థాపిద్దాం నిరుద్యోగులకు పని కల్పిద్దాం సరైన తిండి, మందులు లేక జబ్బులో చచ్చిపోయిన చిట్టిగాడి పెళ్ళాం లాంటివాళ్ళు మరి వుండకుండా చేద్దాం ఎంగిలాకుల నుండి అన్నం ఏరుకు తినేవాళ్ళు లేకుండా చేద్దాం

ఒక దృశ్యం నాకిప్పటికీ కళ్ళకు కట్టినట్టుంటుంది చిన్నప్పుడు ఒకసారి శెలవల్లో మా మావయ్యగారి వూరు వెళ్ళాను మా మావయ్యకి ఒక భోజన హోటలుండేది అక్కడున్నన్నాళ్ళూ మావయ్యతో బాటుగా నేనూ హోటల్‌కి వెళుతుండేవాణ్ణి

ఒకరోజు సాయంత్రం హోటల్ డాబా మీద క్రిందకు చూస్తూ నిలబడ్డాను

అంతలో హోటల్ క్లీనర్ ఎంగిలాకులన్నీ చుట్ట చుట్టి తీసుకొచ్చి వెనక భాగంలో వున్న చిన్న ఆవరణలో పడేశాడు అప్పటికే అక్కడ కొంత మంది ముష్టివాళ్ళు నిలబడి వున్నారు అందరూ క్లీనర్ చుట్టూ గుమిగూడారు కొంచెం సేపు వాళ్ళతో ఏదో మాట్లాడి వాళ్ళలో ఒకడిచ్చిన డబ్బు జేబులో వేసుకుని హోటల్లోకి వెళ్ళిపోయాడు క్లీనర్

డబ్బిచ్చినతనూ, అతని పెళ్ళాం బిడ్డలనుకుంటాను – నలుగురైదుగురు ఆకుల దగ్గరకు వచ్చి కూర్చున్నారు మిగిలిన వాళ్ళంతా ముఖాలు వేలాడేసుకుని వెళ్ళిపోయారు

ఆకుల దగ్గర కూర్చున్న వాళ్ళు ముందు గబగబా కడుపులు నింపుకున్నారు తర్వాత ఆకుల్లో నుండి అన్నానికి అన్నం కూరలకు కూరలు వేరు చేసి తాము తెచ్చుకున్న పాత్రల్లో వేసుకున్నారు ఖాళీ ఆకులన్నీ తీసి అక్కడే వున్న చెత్త కుండీలో వేసి వెళ్ళిపోయారు వాళ్ళటు వెళ్ళగానే ఇటు దూరంగా నిలబడిన కుక్కలు రెండు పరుగున వచ్చి ఆకుల మీద పడ్డాయి

ఎంగిలి అన్నం వాళ్ళలా ఆబగా తింటుంటే నా కడుపు దేవినట్లయ్యింది అటే చూస్తూ నిలబడిన వాణ్ణల్లా మామయ్య వచ్చి పలకరించేసరికి ఇటు

> జరిగిన కథ–10 భార్గవ్ అమెరికాలో ఒక చిన్న కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు భార్గవ్ మల్లికలు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు పిల్లలు లేరన్న కొరత తప్పిత వారి జీవితం సాఫీగా సాగిపోతోంది ఆ దంపతులకు సంతానం కలుగని కారణం ఏ డాక్టర్లూ చెప్పలేకపోతారు భార్గవ్‌కి మాత్రం తమకి పిల్లలు తప్పక పుడతారని నమ్మకం ఎదురింటి పాప స్వేహ అంటే మల్లికకి తగని ప్రేమ. పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకు ఆసక్తిలేదని డాక్టరుతో చెప్తాడు భార్గవ్ భార్గవ్‌కి తనింట్లో చిన్నప్పుడు పాలేరుగా ఉన్న చిట్టిగాడు, వాడి పిల్లలు జ్ఞాపకం వస్తారు చిట్టిగాడి పిల్లలకి ఏదో ఒక దారి చూపించాలనుకుంటాడు చిట్టిగాడి భార్య చనిపోయిందని, వాడు క్షయతో బాధపడుతున్నాడని తండ్రి ఉత్తరం ద్వారా తెలుసుకొన్న భార్గవ్ ఆవేదన చెందుతాడు డేవిడ్ తన ఇంట్లో కంపెనీ తరఫున ఇచ్చే 'క్రిస్మస్' పార్టీకి మల్లిక, భార్గవ్ వెళతారు భార్గవ్ ఇదివరకటిలా ఉండటంలేదని, ప్రతి చిన్న విషయానికి వాదులాడుతున్నాడని, పిల్లలు లేకపోవడమే అతని ఈ ప్రవర్తనకి కారణం అని స్నేహితురాలు అంజలితో చెప్పి బాధపడుతుంది మల్లిక

తిరిగాను

ఏమిట్రా అదే పనిగా అటు చూస్తున్నావ్?

అమ్మమ్మ మంచినీళ్ళు కూడా ఒకళ్ళు తాగిన గ్లాసులో తాగనివ్వదు గదా. మరి వాళ్ళు ఒకళ్ళు తిని వదిలేసిన అన్నం ఎట్లా తింటున్నారు మావయ్యా? అమాయకంగా అడిగిన నన్ను చూసి చిదానందంగా నవ్వాడు మావయ్య

ఎర్రి సన్నాసీ! అడుక్కునే వాళ్ళకి ఎంగిలేమిట్రా? కడుపు నిండందే భాగ్యం వాళ్ళక

ఆ జవాబు రుచించలేదు నాకు అడుక్కు తినే వాళ్ళూ మనుషులేగా!

ప్చ్! ఎంగిలన్నం ఎవరైనా మాత్రం ఎట్లా తినగలరు మావయ్యా?

వాళ్ళను చూసి 'ప్చ్' కొట్టవలసిన పని లేదురా! వాళ్ళిప్పుడు పట్టుకెళ్ళిన అన్నం కూరలు ఏంచేస్తారో తెలుసా? మిగతా అడుక్కునే వాళ్ళకు అమ్ముతారు ఇటు వీళ్ళ కడుపులూ నిండాయి అటు డబ్బులకు డబ్బులూ వస్తాయి తెలివంటే వీళ్ళదిరా!

వాళ్ళ దగ్గర మన క్లీనర్ డబ్బెందుకు తీసుకున్నాడు?

అదీ ఒక రకమైన వ్యాపారమే! అడుక్కునేవాళ్ళ దగ్గర మన క్లీనర్ చేస్తున్న వ్యాపారం.



# మల్లిక

అక్కడున్న వాళ్ళల్లో ఎవరెక్కువ డబ్బులు ఇవ్వగలిగితే ఆ పూటకి ఎంగిలాకులు ప్రాప్తం. వ్యాపార బాషలో చెప్పాలంటే బిడ్డింగ్ అన్నమాట! అందుకే లేనివాణ్ని చూసి విచారపడొద్దురా బాబూ అనేది వాళ్ళకున్న సర్వైవల్ టిక్నిక్ మనకెక్కడుంది? నవ్వాడు మావయ్య

తెలిసీతెలియని ఆ వయస్సులోనూ అది విని 'స్థాణువునయ్యాను అడుక్కుతినేవాడి దగ్గర గీక్కుతినటమంటే అదేనన్నమాట!

ఫోమ్‌బెడ్ మీద తప్ప పడుకోని మావయ్య, కార్లల్లో తప్ప కాలు క్రింద పెట్టని మావయ్య, అప్పుడే పొయ్యి మీద నుండి తీసిన ఆవిర్లుకక్కే చికెన్ బిర్యానీలు, మటన్ రోస్టులూ తప్ప కాస్త చల్లారినవైతే ముఖం మీద విసిరికొట్టే మావయ్య, పాచిపోయిన కూటితో కడుపులు నింపుకుని, వీళ్ళైతే కాసిన్ని డబ్బులు చేసుకుంటున్న ఆ దౌర్భాగ్యులను చూసి వాళ్ళకేంరా అంటూ తనకేదో తక్కువైనట్టు వాపోతున్నాడు

ముప్పొద్దులా చేయించుకునే చాకిరీకి మూడు పూట్లా తిండి, పావో అర్థో డబ్బులూ తప్ప మరేం ఎరగని క్లీనర్ పది పైసల పైసంపాదనకి ఆశపడితే వాడి తెలివితేటలకు అసూయపడుతున్నాడు

టేబుల్ రివర్స్ అయ్యి మావయ్య వాళ్ళ స్థితిలో వుంటే ఆ మాట అనేవాడా?

అసలా పరిస్థితి మనిషికెందుకు రావాలి? ఎందుకు రావాలి మల్లీ?'

మల్లిక మాట్లాడలేదు అసలా ప్రశ్నకు సమాధానం ఎవరికి తెలుసు? తెలిసినా లోకంలోని సమస్యలన్నిటినీ పరిష్కరించగలిగే ఓపిక ఎవరికుంది? వున్నా ఒక్క మనిషి వల్ల సాధ్యమవుతుందా?

మల్లిక మనస్సులోని భావం కనిపెట్టినట్టు బార్గవ్ మళ్ళీ అన్నాడు కళ్ళతో పాటు కాస్త మనస్సు విప్పుకుని చూస్తే మన చుట్టూ రకరకాల దురదృష్టవంతులుంటారు మల్లీ! కానీ మనం చూడం చూసినా, పట్టనట్టు పోతూ వుంటాం ఒక్క మనిషి అన్నీ చెయ్యలేకపోవచ్చు కానీ ఒక్కొక్క మనిషి ఒక్కొక్కటి చొప్పున చెయ్యొచ్చుగా?

ఎవరికి వాళ్ళు, మనకెందుకులే మనం ఒక్కళ్ళు చేసినందు వల్ల ఈ లోకం బాగుపడుతుందా అనుకుంటే ఎలా? చీమలు పెట్టిన పుట్టల సామెత వూరికే రాలేదు కదా? తోటి మనిషి మీద కనీసపు దయ, సానుభూతి చూపటం మనిషి కనీస బాధ్యత ఆ విషయం గురించి వేరే వాదనలుండకూడదు!అవకాశాలున్నవాడు లేనివాణ్ని లోకువ చెయ్యగూడదు. సాధ్యమైనంత వరకూ సాయపడాలి ఇది ఆశయం కాదు కర్తవ్యం!"

కాస్సేపు ఆలోచించి అంది మల్లిక 'నువ్వు చెప్పినదంతా నేనూ ఒప్పుకుంటాను కానీ 'ఇంట గెలిచి రచ్చ గెలువు' అనే సామెత కూడా వుంది మన ముందు ఒక సమస్య వుంది దాన్ని పరిష్కరించుకోకుండా దాన్నుండి పారిపోవాలని చూస్తున్నావు అది మర్చిపోవటానికి ఏవేవో వ్యాపకాలు పెట్టుకుంటున్నావని నా అనుమానం నిజమేనా?'

మనకు సమస్యలేం వున్నాయి?" ఆశ్చర్యంగా చూశాడు భార్గవ్

'అదుగో! మనకు సమస్య వున్న సంగతే నువ్వొప్పుకోవటం లేదు డాక్టర్ ఏం చెప్పాడు? నిజాన్ని అంగీకరించి దానితో కోపప్ అవ్వాలని చెప్పలేదూ? ఒకసారి గ్రూప్ థెరపీ సెషన్‌కి వెళ్తే బాగుంటుందనిపిస్తోంది ఏమంటావ్?'

'ఓ, ఆ విషయమా నువ్వు మాట్లాడేది? ఇంకేదో అనుకుని హడలిపోయాను అయినా ఒంట్లో రోగమేమిటో చెప్పలేని డాక్టర్లు మనస్సుని బాగు చేస్తారంటే నువ్వు నమ్ముతావా? ఈ అమెరికన్లకు పనేంలేక తుమ్మినా, దగ్గినా సైకియాట్రిస్ట్‌ల దగ్గరకు పరిగెడతారు నువ్వా ఆ భ్రమలో పడిపోకు!"

'అన్‌రీజనబుల్‌గా మాట్లాడుతున్నావు భార్గవ్, డాక్టర్ చెప్పాడు కదా, లోపమేమిటో తెలియకుండానే పిల్లలు పుట్టని కేసులు చాలా వున్నాయని డాక్టర్ శాయశక్తులా ప్రయత్నించాడని నీకూ తెలుసు. తెలిసీ బ్లేమ్ చెయ్యటం న్యాయం కాదు అసలు భ్రమలో వున్నది నువ్వు! మనకేమిటి, పిల్లలు పుట్టకపోవటమేమిటి, అనుకుంటున్నావు కదూ? ఇలా మనమే కాదు మనలాంటి చాలామంది అనుకుంటారు అయితే నిజం నిజమే! దాన్ని ఎవ్వరూ మార్చలేరు నువ్వనుకున్నట్టు ఇది ఫార్మల్ సైకియాట్రిక్ సెషన్ కాదు మనమెళ్ళేది సైకియాట్రిస్ట్ దగ్గరకు కాదు ఈ గ్రూప్‌లో మనలాంటి వాళ్ళే వుంటారు ఇన్‌ఫార్మల్‌గా మనస్సు విప్పి చెప్పుకుంటారు బాధ బహిర్గతమైతే తప్ప మనస్సు తేలిక పడదంట ఎక్కడో చదివాను ప్లీజ్! నా మాట విని ఒక్కసారి వెళ్ళొద్దాం " ప్రాధేయ పూర్వకంగా చూసింది

నాకసలు బాధుంటేగా బహిర్గతం చేసుకోవటానికి? కావాలంటే నువ్వెళ్ళిరా నన్ను విసిగించకు న్యూస్ పేపర్ చేతిలోకి తీసుకున్నాడు

ఇది ఇద్దరికీ సంబంధించిన విషయం ఈ క్రైసిస్‌ని ఇద్దరం సమంగా పంచుకోవల్సిన వాళ్ళం ఇద్దరం కల్సి వెళ్తేనే బాగుంటుంది అయినా ఒకసారి ప్రయత్నించటం వల్ల పోయేదేం వుంది? నువ్వే అంటావు గదా, ఏదైనా ఒకసారి ట్రై చెయ్యటంలో తప్పులేదని?

అసలు నీ భయం నాకు తెలుసులే! ఇన్ విట్రో ఫర్టిలైజేషన్ ఎందుకు వద్దన్నావో కూడా నాకు తెలుసు నాకు కష్టం కలిగించాల్సి వస్తుందనేది అసలు కారణం కాదు అది కూడా విఫలమైతే విషయం పూర్తిగా తేలిపోతుంది ఆ కడపటి నిజాన్ని భరించలేవు నువ్వు అన్ని విధాలా ప్రయత్నించకుండా దేన్నీ వదలటం నీ స్వభావం కాదు అయినా వద్దన్నావంటే అదే కారణం అవునా?' మల్లిక కళ్ళల్లోని సవాల్‌ని గమనించాడు బార్గవ్

నువ్వు చాలా తెలివిగలదానివనీ, అందరి మనస్సుల్లో ఏముందో చదవగలవనీ నీ గర్వం అవునా?'

'నీ అభిప్రాయం శుద్ధ తప్పు! నేను తెలివిగలదాన్ని అవునో కాదో, అందరి మనసుల్నీ చదవగలనో లేనో తెలియదు గాని నీ మనస్సు మాత్రం నాకు తెలిసినంతగా ఇంకెవరికీ తెలియదనే నా నమ్మకం! ఇక కప్పదాట్లు వెయ్యకు. ఆఖరిసారిగా అడుగుతున్నాను వస్తావా, రావా?' సూటిగా అడిగింది

మల్లిక కళ్ళల్లోకే కాస్సేపు చూశాడు భార్గవ్

సరే వస్తాను అయితే నీ తృప్తి కోసమే గాని, అది మనల్నేదో వుద్ధరిస్తుందని మాత్రం కాదు!

* * * * * *

ఆ తర్వాతి వారమే సపోర్ట్ గ్రూప్ మీటింగ్‌కి వెళ్ళారు మల్లిక, భార్గవ్

పబ్లిక్ లైబ్రరీ మీటింగ్ హాల్లో సాయంత్రం ఏడు గంటలకు మీటింగ్

షుమారు పదిహేను మంది ఆడవాళ్ళు, పది మంది మగవాళ్ళు వచ్చారు మగవాళ్ళంతా మీటింగ్ హాల్లో గేదర్ అయితే ఆడవాళ్ళు బైట లాబీలో కూర్చున్నారు ఆ రోజు మీటింగ్ ముఖ్యంగా మగవాళ్ళకో ప్రసిద్ధ సైకియాట్రిస్ట్ డాక్టర్ స్టీఫెన్ వెస్ట్ కూడా ఆహ్వానింపబడ్డాడు

ఆడవాళ్ళలో చాలా మంది ముప్పై ముప్పై అయిదు మధ్య వయస్సువాళ్ళే. ఒకరిద్దరు మాత్రం ముప్పై లోపుగా కనబడుతున్నారు ఆ మీటింగ్ నడుపుతున్నావిడ పేరు జేన్ నెల్సన్! ఆవిడకూ పిల్లల్లేకపోతే ఈ మధ్యే ఒకమ్మాయిని దత్తత చేసుకుంది

అందరూ కూర్చున్నాక జేన్ గొంతు సవరించుకుంది 'ఇక్కడ వున్న వాళ్ళందరూ ఒకే సమస్యతో బాధపడుతున్నవారే! కాబట్టి, సంకోచించకుండా, భయపడకుండా విషయం చర్చించవచ్చు ఇక్కడున్న అందర్లోకీ నేను పాత మెంబర్ని, మీకేమైనా ప్రశ్నలు, అనుమానాలు వుంటే నన్నడగవచ్చు ఇది చాలా ఇన్‌ఫార్మల్ గేదరింగ్! ప్రతి ఒక్కళ్ళూ ఫ్రెండ్స్ మధ్య వున్నట్టే భావిస్తారని ఆశిస్తాను "

చెప్పటం ముగించి జేన్ ఒకావిడవైపు చూసింది.

'మీ పేరు?'

"టిఫనీ వెల్స్!"

"ఎంతకాలం నుండీ పిల్లల కోసం ప్రయత్నిస్తున్నారు?'

'మూడు సంవత్సరాలనుండి."




**డాక్టర్‌కి చూపించుకున్నారా?"**

**"ఒకళ్ళు కాదు, ఇద్దరికీ."**

**'ఏమన్నారు?**

**"ట్యూబ్స్ ఆబ్సెంటట "**

**"అయితే ఏం చేద్దామనుకుంటున్నారు?"**

**"ఇన్ విట్రో. ఫర్టిలైజేషన్, 'సర్రగేటింగ్' మాకు అందుబాటులో లేనివి. నా భర్తకు ఈ మధ్యే వుద్యోగం పోయింది. నా జీతం ఇల్లు గడవటానికే సరిగ్గా సరిపోదు ప్రైవాటికి డబ్బెక్కణ్నుండి తేగలం?**

**ఇంక చెయ్యటానికేముంది? దేవుడే నేనంటే చిన్న చూపు చూశాడు ఇంకెవరేం చెయ్యగలరు? నాకే ఎందుకిలా జరగాలి? వై మి? నేను చేసిన తప్పేమిటి?" రాను రాను టిఫనీ కంఠం బొంగురుపోయింది. కళ్ళల్లో నీళ్ళుబికి బుగ్గలమీదుగా జారాయి.**

చటుక్కున కళ్ళు తుడుచుకుని తనను తాను తమాయించుకుంది

అయామ్ సారీ!

జేన్ టిఫనీ చెయ్యి చేతిలోకి తీసుకుంది ఏం పరవా లేదు మేమర్థం చేసుకోగలం ఒక్కటి చెప్పనీ టిఫనీ! ఇది ఎవరి తప్పూ కాదు రాను రాను ఈ బాధ తగ్గుతుంది పరిస్థితులు బాగుపడతాయి నీ భర్తకు వుద్యోగం రాగానే ఎడాప్షన్‌కి ట్రై చెయ్యండి '

ఇంకోఅమ్మాయి పేరు జోయానా!

ఆమె చెప్పసాగింది నా టెస్ట్ రిజల్ట్సన్నీ బాగానే వున్నాయని డాక్టర్ చెప్పగానే విని ఎంత సంతోషపడ్డానో చెప్పలేను!

నెలల తరబడీ వుదయపు టెంపరేచర్ రికార్డింగు. బాధాకరమైన రకరకాల పరీక్షలూ– వీటన్నిటి తర్వాత ఇది చాలా గొప్ప వార్త!

నా సంతోషపు పొంగు ఎంతోసేపు నిలవకుండానే డాక్టర్ చెప్పటం సాగించాడు నీ భర్త లాబ్ రిజల్ట్సు కూడా వచ్చాయి స్పెర్మ్ కౌంట్ బాగానే వున్నా, స్పెర్మ్ కదలటం లేదు

అంటే, అవి అండంవరకూ వెళ్ళలేక పోతున్నాయన్న మాట! నాలో నేనే అనుకుంటున్నట్లు అన్నాను.

అవును నీ సెర్వికల్ మ్యూకస్ హోస్టైల్ అవ్వటం మూలాన స్పెర్మ్‌ని కదలకుండా చేస్తోంది

అయితే అవి అక్కడే చచ్చిపోతున్నాయా? నా కంఠం ఎందుకు వణికిందో నాకే తెలియదు బహుశ, నేనంతకు ముందు చావనేదాన్ని ఎరక్కపోవటం వల్లనేమో! అయినా, మైక్రోస్కోప్‌లో తప్ప కనబడని ఆ సూక్ష్మాణువులు చచ్చిపోయాయని దుఃఖపడటం ఎంత సిల్లీ విషయం!

అవునని తలూపాడు డాక్టర్

వేరే అవకాశాలను గురించి డాక్టర్‌తో మాట్లాడాను ఆయన చెప్పినదాని ప్రకారం ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ (కృత్రిమంగా స్పెర్మ్‌ని గర్భాశయంలో పలికి పంపటం) మా పరిస్థితికి అనువైన మార్గం అని తెలిసింది

డాక్టర్ దగ్గర నుండి ఇంటికొస్తుంటే రకరకాల ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి స్వంతంగా ఎల్లలని పెంచటానికి వీలుగా వుంటుందనే ఇప్పటివరకూ చేస్తున్న ఫుల్‌టైం జాబ్ వదిలేసి పార్ట్‌టైం జాబ్ సెలెక్ట్ చేసుకున్నాను మా పెళ్ళయి సంవత్సరంన్నరే అయినా ఇద్దరం ముప్ఫయ్యేకి దరిదాపుల్లో వున్నాం ఇద్దరం సంసారం, పిల్లా జెల్లా కావాలనుకునే ట్రెడిషనల్ కుటుంబాల్లో నుండి వచ్చిన వాళ్ళం కానీ ఇప్పుడిలా జరుగుతోందేమిటి? మాకెందుకు సవ్యంగా పిల్లలు పుట్టటం లేదు" ఇప్పుడేం చెయ్యాలి? ఈ విపత్కర పరిస్థితిని ఎలా దాటటం? ముఖ్యంగా ఈ విషయం టామ్ కెలా చెప్పటం"

ఆలోచనల్లోనే ఇల్లు చేరాను కాస్సేపటికి టామ్ వచ్చాడు

టామ్! అలా వున్నావేం? వాడిపోయినట్లున్న అతని ముఖం చూస్తూ ఆదుర్దాగా అడిగాను

ఇంతకు ముందే ఫోన్‌లో డాక్టర్‌తో మాట్లాడాను నా టెస్ట్ రిజల్ట్సు వచ్చాయి న్యూస్ ఈజ్ నాట్ గుడ్ జోయానా! అతని కంఠంలో బాధ స్పష్టంగా వినబడుతోంది ఆ ధ్వని గ్లాస్ పగిలినట్లు గరగర మంటూంది ఇంక ఏడుపొక్కటే తరువాయి!

చప్పున నేనందుకున్నాను నేనూ డాక్టర్ దగ్గర్నుండే వస్తున్నాను అన్ని విషయాలూ మాట్లాడేం వివరాలన్నీ చెప్పాను చెబుతున్నప్పుడు నా కళ్ళల్లో రెండు కన్నీటి బిందువులు నిలిచాయేమో నేను గమనించలేదు

**టామ్ నన్ను దగ్గరకు తీసుకుని గట్టిగా హత్తుకున్నాడు. కన్నీళ్ళు తుడిచాడు "విచారపడకు హనీ! మనిద్దరం ఒకరికొకరం' వున్నంత వరకూ ఎట్లాంటి విషమ పరిస్థితినైనా ఎదుర్కోగలం ఎవ్రిథింగ్ విల్ బి ఆల్‌రైట్ ఆ ప్రామిస్ యు!"**

**ఈ పరిస్థితిని డీల్ చెయ్యటానికి అన్నిటినీ మించి భార్యాభర్తలకు ఒకళ్ళనొకళ్ళ ఏమోషనల్ సహకారం ఎంతైనా అవసరం అని చెప్పటానికే ఇదంతా చెప్పాను ' చెప్పడం ముగించింది జోయానా**

**ఇంకొకావిద పేరు మెలనీ! జేన్‌లాగే ఆవిడా ఆ గ్రూప్‌లో పాత మెంబర్**

**'క్రొత్తగా చేరిన వారికి తప్ప నేనిక్కడ చాలా మందికి తెలుసు. ఈ గ్రూప్‌లో చేరడం వల్ల మానసికంగా ఎంత గట్టిపడ్డానో చెబుతాను వినండి**

**ఈ గ్రూప్‌లో ఒక భాగాన్నయినందు వల్ల వచ్చిన అనుభవం ఈ కష్టకాలాన్ని దాటటానికి ఆధార భూతమయ్యింది అంతులేని పరీక్షలు, దత్తత తీసుకోవటానికి అవకాశం వచ్చినట్లే వచ్చి జారిపోవటం, ఒక ప్రెగ్నెన్సీ –**

# మంత్రాల మహాత్మ్యం




ధర్మపథం

నమ్మిక ఉంటే ఏ మంత్రమయినా పనిచేస్తుంది మంత్రశక్తిని విశ్వసించేవారు మనలో చాలామంది ఉన్నారు తేలు కుట్టినా, పాము కాటు వేసినా మంత్రశక్తి వల్ల ఆ బాధ నశించడం మనం చూస్తూనే ఉన్నాము ఇలాగే భగవంతునిపై భక్తి కలిగి మంత్రోచ్చారణ చేస్తే అద్భుతమైన సంఘటనలు జరుగుతాయి పంచాక్షరీ జపం, అష్టాక్షరీ మంత్రజపం చాలా ప్రసిద్ధమైనవి 'ఆ విధంగానే 'హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే' అనే షోడశాక్షరిని మననం చేసే భక్తాగ్రేసరులకు అసాధ్యం ఉండదు దానివల్ల అరిషడ్వర్గమూ, గుణత్రయమూ, అవస్థాత్రయమూ, అంతఃకరణ చతుష్టయమూ నశిస్తాయి ఆనందం ఒక్కటే మిగులుతుంది ఇది చాలాసులభోపాయం

బోధలబాబా అనే పాండురంగ భక్తుడు సదా భగవన్నామ సంకీర్తన చేస్తూ, షోడశాక్షర మంత్రాన్ని మననం చేస్తూ జనాన్ని ఆకర్షించేవాడు ఆతని బోధల ప్రభావం వల్ల ఎందరో భక్తులయి, నిత్యమూ ఆయన వద్దకువచ్చి సంకీర్తనలో ఆయనను కలుసుకునేవారు అందరూ సంకీర్తన చేస్తూ పరవశులయిపోయేవారు

ఒకనాడు కొందరు భక్తులు ఆయన వద్దకు వస్తూ ఉండగా, ఒక భక్తుణ్ణి పాము కరిచింది వెంటనే అతడు మరణించాడు అయినా బాబా చేసిన నామసంకీర్తన వినకుండా వెళ్ళిపోవడానికి అతనితోడి భక్తులకు ఇష్టం లేకపోయింది వారు, ఆ మృతుని దేహాన్ని మోసుకునే బాబా వద్దకు వెళ్లారు వారతనిని ఒక చెట్టునకు చేరబెట్టి బాబా కృష్ణ నామ సంకీర్తనామృతం పానం చేస్తూ తన్మయులయారు బాబా, ఆ మృతుని నిద్రపోతున్నవానిగా భావిస్తూ, 'నాయనా! నామ సంకీర్తన వినకుండా నిద్రపోతున్నావేమి?" అని ప్రశ్నించాడు సమాధానం రాలేదు 'తమస్సును విడిచి మేలుకో" అని హెచ్చరించారు మిగిలిన భక్తులు "అతడు పాము కాటు వల్ల మరణించాడు' అని చెప్పారు "నామ సంకీర్తనం పరమ పావనమైనది అన్ని విషాలనూ హరింపజేస్తుంది' అని ఆతని వద్ద మనోహరంగా షోడశాక్షరిని గానం చెయ్యగా, ఆ మంత్రం వల్ల సర్వ విషం హరించిపోయి, మృతుడైన ఆ భక్తుడు నిద్ర నుండి మేల్కొన్నట్లు తిరిగి జీవించాడు దీనివల్ల ఆ మంత్ర మహిమ ఎట్టిదో తెలుస్తున్నది ఈ మంత్రం పాశ్చాత్యులనుకూడా ఎంతో ఆకర్షిస్తున్నది

— బులుసు వేంకట రమణయ్య

# మల్లిక

దానితో పాటే వచ్చిన ఆశ, ఆ వెంటనే మిస్ కారేజి, తర్వాత హాస్పటళ్ళు, కన్నీళ్ళు— ఎక్కడున్నావ్ గొంగళీ అన్నట్లు మళ్లీ మొదటికే రావటం మళ్ళీ పరీక్షలు, మళ్ళీ ట్రీట్‌మెంట్ వగైరా, వగైరా నరకమంటే ఎక్కడో లేదు అనిపించే పరిస్థితి! అట్లాంటి సమయంలో, తోడుగా నిలిచింది ఈ గ్రూపే! ఈ గ్రూపే లేకపోతే ఏమయ్యుండే వాళ్ళమో అనిపిస్తుంది అప్పుడప్పుడూ

దగ్గరి ఫ్రెండ్‌తో కూడా చెప్పుకోలేని మనస్సులోని భయాలు, బాధలు ఇక్కడ నిస్సంకోచంగా చెప్పుకోవచ్చు ఎవరైనా నవ్వుతారేమో, ఎగతాళి చేస్తారేమో అనే అనుమానం అక్కరలేదు ఇక్కడ అట్లాంటి వాళ్ళెవ్వరూ వుండరు ఇక్కడ అందరి బాధా ఒక్కటే!

ఆశ్చర్య మేమిటంటే, ఇక్కడ ఇన్‌ఫర్టిలిటీకి పరిష్కారం పొందక పోయినా ఈ పరిస్థితిని ఎలా డీల్ చెయ్యాలో నేర్చుకున్నాను ఏదో తెలియని కసినుండీ, దుఃఖాన్నుండీ విముక్తి పొందాను మరీ భవిష్యత్తులోకి సాచి చూడకుండా ఏ రోజు ఇచ్చేదాన్ని ఆ రోజు అనుభవించాలని, ఆనందించాలని నిశ్చయించుకున్నాను ఇప్పుడు మళ్ళీ మా జీవితాన్ని మా చేతుల్లోకి తీసుకున్నామనే భావన కలుగుతోంది పిల్లలు పుడితే పుడతారు లేదా దత్తత తీసుకోవచ్చు— అనే నిశ్చయం మా ఆత్మ విశ్వాసాన్ని పెంపొందిస్తోంది. ఇదంతా ఈ సపోర్ట్ గ్రూప్ ఇచ్చిన మనోబలమేనని నా నమ్మకం!"

తర్వాత మేడలిన్ అన్న అమ్మాయి చెప్పటం ప్రారంబించింది.

"అయిదేళ్ళ క్రిందట ఈ గ్రూప్ గురించి టి వి లో మొట్టమొదటిసారిగా విన్నాను అప్పటికి మాకు క్రొత్తగా పెళ్ళయ్యింది పిల్లల గురించిన ఆలోచన లేదు అప్పట్లో పిల్లల దేముంది సంవత్సరం తిరిగేసరికల్లా పుడతారు, ఈ లోపల జీవితాన్ని ఎంజాయ్ చెయ్యాలనుకునే ధీమది.

మూడు సంవత్సరాలు గడిచాయి అనుకున్నట్లుగా సంవత్సరం తిరిగేసరికి పిల్లలు పుట్టలేదు ఎన్నో ఉద్యోగాలు, ఎన్నో చోట్లు, ఎన్నో వెకేషన్లు అయ్యాయి పిల్లలు కావాలనే కోరిక నెలనెలా పెరుగుతూనే వుంది

ఇప్పటికే మాకు పిల్లల్లేరు త్వరలో నే ఒక బేబీని దత్తత చేసుకుంటున్నాం అయినా, ప్రెగ్నెన్సీని గురించి ఇంకా ఆలోచిస్తూనే వున్నాం అయితే అదే అబ్సెషన్‌తో గాదు! మాదంటూ ఒక జీవితం వుందనీ, దాన్ని సాగించాలనీ తెలుసు ఇప్పటికే పుట్టని బేబీకోసం ఎన్నో పనులు వాయిదా వేసుకున్నాం. ఇంకా ఆ విషయంగా మిగిలిన సరదాలు ఒదులుకోదలుచుకో లేదు జీవితంలో ఒక నష్టం ఏర్పడినప్పుడు అది ఎలాగోలా పూడ్చుకోవాలే గాని దాని కారణంగా మిగతా జీవితాన్ని నేలపాలు చేస్తుకోకూడదనే విషయం తెలుసుకున్నాక ఇప్పుడు స్తిమితంగా వుండగలుగుతున్నాం '

(ఇంకావుంది)

Estd 1981




# ది సౌత్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మైనింగ్ & మైన్ సర్వేయింగ్

గూడూరు, నెల్లూరు జిల్లా.

బ్రాంచి : మైలవరం, కృష్ణా జిల్లా.

ఇండియాలో మొదటి 'రెసిడెన్షియల్' ఇన్‌స్టిట్యూట్

గత రెండు సం లలో 50 మందికి పైగా మా సంస్థ నుంచి పాసయి రు. 1000/- పైబడు జీతముతో ఉద్యోగము చేయుచున్నారు. ప్రస్తుతము దేశము మొత్తములో పాసవుచున్న వారిలో 60% మా సంస్థ విద్యార్థులే. మాసంస్థ నిర్వహించు 2 సం.ల కోర్సులు- 1. మైన్ సర్వేయింగ్ 2. మైన్ ఫోర్‌మెన్ మా సంస్థలో చేరుటకు S.S.C. పాసయి వుండుట కనీసార్హత. ఇంటరు, డిగ్రీ చదివినవారికి ప్రాధాన్యత. కనీస వయస్సు 18 సం

**1985-86 సం. అడ్మిషన్లు ప్రారంభం.**

అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్ కొరకు రు 10/- M.O. చేయండి.

ప్రిన్సిపాల్.

# భారతి

## సాహిత్య మాసపత్రిక

తెనుగువారి సంస్కృతికి ప్రతిబింబం



**విడి పత్రిక : రూ. 4/-**

# రు. 40,000 విలువచేసే బహుమతులు గెలవండి

**NATIONAL SALES** announce this Sales Promotion Plan to popularise their products.

1వ బహుమతి యెజ్డీ మోటారు సైకిలు లేదా రు 13,000 నగదు

రెండవ బహుమతులు కలర్ టివి లేదా రు 9,000 నగదు ఒక్కొక్కటి

మూడవ బహుమతులు • తగ్గింపు ధర రు. 500/-కు మూడు స్పీడులుగల మిక్సర్-కమ్-గ్రైండర్లు / OR TAPE RECORDER

• తగ్గింపుధర రు 325/-కు రెండు స్పీడులుగల మిక్సర్-కమ్-గ్రైండర్లు.

• తగ్గింపుధర రు. 225/-కి రెండు బ్యాండ్‌ల ట్రాన్సిస్టర్లు. OR TWO-IN-ONE AT REDUCED RATE RS 900/-

ఈ క్రింది మూడు లైనులలో మేము పదకొండునుంచి 19 వరకు అంకెలను, ఎటునుంచి కూడినా మొత్తం నలభైఅయిదు వచ్చే విధంగా ఉపయోగించాము

| | | |
|---|---|---|
| పన్నెండు | పదిహేడు | పదహారు |
| పందొమ్మిది | పదిహేను | పదకొండు |
| పద్నాలుగు | పదమూడు | పద్దెనిమిది |

మీరు చేయవలసినది :. అదే విధంగా మీరు పన్నెండు నుంచి ఇరవై వరకు అంకెలను మూడు లైనులలో ఎటు వైపు నుంచి కూడినా మొత్తం నలభై ఎనిమిది వచ్చే విధంగా ఉపయోగించవచ్చును ఒక అంకెను ఒకసారి మాత్రమే ఉపయోగించాలి






మీ ఎంట్రీలను తెల్లకాగితం పైన లేదా పోస్టు కార్డు పైన ఇంగ్లీషు లేదా హిందీలో మాత్రం వ్రాసి 15 రోజులలోగా పంపించండి ఎక్కువ మంది ఎవరిని ఎంపిక చేసుకుంటారో దానిని బట్టి కరెక్టు పరిష్కారాన్ని నిర్ధారిస్తారు ఆ వారంలో అందిన కరెక్టు ఎంట్రీలు ఆధారంగా ప్రతి వారం తగ్గింపు ధరలకు బహుమతులను యిస్తారు. విజేతలకు పోస్టు ద్వారా తెలియపరుస్తారు జడ్జిల నిర్ణయం తుది నిర్ణయం అన్ని వివాదాలు ఢిల్లీ న్యాయస్థానం పరిధికి లోబడి ఉంటాయి

**NATIONAL SALES CORPORATION** (TL)

**Post Bag No. 9, Patel Nagar, New Delhi-110008**

# వ్యర్ధజీవి

"మిర్రర్"



కాంతారావు గారి మరణవార్త విని నేను కొయ్యబారి పోయాను

కాంతారావు గారితో నా పరిచయం ఈనాటిది కాదు గత ఆరేళ్ళుగా ఆయన నాకు తెలుసు

నేను ఈ సంస్థలో ప్రవేశించిన తొలి రోజులలో నన్ను ఆయనకి అసిస్టెంట్‌గా వేశారు అయితే, ఆయన నన్ను అసిస్టెంట్‌గా మాత్రమే చూడలేదు

మా ఇద్దరి మధ్య క్రమంగా మాటలలో వివరించ లేని అలౌకిక బంధం పెంపొంద సాగింది

పాతి కేళ్ళ వయసులో వున్న నాకు నలభై అయిదేళ్ళు దాటుతున్న ఆయనకి మధ్య ఏర్పడిన ఈ అవినాభావ బంధం అందరినీ ఆశ్చర్య పరిచేది

ఆయన కింద అప్పట్లో దాదాపు నలుగురు అసిస్టెంట్లు వుండేవారు అందరిదీ తలా ఒక ధోరణి ఎట్టి పరిస్థితులలోనూ తమ ధోరణికి భిన్నంగా వ్యవహరించని తత్వం కలిగి వుండేవారు వారి నందరిని సమన్వయ పరిచి ఆఫీసు పని చేయించటంలో కాంతారావు గారి నేర్పు, శాంత స్వభావం, వారిలో గల ప్రత్యేకతల్లో కొన్ని మాత్రమే

తమ కింది వారి మొండి వైఖరి వల్ల జరిగే అవకతవకలు ఆయన ఓర్పుగా సరిదిద్దటం ఆయన ఔన్నత్యంగా కనపడేది కఠిన చర్య తీసుకోవలసిన సందర్భాలలో కూడా, కింది వారిని ప్రేమతో మందలించి వూరుకునే వారు ఆయన వారి పట్ల కనపరిచే సమభావం నన్ను మరింత ఆయన పట్ల ఆకర్షితుడను చేయసాగింది

ఒక్క ఆఫీసు విషయాలలో నే కాక ఆయన జీవితం పట్ల కూడా గొప్ప అవగాహనతో ఉన్నత విలువలు కలిగి వుండేవారు

నావయసు యువకులలో, ప్రాపంచిక విషయాల పట్ల సాధారణంగా ఏర్పడే మోజుకు నేను గురికాకుండా, జీవితం పట్ల సదవగాహన ఏర్పరచు కోవటానికి ఆయన చెప్పే విషయాలు నాకు బాగా ఉపకరించాయి

ఆయన వద్ద పని చేసినంత కాలం నేను అదొక రకమైన ఆత్మానందం పొందేవాడిని

కాంతారావు గారు కూడా నన్నెప్పుడూ తన స్వప్రయోజనాలకి ఉపయోగించుకోలేదు

మనిషి మనిషికి మధ్య సంబంధం ఎంత నిస్వార్థ పూరితంగా వుంటే, అంత ఎక్కువగా మన సమాజంలో మానవులకి మనుగడ సులభతరం అవుతుందని ఆయన అంటూ వుండేవారు

అందుకే కాంతారావు గారు తమ స్వభావానికి విరుద్ధంగా వ్యవహరించ లేక జీవితంలో అనేక సందర్భాలలో స్వసుఖాన్ని కూడా ఎదుటి వారికోసం త్యాగం చేసేవారు పర్యవసానంగా, సాటి వారిలా ఆయన ఆస్తులు పెంచుకోలేక పోగా, బరువులు, బంధాలు మాత్రం పెంచుకున్నారు

ఆయనకి నలుగురు పిల్లలు మొదటి సంతానం గోపాలం బి యే చదివి నిరుద్యోగ పర్వంలో వుండేవాడు

తరువాత కమల ఇరవై ఏళ్ళు ఇంటరుతో చదువు ఆగిపోయింది. పెళ్ళి చేయాలనే కాంతారావు గారి ప్రయత్నం, పెద్ద కట్నం ఇవ్వలేని కారణంగా ఫలించలేదు

ఆ తరువాత ఇద్దరు స్కూలు చదువులో వున్నారు

వీరు కాక తల చెడిన అక్కగారు, వృద్ధాప్యంలో వున్న తండ్రి, ఆ ఇంట్లో అదనపు భారం. వీరంతా కాంతారావు గారి ఒక్క జీతం మీదనే బ్రతకాలి. వెనక ఆస్తులు లేవు ఓ చిన్న ఇంటిలో అద్దెకుంటూ, చాలీ చాలని ఆదాయంతో ఆ కుటుంబం కాలం గడుపుతూ వుండేది

ఆయన తరచూ నన్ను తమ ఇంటికి తీసుకు వెళ్ళే

వారు. ఆ రోజుల్లో ఆయన చెప్పిన పని చేయటమే కానీ ఎందుకు అన్న ప్రశ్న నాలో ఉదయించేదికాదు

ఈ పూట ఇక్కడే భోజనం చేసి వెళ్ళు అంటే అలాగే వుండి పోయేవాడిని

కాంతారావు గారి భార్య తన నలుగురు పిల్లలతో పాటు నాకూ భోజనం వడ్డించేది.

అయితే అలాంటి కాంతారావు గారు ఒక సందర్భంలో అనుభవించిన వ్యధ నేను ఎన్నటికీ మరిచి పోలేను

ఒకసారి మా ఇంటి నుంచి టెలిగ్రాం వస్తే సెలవు పెట్టి నా స్వంత ఊరు వెళ్ళాను. మా పెద్దల ఆజ్ఞ మేరకు పెళ్ళి చూపులు చూడవలసి రావటం, నా అభీష్టం మేరకు, శారదతో నా వివాహం నిశ్చయం కావటం చకచకా జరిగిపోయాయి.

సెలవు నుంచి తిరిగి వచ్చి ఆఫీసులో జాయిను అయిన రోజున, కాంతారావు గారికి నా పెళ్ళి నిశ్చయం అయిన విషయం చెప్పాను.

అది విని ఆయన కొంచెం సేపు చలనం లేని విగ్రహంలా వుండిపోయారు

తమ కుమార్తె కమలను నాకిచ్చి పెళ్ళిచేయాలనే అభిప్రాయం ఆయన కుండేదిట తను కట్నం ఇచ్చుకోలేని పరిస్థితి దృష్ట్యా వెంటనే ఆ విషయం నాతో ప్రస్తావించ లేక పోయారు తగిన సందర్భంకోసం ఎదురు చూస్తూ ఈలోగా నాకూ కమలకి మధ్య అవగాహన పెరుగుతుందన్న ఆలోచనతో ఆయన జాప్యం చేసారు

కానీ ఇంతలో ఇలా జరిగిపోయింది

అయితే, నేనెప్పుడూ కమలని ఆ దృష్టితో పరిశీలించలేదు కాంతారావుగారు ఈ విషయం చెప్పిన తరువాత కమల గురించి ఆలోచిస్తుంటి ఆమెతో నా జీవితం సుఖంగానే సాగుతుందని అనిపించింది

కానీ ఏమిటి ప్రయోజనం?

అనుకున్న విధంగా నాకూ శారదకి పెళ్ళి అయిపోయింది

తాను ఆశించినది జరగనందువల్ల కాంతారావుగారు బాధపడినప్పటికి, ఆ కారణంగా నన్ను మాత్రం దూరం చేసుకోలేదు

గతంలోలా నా పట్ల అభిమానం వ్యక్తపరచ సాగారు. అది వారి గొప్పతనం

కానీ కమలను పెళ్ళి చేసుకోకుండా నేను వారి కేదో ద్రోహం చేసినట్లు నాలో నేను మేధనపడేవాడిని.

కొన్నాళ్ళకి నాకు ఆఫీసులో ప్రమోషను రావటం, శారదకి అబ్బాయి పుట్టటం, నా జీవితంలో వచ్చిన కొన్ని మార్పులు.

అయితే కాంతారావుగారి కుటుంబంలో ప్రతి ఒక్కరూ మార్పులేని జీవితానికి అలవాటు పడిపోయారు.

ఉద్యోగం రాక మరింత వైరాశ్యంలో రోడ్డు పట్టుకు తిరుగుతున్న గోపాలం-

పెళ్ళి కోసం ఎదురు తెన్నులు చూసే కమల-

మృత్యువు పిలుపు కోసం ఎదురు చూసే వృద్ధ తండ్రి-

అందరికీ వండి పెడుతూ జీతం లేని చాకిరీ చేసే కాంతారావుగారి విధవ అక్కగారు-

పిల్లల బాగోగులు పట్టించుకోవటం లేదని అనుక్షణం పోట్లాడే కాంతారావుగారి భార్య-

తన స్వభావం మార్చుకుని స్వార్థప్రయోజనాలకి పాటుబడని కాంతారావుగారు-

-ఈ సజీవమైన పాత్రలతో ఆ యిల్లు ఎప్పుడూ చీకటి గృహంలా, విషాద దేవత మంధిరంలా వుండేది

నాకూ ప్రమోషను రావటంతో సీటు మారింది

మారిన సీటులో కొత్త వ్యక్తుల మధ్య జీవితం నిస్సారంగా గడవసాగింది.

ఇలా వుండగా మా డిపార్ట్మెంట్ వారు, మా కేడర్ వారికి ఏర్పరచిన "రిఫ్రెషర్ కోర్సు"కి నేను కూడా వెళ్ళవలసి వచ్చింది.

దాదాపు ఆరునెలల కాలం జబల్‌పూరులో వుండి ఆ కోర్సు ముగించుకుని వచ్చేసరికి-

కాంతారావుగారి మరణ వార్త తెలిసింది వారు మరణించి నాలుగు నెలలు అయిందట. ఆకస్మిక మరణానికి వైద్యశాస్త్రంలో కారణాలు ఉండ వచ్చేమో-

కానీ, నా మట్టుకు నాకూ ఆయన కూతురు పెళ్ళి కానందుకూ, కొడుకుకి ఉద్యోగం రాలేదన్న దిగులుతో చనిపోయినట్లు అనిపిస్తుంది

కమలను నేను పెళ్ళి చేసుకుని వుంటే, కాంతా రావుగారు మరణించి వుండేవారు కాదేమో?

ఆయన బ్రతికి వుండగా నేను ఏ సహాయం చేయలేకపోయినందుకూ బదులుగా ఇప్పుడూ నా అంతట నేను ముందుకు వచ్చి ఆ కుటుంబానికి చేతనైన సహాయం చేయటం నా కర్తవ్యం అని నా




అంతరాత్మ బోధించసాగింది

అయితే కాంతారావుగారు బ్రతికి వున్నప్పుడు పరిష్కరింపబడని సమస్యలు ఆయన పోవటంతో మరెంత జటిలం అయ్యాయో అని మనసులోనే దిగులు చెందసాగాను

ఆ సమస్యలు విడదీయటం నాకూ ఎంత వరకు సాధ్యపడుతుంది?- అన్న ప్రశ్న నాలో ఉదయించక పోలేదు

నేను ఏం చేయాలనేది అక్కడి పరిస్థితి మీద ఆధారపడి వుంటుంది

కానీ కుటుంబ పెద్ద మరణం కారణంగా దుఃఖంలో వున్న వారిని పరామర్శించటం అనేది చిన్న పని కాదు. ఆ పని నిర్వహించబోయే వారికి తగినంత వయసు, జీవితం పట్ల అవగాహన వుండాలి. మరి ఆ అర్హతలు నాకు వున్నాయా అని క్షణం సేపు ఆలోచించాను.

సాయంకాలం ఆఫీసు అయిపోయిం తరువాత కాంతారావుగారి ఇంటికి బయలుదేరాను

ఆయన మలక్‌పేట టి. వి. టవర్ ఎదురుగా వున్న బజారులో అద్దెకుండే వారు.

ఆ ఇల్లు చేరేసరికి, ఆ ఇంటి వాతావరణం నన్ను ఆశ్చర్యపరిచింది.

ఇంటి పెద్ద మరణించటంతో ఏర్పడే విషాద వాతావరణం అక్కడ అణుమాత్రం అయినా కనిపించలేదు

ఒక్కొక్కరిని ఎలాంటి స్థితిలో చూడవలసి వస్తుందో అనుకున్న నా అంచనా తారుమారు అయిపోయింది

ముందు రూములు నీటుగా కుర్చీలు అమర్చి వున్నాయి టీపాయి మీద వున్న ఒక పెద్ద సైజు టు-ఇన్-వన్ స్టీరియోలో హెచ్చు స్వరంతో మ్యూజిక్ విన వస్తుంది కాంతారావుగారి ఆఖరి పిల్లలు ఇద్దరూ మ్యూజిక్‌కి అనుగుణంగా అడుగులు వేస్తున్నారు.

నా రాక గమనించి ఒకరు లోపలికి వెళ్ళి వార్త అందజేశారు

కాంతారావుగారి భార్య వరండాలోకి వచ్చి నన్ను కుశల ప్రశ్నలు వేసింది నాభార్యాపిల్లలు గురించి అడిగింది పిల్లలను నాతో తీసుకు రానందుకూ ఆగ్రహించింది

నేను వచ్చిన పని మరిచిపోలేదు

కానీ ఆ విషయం ప్రస్తావించకూడని పరిస్థితిలో వుండిపోయాను

కాంతారావుగారి మరణం ఆ కుటుంబంలో ప్రతి ఒక్కరిని బాధలనుంచి విముక్తులను చేసినట్లు తెలుస్తుంది

ఆయన భార్య చెప్పిందాన్ని బట్టి-

కాంతారావుగారి మరణం తరువాత, ప్రావిడెంట్ ఫండ్, గ్రాడ్యుయిటీ, ఇన్సూరెన్సు మొదలగు వాటికి సంబంధించిన డబ్బు హెచ్చు మొత్తంలో ఒకేసారి

# ఇప్పటికీ జన్యు చికిత్స ఉత్త మాటేనా?






జీవితపు మపులిక విలువలను మార్చే జన్యు చికిత్సను గురించి లోతుగా పరిశోధనలు జరువుతున్నప్పటికీ, ఆ చికిత్స ఇంకా అందుబాటులోకి రాలేదనే అనిపిస్తుంది

వాషింగ్‌టన్ విశ్వవిద్యాలయానికి చెందిన రిచర్‌డ్ పామిటర్, పెన్‌సిల్‌వేనియా విశ్వవిద్యాలయానికి చెందిన రాల్ఫ్ బ్రిన్‌స్టర్- అనబడే జన్యు-శాస్త్రజ్ఞులు- చుంచెలుకలలో జన్యు చికిత్సను జరిపి, ఆ చికిత్సను అదుపులో పెట్టడానికి తగిన నిర్దిష్టమైన సాంకేతిక నైపుణ్యాన్ని ఇంకా పొందు పరచుకొవలసి ఉందని స్పష్టంగా ప్రకటించారు

ఇ టీవల ఈ శాస్త్రజ్ఞులు చుంచెలుకల సంయుక్త బీజ కణాలతో రెండు జన్యువులను ప్రయోగాత్మకంగా పొందు పరచి వాటిని గర్భకోశాల-లోపల వదలి పెట్టి, యధావిదిగా పిండోత్పత్తి దశలను కొనసాగనిచ్చారు ఈ రెండు జన్యువులలో ఒకటి పెరుగుదలకు కారణమైన హార్మోనును స్రవింపజేసేది మరొకటి ఈ హార్మోన్ జన్యువును ఉత్తేజపరిచేది అంతే కాదు లోహ మూలకాల వల్ల కలిగే విష ప్రబావాన్ని అరికట్టే మెటల్లో దయోనిన్ అనే సంక్లిష్టాన్ని కూడ ఏర్పరిచే శక్తి ఈ జన్యువుకు ఉంటుంది

జింకు లోపం అధికంగా ఉండె ఆహారాన్ని సమకూర్చకముందే ప్రయోగానికి గురి కాబడ్డ చుంచెలుకలు ఊహాతీతమైన పెరుగుదలను చూపడం ఆసక్తిని కలిగిస్తుందని పామిటర్, బ్రిన్‌స్టర్‌లు అంటారు జింకు ఉన్న అహారాన్ని సమకూర్చిన వాటి పెరుగుదల కూడ అదే విదంగా ఉంది పోతే- ఆహారంతో సంబందం లేకుండా- మామూలు చుంచెలుకల కన్నా జన్యు చికిత్సకు గురి చెయ్యబడ్డవి రెండు మూడు రెట్లు అధికంగా ఎదగడం ఎవరైనా గమనించగలరని ఈ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు

జన్యువును ఏ బాగం నుంచి ఎంత సున్నితంగా వెలుపలికి తీయాలో, ఏ మోతాదులో పరిగ్రహింపచాలో- ఎక్కడ, ఏ విధంగా అమర్చాలో- ఈ క్షణం వరకు ఎవరికీ స్ఫుటంగా తెలియదని, జరుగుతున్న పరిశీలనలన్నీ ఈ ప్రక్రియను ప్రమాణీకరించడానికేనని - ఈ శాస్త్రజ్ఞులు అనడంలో అనవుచిత్యమేమీ లేదు వీరి ప్రయోగ పలితాలను నేచర్ అనే పరిశోధనా పత్రిక ప్రచురించింది

ఈ లెక్కన జన్యు చికిత్సని మానవులలో నిరపాయకరంగా జరపటానికి మరి కొంత కాలం పట్టవచ్చు!

—రబా

**అందింది.**

**అనుకోకుండా వచ్చిన డబ్బుతో –**

**డబ్బుతో పరిష్కరించగల సమస్యలన్నింటినీ పరిష్కరించుకున్నారు**

**లంచం పెట్టి గోపాలం ఉద్యోగం కొనుక్కున్నాడు**

**కోరిన కట్నం ఆఫర్ చేసి కమలకి పెళ్ళి సంబంధం నిశ్చయం చేసారు.**

**ఆ విషయాలు ఆమె ఉత్సాహంగా చెప్పుకుంటూ పోవటం చూస్తే, కాంతారావుగారు చనిపోయినందుకూ ఆమె సంతోషిస్తున్నట్టుగా వుంది**

**ఇంటిలో అంతకు ముందు గల దారిద్ర్యాన్ని ప్రతిబింబించే ప్రతి వస్తువునూ బయట పారేసి కొత్త వస్తువును ఏర్పాటు చేసుకున్నారు**

## వ్యర్థజీవి

**ఇల్లు చాలటం లేదని అదే బిల్డింగ్‌లో మరో రెండు గదులు తీసుకున్నారు.**

**ఓనరుతో చెప్పి రిపైర్లు, రంగులు వేయించి ఇంటికి అందం తెప్పించారు**

**డబ్బుతో కొనగల సుఖాలు అన్నీ కొనుక్కుంటున్నారు**

**సుఖం కారణంగా ఏర్పడిన తృప్తి వారి ముఖాలలో ప్రస్ఫుటంగా కనిపించసాగింది.**

**కాంతారావుగారి మరణం వల్ల వారు ఏ లోటుకూ గురి అవుతున్న ఛాయలు అగుపించలేదు.**

**కాంతారావుగారి భార్య తప్ప మిగిలిన వారు ఎవరూ నన్ను పట్టించుకోలేదు**

**ఆ స్థితిలో –**

**ఆ సమయంలో –**

**కాంతారావుగారి మరణం పట్ల సానుభూతి వ్యక్తపరచటం అసందర్భ ప్రస్తావనగా తేలిపోయింది**

**మనిషి మనిషికి మధ్య సంబంధం నిస్వార్థ పూరితమై వుండాలనే కాంతారావుగారు, తమ కుటుంబ సభ్యుల దృష్టిలో ఓ వ్యర్థజీవిగా మిగిలిపోయారు** □

# పొలిక్కని జైలి

## అలవాటులో పొరపాటు!

నౌత్ ఆఫ్రికాకు చెందిన ప్రభుత్వ లా మంత్రి ఓ అబద్ధం చెప్పి అసహ్యంగా పట్టుబడి, అవమానంతో తలొంచుకున్నాడట లాంగాలో వో శవ వూరేగింపు మీద పోలీసులు కాల్పులు జరిపిన వృత్తాంతంపై ఆయన మాట్లాడుతూ పోలీసులు ఆత్మరక్షణ కోసం కాల్పులు చేశారనీ, ఆ శవ వూరేగింపువారు పోలీసుపై సోడాబుడ్లూ, రాళ్లూ రువ్వారనీ చెప్పారట తీరా చూస్తే యీ కాల్పులకు అనుజ్ఞ ఇచ్చిన పోలీసాయన ఆ పనికి పశ్చాత్తాప్పడుతూ అలాటిదేమీ లేదనీ, వారు తమ కుటుంబంలో చనిపోయిన వారిని స్మశాన వాటికకు తీసుకు వెళ్తున్నారనీ అన్నారట దాంతో యీ లా మినిస్టరు లూయీస్‌లీ గ్రేంజ్ గారు 'నాలిక్కరుచుకున్నారట పోలీసుల దురాగతాలక్కడా వుండెనా'

## సంతృప్తి కలిగించని సారాయి పొట్లాలు!

కోదాడ గ్రామంలో సారాయి వ్యాపారులు నూరు గ్రాముల సారాయిని పాలిథిన్ ప్యాకెట్లలో అమ్మనారంభించారట సారాయి ప్రియులు యీ రకంగా ప్యాకట్లతో త్రాగితే తృప్తిగా లేదని, సీసాతోనో గ్లాసుతోనో త్రాగితే ఆ తృప్తి వేరనీ అంటున్నారట

## దున్నపోతు ఈనిందంటే ...!

బాంగ్‌కాక్‌లో 33 సంవత్సరాల బూన్‌సెంచొ కమెంగ్‌కాల్ అనే యువతి తాను రెండు గుడ్లను ప్రసవించినట్టు ఇద్దరు మంత్రసానులసహాయంతో ఆ పని జరిగినట్లు ప్రకటించిందట. ఈ వింత చూడవచ్చినవారు ఆమెను బహుమతులతో ముంచెత్తి ఆ గుడ్లను చూసి పోసాగారట చివరికి పోలీసులకు అనుమానం వచ్చి చూస్తే పరీక్షలో అవి ఉడకబెట్టిన బాతు గుడ్లని తేలిందట ఈ పని చేసిన ఆమెను, సహకరించిన ఆ యిద్దరు నర్సులను ప్రభుత్వం అరెస్టు చేసిందట

## అస్త్మాకి వెల్లుల్లి

వెల్లుల్లిపాయను కుమ్ములో పెట్టి పొద్దున్నే ప్రతి రోజూ తింటే అస్త్మా దరి చేరదట నెయ్యిలో వేయించుకు పొద్దున్నే తిన్నా కూడా అదే ఫలమట. ఈ అస్త్మా వచ్చినవారిది తింటే వ్యాధి తగ్గిపోతూందట – ఉల్లి – వెల్లుల్లీ రియల్లీ.

## భరణం కోసం వెళితే ...!

అస్సాముకు చెందిన ఖురదా గ్రామానికి చెందిన శైలబాల అనే ఆమెకూ ఆమె భర్తకు పడక విడాకులిచ్చుకున్నారట తత్ఫలితంగా వచ్చే భరణానికి ఆమె నెల నెలా మేజిస్ట్రేటు వద్దకు వెళ్లేదట ఓ రోజలా వొచ్చినామెనా మేజిస్ట్రేటు తన రూముకు పిలిచి తన కామదాహం తీర్చుకున్నాడట!

## పిల్లని ఎత్తుకుపోయిన సినీ నటి!

తన ఏడాది వయస్సున్న కూతురును కన్నడ నటి ఆరతి ఎత్తుకుపోయి, ఎక్కడో దాచేసిందని నటుడు రామకృష్ణ బెంగుళూరులో కోర్టుకు ఫిర్యాదు చేశాడట ఈ విషయం కోర్టు ఎక్కి గొడవ ఆరంభమయ్యాక, యిహ బాగుండదని నటి ఆరతి ఆ పిల్లను యిచ్చేయడానికి సమ్మతం తన లాయరు ద్వారా తెలియపరచిందట

## చదువుపై సినిమాల ప్రభావం?

ఉదయం ఆటలు, పన్నెండు గంటల ఆటలూ, మ్యాటినీలూ, ఆవటాని రోజుకు ఐదాటలు సినిమాలు ముమ్మరంగా నడుస్తున్నాయనీ, పగటి పూట సినిమాల వల్ల విద్యార్థులు చదువుకు ఎగనామం పెట్టి ఉదయం నుంచి వుండే ఆటలలో తమ కనువైన ఆటలకు వెళ్లిపోతున్నారని, అందువలన వారి చదువుపై వారికి నిర్లక్ష్యం ఏర్పడుతోందని, కనుక యీ ఆటల్ని నిలిపితే అనే విషయం మీద ప్రభుత్వం ఆలోచిస్తోందని కర్నాటక భారీ మధ్యతరగతి పరిశ్రమల మంత్రి గారన్నారట - చావదలచుకున్న వారిని సర్వేశ్వరుడు కూడా కాపాళ్లేడు సార్!

## ప్లాస్టిక్ డబ్బాలని శుభ్రం చేసే చిట్కా!

ప్లాస్టిక్ డబ్బాలను శుభ్రం చేయడానికి మహిళాలోకం వో చిట్కా కనిపెట్టిందట సలసల కాగుతున్న నీటిలో సోడా ఉప్పు వేసి, ఆ నీళ్లు వాసన కొట్టే ప్లాస్టిక్ డబ్బాల్లో పోసి, వో రాత్రి వుంచితే, మరునాడు ఆ డబ్బాలు శుద్ధమైపోతాయట

## పరారైన పెళ్లికొడుకు!

తిరునల్వేలికి చెందిన కళక్కోడు గ్రామంలో 29 ఏళ్ల జయరాజ్ అనే అతనికి పెళ్లి నిశ్చయించారట ముహూర్తం ముందు రోజే ఆడ పెళ్లివారు పెళ్లికూతురు ముత్తులక్ష్మితో మగ పెళ్లివారింటికి వచ్చి చేరారట కానీ ముహూర్తం వేళకి పెళ్లికొడుకు కనబడలేదట 'ఎచట' అని తమిళంలో గందరగోళం పడితే ఏవో సరుకులు కొనడానికి తిరునల్వేలి వెళ్లినట్టు తేలిందట వస్తాడని చూస్తే మర్నాటికి కూడా రాపోయేసరికి ఆడ పెళ్లివారిహ లాభం లేదని వెళ్లిపోయారట పెళ్లికొడుకును ఎవరో ఎత్తుకుపోయుంటారని అతని అన్నగారు పోలీసు రిపోర్టిచ్చాడట □





# ఆరుద్ర షష్టిపూర్తి ఉత్సవం

సుప్రసిద్ధ కవి, రచయిత, విమర్శకుడు, సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రకారుడు ఆరుద్రగారికి ఆగస్టు 31న అరవై యేళ్ళు నిండుతాయి ఆ సందర్భాన్ని పురస్కరించుకొని 1985 సెప్టెంబరు 1వ తేదీన మదరాసులో ఆయన షష్టిపూర్తి వేడుకలు జరపటానికి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులుగా ఒక ఉత్సవ నిర్వహణ సంఘం ఏర్పాటై సన్నాహాలు జరుపుతున్నది ఈ సంఘానికి ఉపాధ్యక్షులుగా ప్రముఖ పారిశ్రామిక వేత్త పి. ఓబుల్‌రెడ్డిగారు, కన్వీనరుగా శ్రీ రాజాలక్ష్మీ ఫౌండేషన్ మేనేజింగ్ ట్రస్టీ ఏ వి రమణయ్య రాజాగారు వ్యవహరిస్తారు ఈ సంఘంలో మరి పలువురు చెన్నై నగర ప్రముఖులు సభ్యులుగా ఉన్నారు

ఈ ఉత్సవ సందర్భంలో తెలుగు సాహిత్యం, తదితర లలిత కళలను గురించీ, ఆరుద్రగారి సాహితీ కృషిని గురించి, ఆయన జీవిత విశేషాలను గురించీ ప్రముఖ రచయితల,పండితుల రచనలతో ఆరుద్ర అభినందన సంచికను ప్రచురిస్తారు ఈ సంచికకు రచనలు పంపవలసిందిగా ప్రసిద్ధ రచయితలకూ, పండితులకూ ఈ ఉత్సవ సంఘం కన్వీనర్ రమణయ్య రాజాగారు విజ్ఞప్తి చేస్తున్నారు

# అవీ ఇవీ అన్నీ

# మాట విని పని చేసే టెలిఫోను!

**స్వరశక్తితో పనిచేయగల నూతన కంప్యూటర్ సాధనం సహాయంతో, టెలిఫోనులో మనకు కావలసిన నంబరును అడిగి పొందవచ్చును**

కాలిఫోర్నియాకు చెందిన ఎలెక్ట్రానిక్స్ సంస్థ, టి టి సి రూపొందించిన ఈ టెలిఫోను పేరు 'డయలెక్స్-IV" ఒక మీటరు దూరంనుంచి ఇది గొంతుకలను "వినగలదు నలుగురు కుటుంబ సభ్యుల గొంతుకలను ఈ టెలిఫోను గుర్తించ గలదు 80 టెలిఫోను నంబర్లను 'స్టోర్' చేసి కోరినప్పుడు తక్షణం పొందవచ్చు ఇతర నంబర్లను మనం నోటితో చెబితే చాలు, టెలిఫోను స్వయంగా "డయల్" చేసుకుంటుంది

అత్యవసర పరిస్థితులలో, ఇంటి యజమాని టెలిఫోను అందుకోలేని స్థితిలో ఉన్నప్పుడు ఈ ఫోను అందుకోగలదు. "డాక్టర్" అని అరవడంతో ఈ టెలిఫోను డాక్టరును పిలవగలదు పిలిచిన వారు తాము ఉన్నచోటు నుంచే డాక్టరుతో మాట్లాడే వీలుంటుంది! ☐

# వేముగంటివారి సాహితీ పురస్కారం యువ కవులకు ఆహ్వానం

సిద్దిపేటలోని సాహితీ వికాస మండలి ఆధ్వర్యంలో యువ కవులను ప్రోత్సహించడానికి సంస్థాపక అధ్యక్షులు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు తమ వంశం పేర ఒక సాహితీ పురస్కారం నెలకొల్పినట్లు ప్రతి సంవత్సరం సాహితీ వికాస మండలి జయంతి సందర్భంగా (అక్టోబర్-2) ఈ పురస్కారముగా రూ 216/- నగదు, ఒక జ్ఞాపిక బహూకరింపబడుతాయని సంస్థ ప్రదాన కార్యదర్శి శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్ ఒక ప్రకటనలో తెలియజేస్తున్నారు

ఇంతకు పూర్వం ఎట్టి బహుమతులు పొంది వుండని, 1982, అక్టోబరు నెలకు ముందు ప్రచురణ కాని, పద్య, గేయ, వచనపద్య, మినీ కవితా సంపుటాలేవైనా పంపవచ్చు, పరిశీలనార్థం నాలుగు ప్రతులు పంపాలి పేరికాదులు కాక కావ్యము 40, పేజీలకు తక్కువ ఉండరాదని ఆయన తెలిపారు స్వంత చిరునామాగల పోస్టలు కవరు జతపరచి రచనలు 1985 జూలై, 20వ తేదీలోగా సాహితీ వికాస మండలి, 7-4-75, పాతగంజు, సిద్దిపేట-502103 అన్న చిరునామాకి పంపాలి

## కత్తుల పంజరం ఆవిష్కరణ

గుంటూరు, అనవేమా క్లబ్ ఆధ్వర్యంలో జరిగిన ఆళ్ళకృష్ణారామ నాటక కళాపరిషత్ తొలి రోజున శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు రచించిన 'కత్తుల పంజరం' కథల సంపుటిని శ్రీ జె బాపురెడ్డి ఆవిష్కరించారు శ్రీ ఆళ్ళ వెంకటేశ్వరరావు గారికి రచయిత తమ గ్రంధాన్ని అంకితం యిచ్చారు శ్రీ జూపూడి యజ్ఞనారాయణ రచయితను, కృతి స్వీకర్తను ఆశీర్వదించారు కథా సంపుటిలోని కొన్ని కథలను పుటంకిస్తూ శ్రీ ప్రసాదరాయకులపతి విశ్లేషాత్మక ప్రసంగం చేసేరు ☐

## ఆంధ్రసచిత్ర వారపత్రిక

# రచయితలకు గమనికలు

**ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్న వారు**

**సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003.**

**అన్న చిరునామాకి వ్రాయాలి.**

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి – హామీపత్రం జతచెయ్యాలి

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కధలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు – వారి స్వంత చిరునామాగల తగినన్ని **తపాలాబిళ్ల** లంటించిన కవరు పెట్టడం అవసరం

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని– తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు – రచన పేరు – అది పంపినతేదీ, వాటి గురించి **వివరంగా తెల్పనిదే** పరిశీలించడం కష్టం

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్లలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను – కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. **సం॥**

---

# ఉత్తరాలు...

**( 4 వపేజీ తరువాయి)**

## కీ. శే. సుందరయ్య

ఈ వారం (31 మె, జూన్ 6–85) సంచికలో బారత కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, నిస్వార్ధ ప్రజా సేవకుడు, స్వాతంత్ర్య యోదుడు ఆయిన శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు స్వర్గస్తులైనారని చదివి మరోమారు విలపించకుండా వుండలేక పోయెము (వారి మరణం గురించి అంతకుముందె విన్నాము) శ్రీ సుందరయ్యగారిని గురించి మీరు క్లుప్తముగా ప్రచురించిన విషయాలు వారి వ్యక్తిత్వానికి, నిరాడంబరతకు నిస్వార్ధసేవకు స్మృతి చిహ్నాలుగా చిరస్మరణీయములై మా మదిలో నిలిచినవి అయిదు దశాబ్దాలకు పైగా పీడిత ప్రజల సేవకి తమ జీవితాన్ని అంకితం చేసిన సుందరయ్య మృతికి మా సంతాపాన్ని తెలియ చేస్తున్నాము

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, బద్దుమాసింగి

## జ్ఞానోదయం

14–6–85 వారపత్రికలో మీరు ప్రచురించిన కాలువ శ్రీగారి–అడ్డాలనాడు కథ అత్యద్భుతంగా వుంది

నిజజీవితాలలో తల్లితండ్రులు పడేబాధలు తమ మగబిడ్డలు వయస్సు కులుకుచేత గర్వముతో తల్లిదండ్రులను హేళనగా చూడడం బాగా చిత్రీకరించారు వృద్ధాప్యం వచ్చిన తర్వాత – తల్లితండ్రులను చూడకుండా, పడుచు భార్యల మాటపై ఆదారపడే ఈతరం కుర్రవాళ్లకి యిది ఒక మంచి జ్ఞానోదయం రచయితగారికి నా ధన్యవాదములు

బాగవతుల శ్రీరామచంద్రమూర్తి,
గుమ్మడివారిపాలెం

## న్యూఢిల్లీ లేఖ

చాలాకాలం తరువాత డా జయ్ దుబాషీ జాతిని మేల్కొలిపే హెచ్చరిక చేసారు (24–30 మే పత్రిక). ఈ రోజు అకాలీలు మరో రోజు యింకొక వర్గం, మన దేశంలో భాష–మత–ప్రాంతీయోన్మాదం ఒకరి గొంతు మరొకరు పిసుక్కొనే స్థితికి తీసుకు వచ్చింది 'సిక్కుల ఆత్మగౌరవం' అంటూ చిన్న పొక్కులా బయలుదేరిన అకాలీ ఉద్యమం ఈనాడు రాచపుండులా మారి దేశాన్ని విచ్ఛిన్నం చేసేటంత ఉగ్రరూపం దాల్చింది

ఈ బూటకపు 'ఆత్మగౌరవం' ఉద్యమాలన్నీ ఒకే ఫక్కీలో నడపబడుతూ సామాన్య ప్రజల ఆర్థిక, సామాజకి స్థితిని ఏమాత్రం పెంపొందించకపోగా జాతి వైషమ్యాలను రెచ్చగొట్టి దేశ ఐక్యతను చిన్నాబిన్నం చెస్తున్నాయి అంతేకాదు ఈ సంకుచిత ఉద్యమాలలో మరణించిన అమాయక ప్రజల శవాలను మెట్లుగా వాడుకొని, నాయకులు సింహాసనాలు ఎక్కుతున్నారు ఈ ప్రక్రియ, రాజకీయ మరుగుజ్జులను, అజ్ఞానులను, మోసగాళ్ళను అక్రమంగా అధికారం పొందేలా చెయ్యటమే గాక దేశ ఐక్యత పునాదులనే కుదిపి వేస్తోంది

టి యస్ రావు, విశాఖపట్నం

## సీరియల్స్

7–13 జూన్ తేది పత్రికలో మొదలైన జిగి–బిగి సీరియల్ ప్రారంబంలోనే ఆకట్టుకుంది

యస్ రఘుకుమార్, నల్లగొండ

## పొరపాటు

31 మే– 6 జూన్ 85 సంచికలో విశ్వామిత్రుడంటే (ధర్మపథం) వ్యాసంలో వ్రాత పొరపాటున విశ్వ శబ్దానికి దీర్ఘం వస్తుందనడానికి బదులు మిత్ర శబ్దానికి దీర్ఘమని వ్రాయబడింది పాఠకులు దిద్దుకోవలెనని ప్రార్థన

–బులుసు వేంకట రమణయ్య □

## హైదరాబాద్ నోట్‌బుక్

## సూర్యారాయాంధ్ర నిఘంటువులో లోపాలు:-

సూర్యారాయాంధ్ర నిఘంటువులో ఎన్నో లోపాలున్నాయి అంతకు ముందున్న నిఘంటువులు చాలవరకు సాహిత్య పదకోశాలే కావడం వల్ల, సూర్యారాయాంధ్ర నిఘంటువు వ్యవహారంలో వున్న పదాలనూ చేర్చుకొన్నట్టు పండితులు చెప్పారు కాని రావు సాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారు దానిలో చేరని, చేరవలసిన, అర్థ న్యూనత, అపార్థాలున్న వేలకొలది పదాలు చూపుతూ పెక్కు వ్యాసాలు వ్రాశారు, ఎన్నో వాగ్వాదాలు చేశారు, ఆంధ్ర భిషక్కుల భాషా బేషజం వంటి గ్రంథాలు రచించారు అయన సూచించిన పదాలు చేర్చకుండా, మరికొన్ని తప్పులతోను "ప్రచురించింది ఆ నిఘంటువును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అలాటి పదాలను చర్చించి విడిగా సూర్యారాయాంధ్ర భాషా నిఘంటు పరిశిష్టము - అనే పేరుతో ప్రచురించే ఉద్దేశంతో తెలుగు గోష్ఠి జూన్ 9వ తేదీన తెలుగు బాషా సమితి కార్యాలయంలో సమావేశం జరిపింది శ్రీయుతులు చీమకుర్తి శేషగిరిరావు, డాక్టర్ ముదిగొండ వీరబద్ర శాస్త్రి, డాక్టర్ చింతా వేంకటేశ్వర్లు డాక్టర్ పి ఎస్ ఆర్ అప్పారావు, డాక్టర్ పి వి పరబ్రహ్మ శాస్త్రి, డాక్టర్ ఎన్ ఎస్ రామచంద్రమూర్తి, తిరుమల రామచంద్ర మున్నగువారు ఈ చర్చలలో పాల్గొన్నారు చర్చితమైన పదాలలో కొన్ని అంచనా = నమూనా, స్కెచ్చి, ఔట్ లైన్ అనే అర్థంలేదు ఆంధ్ర కోసల దేశాయ లేదు వేరు దేశాలు అంబలికి మూలం అమ్ల కావచ్చు అన్నం పులియబెట్టి పులినీళ్ళు తాగడం వుంది గనుక తత్సాదృశ్యంతో అమ్ల, అంబ్ల, అంబలి అయిందెమో! అ దప్పు - జాము సమయ సూచకంగా కొట్టడాన్ని బట్టి ఈ అర్థం వచ్చింది అడియాసకు అద్యాస మూలం కావచ్చు అన-స్వతస్సిద్ధమైన నీటి ఊట ఆనవేయు - ప్రారంభించు అబ్బురం - ఈ పదానికి మూలం అపూర్వం కావచ్చు ఐదు పది సేయు అంటే, రెండు చెతుల చెరి అయిదు వేళ్లను కలిపి పది చెయడం - నమస్కరించడం, దీనికి ముక్కలు చేయడం - ఐదు ముక్కలను పది చేయడం - కాదు అయిదువ అంటే బొట్టు, కాటుక మున్నగు ఐదు పునిస్త్రీ లక్షణాలు గలది అ విధవ - విధవకానిది అనే వ్యుత్పత్తులు సరికాదు శాసనాలలో సమర్థుడు అనే అర్థంలో అయిత అనే పదం వుంది దాని స్త్రీ వాచకం అయితువ, అయిదువ అయి వుండవచ్చు అయోమయం అనే దానికి ఇనుము సంబంధం అని మాత్రమే కాక, వ్యవహారంలో అగమ్యమనే అర్థం వుంది. దానిని ఇవ్వాలి అరకడ అనే పదానికి మూపు కంటే, చంకన అనే అర్థం సమంజసం

## కాంగ్రెస్ శత జయంత్యుత్సవం:-

బారత జాతీయ కాంగ్రెస్‌కు ఈ సంవత్సరం డిసెంబరుతో నూరేండ్లు నిండుతాయి ఆ సందర్భంగా దేశమంతటా జరుగుతున్న శత జయంత్యుత్సవాలలో భాగంగా జూన్ 12 వ తేదీన గాంధీభవన్‌లోని ప్రకాశం హాలులో శ్రీ జలగం వెంగళరావు అధ్యక్షతన జరిగిన ఉత్సవంలో కాంగ్రెస్ ఒక్కటే దేశ సమగ్రతను కాపాడి దేశానికి, ప్రజలకు అవసరమైన సేవ చేయగల సంస్థ అని పలువురు ప్రసంగించారు దేశంలో విచ్చిన్నకర ప్రవృత్తులు పెరిగిపోతున్నవని కొందరు హెచ్చరించడమే కాక, ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయాలని నొక్కి చెప్పారు ఉత్సవాన్ని ప్రారంభించిన శ్రీమతి శీలాకౌల్ తమ ప్రసంగంలో యువకులు బాధ్యత వహించి దేశాన్ని ప్రగతి పథంలో నడిపించాలని కోరారు శ్రీ వెంగళరావు తమ ప్రసంగంలో రాష్ట్రంలో కాంగ్రెస్ (ఐ) మళ్లీ అధికారంలోకి వస్తుందన్నారు కీలక ప్రసంగం చేసిన ఆచార్య రంగా స్వాతంత్ర్యోద్యమ చరిత్రను వివరించారు మాజీ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రసంగిస్తూ అది (తెలుగుదేశం పార్టీ) పోయే రోజు వస్తే, తానే పోతుందన్నారు కేంద్రమంత్రి శ్రీ అంజయ్య ప్రసంగిస్తూ, ఇప్పుడు రాష్ట్రంలో మాయాబజార్ నడుస్తున్నదని, ప్రాంతీయ పార్టీలు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనలేదని, ప్రస్తుతం ప్రాంతీయ పార్టీలపై స్వాతంత్ర్య పోరాటం కొనసాగించాలని అన్నారు తమ ప్రాంతం, తమ భాష అనే ప్రాంతీయవాదులు ప్రధానులు కాలేరని అన్నారు అలాటి స్వాతంత్ర్యోద్యమంలో అందరి కన్నా ముందు జైలుకు వెళ్లే యోధుడు తానేనని డాక్టర్ దాశరథి కృష్ణమాచారి ప్రకటించారు మరొక మాజీ ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి ప్రసంగిస్తూ, కొందరు తాము నాయకులు కావడానికి ప్రాంతీయతా వాదాన్ని రెచ్చగొడుతున్నారన్నారని విమర్శించారు శ్రీయుతులు కమాలుద్దీన్‌అహ్మద్, సి దాస్, ముకస్సిర్‌షా, కె రోశయ్య, బాగారెడ్డి, డాక్టర్ కుతూహలం, బి రామ్‌దేవ్ ప్రసంగించారు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి స్వాగతం చెప్పారు శ్రీ వి హనుమంతరావు చివరన ధన్యవాదాలు చెప్పారు శ్రీమతి శీలాకౌల్ శ్రీ జమలాపురం కేశవరావు రచించిన స్మారకములు - సంఘటనలు- స్వాతంత్ర్య సమరము అనే గ్రంథం ఆవిష్కరించారు కాంగ్రెస్ మాజీ అధ్యక్షుల ఫోటో ప్రదర్శనాన్ని ప్రారంభించారు వేదిక మీద స్వాతంత్ర్యోద్యమంతో సంబంధంలేని వారే చాలామంది వున్నట్టు కనిపించింది ఈ ఉత్సవం సందర్భంగా స్వాతంత్ర్యయోధులు కొందరు సన్మానింపబడ్డారు శ్రీయుతులు ఆచార్య రంగా, కె బ్రహ్మానందరెడ్డి, రావి నారాయణరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, టి హయగ్రీవాచారి, ఉమ్మెత్తల కేశవరావు, క్రొవ్విడి లింగరాజు, వాడ్రేవు జగ్గరాజు, మహమ్మద్ పరీద్ మిర్జా, అన్నాప్రగడ కేశవరావు, ఎన్ రుక్మారెడ్డి, వెంకట రాజేశ్వరజోషి, వెలువోలు సీతారామయ్య, మంగళంపల్లి చంద్రశేఖర్, కె కేశవరెడ్డి, బొమ్మ శేషురెడ్డి, గోపిడి గంగారెడ్డి, గురుజాడ రాఘవశర్మ, టి ముసలయ్య, సర్దార్ నాగప్ప, టి ఎస్ గుప్త, అనంతరామయ్యగుప్త, శ్రీనివాసఅయ్యంగార్, ఎస్ రఘునాధ్, ధ్రువసింగ్, భద్రిరాజురాజభూషణరావు, ఎం ఎస్ రాజలింగం, డాక్టర్ పి తిరుమలరావు, గొట్టిముక్కల రామచంద్రరాజు, హీరాలాల్ మోరియా, వెల్దుర్తి మాణిక్యరావు, డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు, బొడ్డపాటి సుబ్బారావు, ఆతోటి రమణ కవి, డాక్టర్ రంగనాధాచారి, సి దాస్, శ్రీమతులు విమలాబాయి మేల్కోటే, అన్నపూర్ణ, సూర్యదేవర అన్నపూర్ణ, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

## ఉపశ్రుతి :-

ఏ సభలోనైనా సన్మాన్యులను ఎక్కడ కూర్చోబెట్టాలండీ?- అని నన్నొకరు ప్రశ్నించారు వేదిక మీద -అని సమాధానమిచ్చాను. మరి జూన్ 12 న గాంధీభవన్‌లో జరిగిన కాంగ్రెస్ శత జయంత్యుత్సవంలో సన్మాన్యులయిన స్వాతంత్ర్య యోధులను కోర్టులో దవాలు బంట్రోతు పిలిచేట్టుగా పిలిచారే, వేదిక మీద కూర్చోబెట్టక? - అని మరొక ప్రశ్న వేశాడు అయన సన్మాన్యుల చేయి ఎప్పటికీ క్రిందే కదా? కనుక వాళ్లను వేదిక మీది కెందుకు? ఏదో బిచ్చమిచ్చి పంపేవాళ్లకు వేదికపై పెద్ద పీట కూడానా?- అని మా ప్రక్కన వున్న ఒకరు కండ్లెఱ్ఱ జేశాడు

-తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*




# ఆంధ్రపత్రిక

విజయవాడ - హైదరాబాద్